

భారతి, జూన్ '50

**మేఘనాథుడు**

చిత్రకారుడు: కీ. శే. శ్రీ కేలూరి రామమూర్తి.



వికృతి సం.
జ్యేష్ఠము

# భారతి

సంపుటము 27
సంచిక 6

# సాంసారిక తృష్ణ

●

శ్రీ కొండూరి నరసింహం

మంగళవాద్యఘోషలు సుమాంత్రికహేషలు బంధుభావ ల
గ్ధాంగిము ఖేందుభూషలు హృదంతరమన్మథరాణ్మనీషలున్
రంగుగ నాయెడంద కనుబ్రాయి తోలంగని భ్రాంతిరూపమా
యాంగణబద్ధబుద్ధి గలవానిని జేసె వివాహ మన్మిషన్......

ప్రణయినినిండుకౌగిట గుబాళుల నీను మధుప్రసక్తిలో
మణితనికూజితాంతరసుమానితగీతములందు డిందు ప్రే
మను గనుగొంద మన్న అవమానము నిత్యనికృష్టకష్ట జీ
వనము తరింపరానిగతి ప్రాప్తిలె ప్రాణములే వ్రణమ్ములై.

ఏ వాత్స్యాయనులో వచించినవి హాయిన్ జూపు ప్రాబంధిక
ప్రావీణ్యల్ తొడగొట్టి వ్రాసినవి సౌభాగ్యమ్ముగా ప్రాకృతీ
దేవారాధనలన్ లభించినవి సందేహంబు లేకుండ నా
భావాభ్యంచితజీవితాన వృథలై పర్వెన్ నిరాకారతన్...

బలిసిన పుస్తకాల ప్రతిపత్రములోని రసత్తరంగ సం
కులితకువర్ణనాగతుల కోర్కెను మున్గి మునింగి నేటి కీ
ప్రళయహాలాహలప్రచురబాధలలో తల నెత్తినాను హా
తెలిసితి కావ్యవర్ణన కుదేలయిపోయె యథార్థదృష్టిలో.

పిల్లల కీచులాట దురపిల్లెడి నౌకరులాగులాట గా
సిల్లగ భార్యయే వినుచు చీదరమాట బదుళ్ళు తీర్ప కో
పిల్లెడి సెట్టివేట ఎటు లేగిన శాంతి లభింపబోని యీ
జల్లెడబోలు జీవి మెగజల్లిన సన్మధురాంబుపూరముల్...

ప్రత్యూషమ్మున పద్మగంధమిళితప్రాచుర్యశైత్యానిల
ప్రత్యక్షప్రకృతిన్ లతాగృహములో భాసించ వాసించ నే
నిత్యంబున్ హృది వాంఛజేయ ఎటు లీ నిర్నిద్రభస్మాసుర
ప్రత్యగ్రప్రతిరోధలోక మిటు ప్రాప్తం బయ్యె సంసారికిన్...

ఔరా! పూర్వు లదేమి ప్రామికొన ని య్యర్థంబు కల్పించిరో?
సారాసారముల్ సుధావిషముల్ సంకీర్ణమై యుండుటే
ధారావాహిక మైన ప్రాణికి యథార్థం బైన రూపంబా? సం
సారం బన్న నెవండు వ్యాఖ్య నిడు నిస్సారం బటంచున్ భువిన్...

రక్తము చింది జీవితధరాతల మొక్క రణస్థలంబుగా
భుక్తము చేసికొన్న పటుబుద్ధికి మూడగు నాశ్రమంబులన్
శక్తి నశించిపోయినను చావదు రెండవయాశ్రమాన నా
సక్తి; ఇదేమి హేతు వన?-శాస్త్రము మాత్రము నోరు మూసెడిన్.

•



# శ్రీనాథుని కల్పనాశిల్పము

శ్రీ వా. వెం. ల. నరసింహారావు

ఆమె శ్రీనాథుని శిల్పవిన్యాసమున మెరుగులు దీరిన కావ్యేందిర. ఆమె సలక్షణముగా సాలంకృతయై సోయగములు వెలార్చి ప్రౌఢగుగా నడచినది. అది యొక మధురమందాక్రాంతగమనము. అతడు శ్రీనాథుడు. "అఖిలపురాణవిద్యాప్రవీణుడు. వేదశాఖాధీతినిష్ణాతుడు. ఆంధ్రభాషానైషధాబ్జభవుడు. ఉభయభాషాకవిత్వప్రయోగకుశలుడు."

భీమఖండరచనానంతరము (క్రీ. శ. ౧౪౩౦ తర్వాత) అతడు హరవిలాసగ్రంథరచనమునకు గడంగెను. దానిని బాల్యసఖుడను 'అవచి తిప్పయ' యను వైశ్యవర్యున కంకిత మిచ్చెను. ఈ గ్రంథమున మొదటిది 'చిఱుతొండనంబి' చరిత్రము. ఇది పాల్కురికి సోమన 'బసవపురాణ' కథ ననుసరించి కలదు. కాని శ్రీనాథుడు కేవలపురాణముగా గాక, దాని కొక దివ్యమగు కావ్యస్వరూపము నొసగి హృద్యముగ పెంపు గావించినాడు. ఈ యుదాత్తకథా విస్తృతి పాత్రపోషణమునకే కాక, రసపోషణమునకును దోహదకారి యైనది. ఒక్కొక్కటి విమర్శింతము గాక!

దుర్వాసమునీంద్రు డొకప్పుడు 'కరుణ మెయి హరిణవత్సంబులకు బాహుపాన్నంబులు గుడిపింప' నంబరమార్గంబున బోవు తుంబురుడను ప్రమథుడు అతని 'సర్వభూతానుకంపకు పంతిసిల్లి' అంగుళీస్ఫోటనము గావించెను. 'అచ్చిట్టుడికి లేడిబొట్టెలు బిట్టు చెదరి చేయాకపరచిన, అమ్మునిపరికించి, హుంకరించి అతని 'గర్వంబింక మహిలో మర్త్యుండవై జన్మింపు' మని శపించెను. అంత తుంబురుడు కాంచీనగరంబున 'చిఱుతొండం డను పేర వైశ్యకుల సార్థిత్యంబు నొంద' బుట్టువుగాంచె. ఈ దుర్వాసశాప వృత్తాంతము మూలమున లేదు. శ్రీనాథుడు దీనిని కల్పించుట కొక పరమప్రయోజనము గలదు. కృతిపతి 'భాగవతోత్తముడును, వైరాగ్యసంపన్నుడును నగు కంచినంబి' వంశజుడు. అతడు తుంబురువంశమున జన్మించినా డనుటచే కృతిపతిఅభిజాత్యప్రాభవము హెచ్చినది. అభిజాత్యగౌరవము లేని వానికి సలక్షణయైన తన కావ్యకన్య నీయ శ్రీనాథు డేమంత తక్కువవాడా?

బసవపురాణమున శివయోగికి చెరుకురస మర్పించినట్లు మాత్రమే యుండ, శ్రీనాథుడు దీనిని బాగుగ విస్తరించినాడు. మిండజంగము "చేగానుగాడి చెఱుకుం దీగరసంబున పురారి దేల్పక కుడువను, ఇది నా గురు వుపదేశించిన ఆగమము" అని కోర చిఱుతొండడు, వల్లెయని బయల్వెడలి 'ముదురుదీవల బిగియార మోపుగట్టికొని యెత్తికొనలేక ప్రెగ్గతిలం బడెను. అపు డాతనికి తోడై శ్రీమహాదేవుడు చెఱుకులు ధరించెను. దానం జేసి చెమర్చెను. అప్సరోంగనా నృత్యసంలగ్నమానసుడగు నీశ్వరునకు *సాత్త్విక భావోదయముచే, ఘర్మసలిలంబులు జాలువారె నని తలంచి పార్వతి యీర్ష్యాప్రేరితయై "కేళీసరసీరుహ మెత్తి మధూళికా పరాగములు శశాంకశేఖరుని కన్నులం బూటను చిందునట్లు" మొత్తెను. సావధానయై నిజమరసిన ఆర్య పశ్చాత్తప్త యాయెను. ఆశ్చర్యమంది అద్భుతభావపరవశయైనది. ఈ కథావిస్తృతివలన నిట శృంగారరసోత్పత్తి జరిగినది. ఈ సాత్త్వికభావోదయము ఈ రసోల్బణము కావ్యమునకు శోభ సమకూర్చినవి. అంతేగాదు! "'భక్తిగతి లింగపతి'యను ప్రాతమాట"యు బుజువైనది. కథ వినిన పార్వతి అద్భుతంపడెను గాన, అద్భుతరసోత్పత్తియు జరిగినది. రసజగన్నాయకుడు గదా శ్రీనాథుడు! ఈ ఘట్టము వలన చిఱుతొండని శివపూజాధురంధరత ద్యోతిత మగుచున్నది.

---

* పరగతసుఖదుఃఖాదుల, నరయగ భావించి యట్ల యలరుట సత్త్వస్ఫురణము తత్కార్యము లరయగ సాత్త్వికములు........

తరువాత వర్షవర్ణన మొకటి గలదు. ఇదియు మూలమున నింతగ వర్ణింపబడియుండలేదు. ఊరక పేర్కొనబడినది; అంతే! మఱి శ్రీనాథుడో!... శివపార్వతులు కంచి కేగు, ఇంద్రుని పిలిచి 'ముయ్యేడు దినములు కుంభద్రోణములుగా' వర్షము కురియింపు మని మొదలపెట్టుట, పుష్కలావర్తకాది మేఘములచే నింద్రుడు వర్షము కురిపించుట, వర్షవర్ణన, చిఱుతొండనంబి నితాంతనిరుపమాననిరంతరాన్నదానదీక్షనున్న సువానిని కల్పించి భావమోహనముగ స్వభావోక్తితో వర్ణించినాడు. కావ్యలక్షణములలో అష్టాదశవర్ణన లుండవలయును గాన నీ విస్తృతి కావ్యమునకు మెఱుగులు దిద్దినది. తూనిగలాడుట మొదల్గొని తటిదక్షీఘాతవేగోత్పతితసలిలధారలవరకు వర్ణియించి, 'కాంచీపురీజనంబుహృత్పుటములు ఝల్లన మఘవపుత్రుని పదివేళ్లు జపించు'వఱకును వర్ణించెను. అట్లయ్యును 'నే వేళ జూచినం' జిఱుతొండని శ్రీవాకిట బగటి వేళ శివయోగివరులు వేవేల సంఖ్య లుండెదరట! ఇదంతయు నాతని యుదాత్తాశయస్వభావముగాదా! శ్రీనాథునికి వలయునదియే!

అనంతరము శివప్రభావంబున శివయోగివరులు కొన్నింపనికి వగచి శోకముగుడిచి, బ్రమసి తప్పిన పసరంబు మెసకినట్లు, వచ్చినవాడక వచ్చి చొచ్చిన వాకిలియజొచ్చి శైవవరుడు జంగమాన్వేషణార్థియై తిరిగెను. కడకు కుహనాయోగిదంపతులు గనంబడ బొక్కణములోనున్న భూతి యందికొనెను. ఈ కథాభాగమంతయు భక్తిరసోద్దీపనమునకై విస్తరింపబడినది.

ఈ కల్పనావిశేషమువల్ల పాత్రపోషణ మెట్లు జరిగినది! కొలదిగ విచారింతము. చిఱుతొండని ధర్మపత్ని తిరువెంగనాంచి. ఆ భార్య మగనికి తలలో నాలుక. "ఇయం గేహే లక్ష్మీ రియ మమృతవర్తి ర్నయనయోః" అన్న భవభూతిసూక్తి యామెపట్ల నన్నివిధముల వర్తింపగలదు. మహాప్రసాదం బని కపటయోగి యొసంగిన భూతితో మగిడివచ్చు మగని ముఖరాగమీక్షించి 'కాలము నేడు శివయోగి గల్గె' ననుచు ప్రముద మందినది. విపరీతవ్రతచర్యావిధానంబు వినియు మిసిమింతురాలుం గాక మునిమునిసగవులు నవ్వినది. శరీరార్థప్రాణములకు గర్తలు శివయోగీశ్వరులె గదా! వారి సొమ్ములు వారి కర్పించుటయు దొడ్డ కార్యమా! విశేషించి—

"వలచినయేని అల్పువను
వంద్యునకుఁ శివయోగిరాజుకుఁ
బోలక గాని గారవంబయిన
పుత్రు డొకం డనవేల? నేను న
వ్వల మఱి నీవు ప్రాపులుగ
వారము కామె? విభూతి దమ్మ్ర, లో
పలకులు వేయి నేటికి కల
భక్తుని నేమము పార మేదురన్."

అని యొక అపూర్వపారమార్థికజ్ఞానముతో వాకొన్నది. కావుననే యామె 'అంగనారత్న' మయినది. కుమారసిరియాళుడు నట్టివాడ. మఱి వారి యింటిలోని దాసియైన చందనికకు ఆ గుణములే పట్టుపడినవి. ఆ కాపురమునకు చేటుకట్టు. అందఱిది ఒకే మాట. అసిధారావ్రతమైన ఆనాయాసముగ జరుగునన్న జరుగదా!

చిఱుతొండడును వేవేగ శివయోగిదంపతుల దరిసి ప్రబలకుష్ఠవ్యాధి బాధితుడగు శివయోగిని వీపుపై ధరించి గ్రుడ్డియవ్వ వెంటరా నింటి కేతెంచెను. దీనివలన భక్తు డెంతకైన సమర్థుడే యని తెలియుచున్నది. కావుననే 'ఆమ్నాయాంతసిద్ధాంతవాక్యహిమాంశుకాంతల మౌక్తికాభరణ'మైన మందాకినీశేఖరుని పృష్ఠమున నెత్తికొని మోయగల్గినాడు! పెరవారలైన సాధ్యమా?

కథాకథనపద్ధతియందు బసవపురాణమునకంటె ఇందొక విశేషము గానవచ్చుచున్నది. అసలు మూర్ఛితుడగు సిరియాళుని శివభూతిచే తెలివొందించుట మూలమున లేదు. కాని యీ మహత్తరకల్పనము వల్ల సిరియాళుని పాత్రశీలములును విభూతిప్రభావమును రూఢ మగుచున్నవి. సిరియాళుడు ఘనస్థిరధీగుణవైభవోన్నతుడు. పరార్థమై తనూఘనము వ్యయింపగల్గుట గదా జననైకఫలం బని యెంచిన తత్త్వవేత్త. దధీచీమేఘవాహనశిబిచక్రవర్తుల అనుయాయియై, 'పరోపకారార్థ మిదం శరీర' మన్న త్యాగి! కల్పాంతధ్రువమైన కీర్తికాయమునకై అధ్రువము, మలభాండము నైన దేహము వ్యయింప దొరకొన్న కీర్తికాముకుడు. కావుననే 'జీర్ణ భస్త్రాణి పశ్య'' అను వేదవచనంబుపయిత మాతని నించుకయు కదలింపలేక పోయెను. ఇట్టివాడు మిండజంగము మొండిపల్కులకు చెందువోవునా? తుదకు శివు డేమి చేయగల్గినాడు... వజ్రకల్పమైన అతని మనస్సును మార్చలేక మూర్ఛ రప్పించి పోయెను. 'పంచాక్షరీమంత్రపఠనశక్తియు' విభూతిబలమును సిరాలపెట్టి విగతమోహుని గావించెను. దీని నాధారముగ గొని శ్రీనాథుడు "భక్త

లకు ధర్మమే గదా ప్రాణరక్ష" అను నొక సామాన్య ధర్మమును ప్రవచించినాడు. ఈ ప్రయోజన మాశించియే యీ కల్పనమును గావించినాడు!

తిరువెంగనాంచి చిత్తస్థైర్యమును చిత్రించు మఱియొక ఘట్టము గలదు. కన్నబిడ్డను కత్తివాదరకెరగావించి కఠినయోగులకు కట్టునంజుళ్లు గాచబోవుచున్నారు. ఈ పని కెంతిధైర్యము వలయునో చూడుడు! ఇట్టి ధైర్యము సమకూర్చుకొను సమయమున నేమి జరిగినది—పదాఱు వర్షముల పచ్చిబాలెంతరాలైన తాపసపురంధ్రియై భవాని తిరువెంగనాంచి తీఱె"పాలు వోయింపు చిన్నపాపనికి" అనినది. ఈ కృత్యము కన్నకడుపుపై మక్కువ నేసి కుమారుని జంపుట కంతరాయము గాదా! అయ్యెను నిరాకులాత్మయై పాలు వోసినదట! భవాని యింత టితో నచటు వాసిపోయినదా! మఱియు పరీక్షించుచున్నది. అమ్మా! ఊరిలో ప్రతినోట ఒకే మాట! కొడుకును జంపి కుహనా భైరవులకు సంతృప్తిగల్గించుటయా! నీమగనికైన తెలియదా! అయినను నీతనయుని జంప నాత డెనడు? "మగడో ప్రాణో" అని ఊరక అనిరా! అని యెత్తిపొడుపుమాట లనినది. ఇంత జరిగినపిమ్మటను నిర్వికారయైయే ఒప్పినదట! ఏమా మనోధైర్యము...ఇది యంతయు పాత్రచిత్రణా వైశద్యమునకై విస్తరింపబడినది...

ఇక రాబోవునంతిమఘట్టము కరుణరసప్రధానమైనది. కుమారుని వరుసగావించి శివయోగివరులకు వడ్డింపబోవుచున్నారు. పుత్రుడు చెక్కగీటిన వసకల్పు బాలుడు. అచ్చట ముచ్చట జరిపి అల్లారుముద్దుగా తెగుచున్నాడు. చిఱుతిండి దినుచు "తల్లిదండ్రిని తన చిన్నికరాంగుళి వంచివంచి యూరించు" చున్నాడట. అట్టి వరాలపట్టిని సర్వాంగసముద్వర్తనస్నానము గావించి విషయమంతయు విన్నవించిరి. "సంసారము బాయుజాలని విచారము లేదుగదా!" అని యూరార్పనాతడు వంశప్రార్థనమును త్రివ్వియెత్తి మాతాపితరులకు ధైర్యము చెప్పి హింసాక్లేశము మాన్పెను. పందు జేసికొని శ్రీనాథుడు—

"చావ నియ్యకొనిన సత్పుత్రకునకును,
జంపనియ్యకొనిన దంపతులకు
తారతమ్య మెద్ది కరమాహేశ్వరా
చారసమయమార్గగౌరవమున"

అని అర్థాంతరన్యాసాలంకారమున సమర్థించినాడు. అటుపిమ్మట—

"నంబి శివారమణ మనసు
నమ్మిక జింత యొకింతయేని చి
త్తంబునయందు లేక వని
తామణి యూరులు దాపుజేసి తీ
క్ష్ణంబగు కత్తి మోప మెడ
గ్రక్కున ద్రెవ్వి నమశ్శివాయమం
త్రంబు బఠించుచుండెను శి
రాలు శిరంబు వసుంధరాస్థలిన్."

అప్పుడుమాత్రమే తల్లిదండ్రుల మనంబు లానందము నొందినవట. పందెమొడ్డి గెలిచిన ట్లున్న దట. అప్పు చక్కగ దీర్చిన ట్లున్న దట! 'ఇది యేమి వైపరీత్యము! ఇది యేమి మనస్తత్వము! ఇది ప్రకృతిసహజమా!" అని ప్రశ్నపై ప్రశ్న పొడమును. ఇది యంతయు వారి శివభక్తితాత్పర్యముల ఉన్నతస్థాయి తెల్పుచున్నవి. అంతే. పారమార్థికచింత లేని మనమైనచో బావురుమని యేడ్చి ఆత్మహత్య గావించుకొనియుందుమేమో!... ఇకేమి, వీరశైవక్రతము నిరాతంకముగ నడచినది! ఈ ఘట్టమువల్ల పాత్రల శీలములు ఔన్నత్యమును బొందినవి.

కథావిస్తృతింగల చమత్కృతికి ఒక చిన్న మచ్చుతునక. ఇన్ని అగ్నిపరీక్షలు జేసినతరువాతను తనివిదీఱక శివుడు భోజనంబుసేయుచు 'పిన్నవాడు పంక్తిలో లేక నాకు గడి నోరికి బోదు. మగబిడ్డడు లేని నిర్భాగ్యునింట భోజనంబు సేయ' నని పేచీపెట్టినాడు. ఈసందర్భమున సోమనాథునికృతిలో—"సర్వజ్ఞ మీ మనోజ్ఞంబైన యట్టి, వరపుత్రు డున్నాడు. పొరుగింటికిని బిల్వబోయెద వత్సా!" అనివాడు చిరుతొండనంబి.

'అకలంక మీ రప్పు డన్నారు నేను
విన్నాడ బుత్రుడు నున్నాడు; చదువు
చున్నాడో ఆడుచున్నాడో పిదప
జనుదెంచి మఱి మీప్రసాదంబు వాడు
గొనియెడిగాక...!'

అనియు నేడుకొన్నాడు చిఱుతొండడు శివయోగిని...తో ల్తకే శ్రీనాథుడు—కుఱ్ఱవానిని తల్లిదండ్రులు వరుసగావించి—

'పాక మొనరించి వడ్డింప భవువ కొసగి
కుడుతునా బంతి నిలుచేడు గొడుకు నుడువ'

అని శివయోగిచే పల్కించినాడు. ఇచ్చట 'ఇలు సేరుకు, కొడుకుకు' అనునవి సముచ్చయార్థక విశిష్టమయిన ప్రథమాంతములుగ నొకవిధమునను, రెండవ విధమున 'కొడుకుర్' అనునదిమాత్రమే ద్వితీయాంత పదముగను కల్పించి, రెండర్థములను అద్భుతముగ పోషగించినాడు. ఈ చమత్కృతి సోమనాథుని కృతిలో కానరాదు.

ఇమ్మహాకవి కృతులలో ఒక భాషాపాండిత్యమే గాదు, అచటచట అతనికి గల అద్భుతశాస్త్రపరిచయము ద్యోతమానమగుచుండును. ఒక జ్యోతిశ్శాస్త్రమున నేల? ఒక వాస్తుశాస్త్రమున నేల? ఒక ధాతుశాస్త్రమున నేల? మీదుమిక్కిలి పాకశాస్త్రమున... అన్నిటిని చవిజూపించినాడు.

ఉదా :—

"గ్రహసిద్ధాంతకళావిదుల్ సలిలన
క్షత్రంబునీహారరు
క్ష్మహావాసంబున నభ్రవీథిపరి వే
షస్థాయియై యుండుటన్
బహువర్షం బటు గల్గునంచు తమలో
భాషిం"చిరి...

మఱి పాకశాస్త్రమో! కమ్మగా గాచిన కట్టుసంజుళ్లు మొదల్కొని కదళీఫలాశనడిమియానియు తీయుగుజఁకును మాఱుకొనలేదు. ఈవర్ణన చదువునపుడు పఠితృలోకమునో రూరవలసిననే! అంతయు సహజసిద్ధముగ వర్ణించినాడు. ఇది యొకవిధముగ అతని భోగపరాయణత్వము, భోజనప్రియత్వము సూచించుచున్నది.

అన్నిటిలోను శ్రీనాథుని జాతీయప్రయోగము లెంతయు ముద్దులొలుకుచుండును. ఒకటిరెం డరయుదముగాక! 'గిరామారత్నము కాదు కూడ దనినన్ రాజాల నచ్చోటికిన్' అనునదియు, 'మానవతీ! మగడో! ప్రాణో!' అను లోకోక్తి యెంతయు బాగున్నది. ఎంతబాగుండెనిచో తిరిగి 'తిమ్మన' తనపారిజాతాపహరణమున నిరికించుకొన్నాడు! మఱియొక హృద్యమయిన పద్యము.

'పాడయినట్టి చిత్త మెంక
పాటున నిల్వక మాటిమాటి కూ
టాడుచునుండు గాక! తన
యాత్మీయుని దన కిట్టి దౌ నసం
గూడునో కూడదో! యెదిరి
కోర్కి యెఱుంగుట యెట్లు? పట్టిమా
చూడగ దోసకాయలె వి
శుద్ధయశోధన! అన్యచిత్తముల్'

అని కుహనాయోగి వైశ్యోత్తమునితో నన్నాడు. ఈ పద్య మాద్యంతము తెనుగుదనము మచ్చుగుద్దుకొన్నట్లున్నది. ఎత్తుగడలోనే ఒక వైలక్షణ్యము గలదు. శ్రీనాథుని కైతలో నొక వింతహాస్యమును 'తళుక్కు' మని మెరసిపోవును. 'ఆవగింజంత భూతి పై నలదికొన్న, గుమ్మడికాయంత వెఱ్ఱి పుట్టు' నట! ఇందలి హాస్యము గమనింపుడు. హృదయమున కూరక చక్కలిగింత పెట్టుచున్నది. అది యొక మహాకవిసొత్తు!

ఈయన కైతలో వ్యాకృతినియమాతిక్రమణము లేకపోలేదు. అందుకు- గ్రుడ్డవ్వ, కోలాది, శివయోగిరాజుకున్, చిఱుతొండనంబికిన్ అనునవి ఉదాహరణములు. అయినను మహాకవిప్రయోగములు గదా! 'నిరంకుశాః కవయః' అనినారు గదా! ఆయన స్వైరవిహారధీరుడు.

ఈ హరవిలాసగ్రంథమును శ్రీనాథుడు వయసు పండిన పిమ్మట వ్రాసినాడు. కొంచెము వైరాగ్యము ముదిరినట్లున్నది. అందును ఈకథ యాతని శైవమతాభిలాష, శివభక్తితత్పరత వేయిముఖముల చాటుచున్నది. ముదుసలి అన్నమాటే గాని రసికత కేమి కొఱత! అసలు కవితాలతాంగికి 'శూన్యమతి యైన యువకుని చూడ్కిలోని- రాగరక్తిమకంటెను రసికుడైన-ముసలితాతకన్బొమల ముడియె మిన్నుల్' సుందరముగ నుండు నట.

చిన్నకథయే కాని వివిధవర్ణనలతో విస్తరించి రసపోషణమునను పాత్రపోషణమునను అపూర్వశిల్పవైదుష్యమును వెలార్చియుండుటచే ఏతత్కథాగ్రథితమైన ప్రథమద్వితీయాశ్వాసములే ఒక స్వతంత్రప్రబంధమనదగియున్నది. మృదుమధురశబ్దార్థములతో, భావమోహనములైన స్వభావోక్తులతో, ఉదాత్తములైన అలంకారములతో, గుణవిరాజితమైన మనోహరకావ్యము నల్లి జీవము పోసినాడు. రసజ్ఞులకు రసనిష్యందమును, ముముక్షువులకు ఇహాముత్రసౌఖ్యప్రదాయినియు నైన కావ్యకన్యను ప్రసాదించి పోయినాడు! కావుననే కవి రాజైనాడు!

'జయంతి తే సుకృతినః రససిద్ధాః కవీశ్వరాః'

# విరికన్నె

శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

తూరుపు తెల్లవారగనె తొంగలి ఱెప్పలు విచ్చినావొ లే
దో రమణీయ వర్ణములతో తనువుం గయిసేసి మాధురుల్
గూరిచికొంచు సౌరభవిలోలసమీరకుమారు నంపి యే
కోరిక దీరగా బిలుచుకొందువు నీకడకున్ జనంబులన్ ?

నీరంగుల్ పచరించు నేర్పునకు గానీ, నిత్యనూత్నంబు లౌ
సౌరభ్యంబులకైన గాని తల వంచం దప్పునే యెట్టి ప్ర
జ్ఞారమ్యుం డగు చిత్రకారుడును, శాస్త్రజ్ఞుండు, నీకుద్దిగా
నీ రెండింటి దయారు చేయగల నేర్పింతేని సాధింపమిన్.

పొంగెడి జవ్వనంపు జిగి ముట్టకయే చవులూరు తేనె లా
నంగల భృంగనాయకు నవస్థిరసజ్ఞత మెచ్చుకొందువో
రంగుల రేకులన్ జిదిమి రక్కసియై పరహింస లేక తృ
ప్తిం గనలేని మానవుని ధీజడతం గని జాలి బొందెదో ?

కరుణ యొకింత లేక నిను కాగులలో మరిగించి గొప్ప య
త్తరువుల దీసి పెట్టుబడిదారుల సంచులు నింపి, సభ్యతా
స్ఫురణము గాగ దేహముల పూసికొనం దమకించు మానవుల్
తిరిగి కృతజ్ఞతాంకముగ దేని నొసంగెద రంచు నెంచెదో ?

కుత్తుకలందు దారములు గ్రుచ్చి యురుల్ బిగియించి కొప్పునన్
హత్తిన యత్తలోదరుల హాయికినై మకరందదివ్య సం
పత్తిని ధారవోసి తనుమార్దవమెల్ల నలంగిపోవ, నే
మిత్తు రటంచు నెంచి ముగియింతువు జీవనపుం బ్రమాణమున్.

ఎదియో సంశయ మాత్మలో బొడమ నిన్నిరీతి ప్రశ్నింతు, నీ
యుదయంబాదిగ ప్రాణికోటులకు నత్యుత్సాహమాధుర్యసం
పదలన్ దివ్యపరీమళంబులను ఆపాదించుటే కాని కో
రెదవా మానవులట్లు ప్రత్యుపకృతిశ్రీయున్ సుఖావాప్తియున్?

---

# మధురవాణి

శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

"కన్యాశుల్కంలోని పాత్రపోషణము" అని నామిత్రుడొకడు వ్యాసము వ్రాస్తానన్నాడు. నే నన్నానుగదా, "కన్యాశుల్కంలో పాత్ర లెవరున్నారూ; ఉన్నది ఒకటే పాత్ర-మధురవాణి" అని. శూద్రకుడు వసంతసేనని సృష్టించి ధన్యుడయాడు; గురజాడకవి మధురవాణిని సృష్టించి ధన్యుడయాడు. వసంతసేనయే మళ్లీ తెలుగునాట మధురవాణిగా అవతరించింది. జన్మపరంపరలవల్ల నిండైన వ్యక్తిత్వముతో సహస్రదళకమలమువలె ఆమె గురజాడవారి లేఖినినుంచి వెలువడినది.

మధురవాణితల్లి బుద్ధిమంతురాలు. ఆమెతరిఫీదు చేతనే మధురవాణి విద్యాసౌందర్యాలు రెండూ దోహదం చేసి పెంచుకున్నది. జగత్ప్రసిద్ధులైన కరటకశాస్త్రులుగారిదగ్గర సంస్కృతము నేర్చుకుని వసంతసేనలాంటివారి తత్వాన్ని నెత్తురులోకి దింపుకుంది. వీణ బాగా నేర్చింది కాని డబ్బు లేని విద్య దారిద్ర్య హేతువని వీణని అటు పెట్టేసింది.

మధురవాణి సహజసుందరి. బ్యూటిఫుల్ నాచ్ డెవిల్. ఆమెవలలో చిక్కిన ప్రాణి మరి తప్పించుకు పోలేదు. డిప్టీకలెక్టరుదగ్గిర్నుంచి కొండిభొట్లుదాకా అందరూ ఆమెపరిచయంకోసం దేవుళ్లాడేవారే. పూజారికి ఆమె పుత్తడిబొమ్మ. కరటకశాస్త్రికి ఆమె త్రిలోకసుందరి; ఆమె సైఁ అంటే చాలు శిష్యరికం చెయ్యడానికి ఆయన తయారు. సౌంజ్ఞ చేసి వెళ్లిన హెడ్డుకనిష్టీబు సర్కారు నౌకరీ మాని గులాం ఐ ఆమె కొలువు చేశాడు. ఆమెస్నేహితుల్ని పట్టిఇవ్వడానికి రెండుపనసకాయలు వాగ్దానం పొంది విచ్చుబేడ లంచం పుచ్చుకొని డిడ్డీతోవదగ్గర కాచిన కొండిభొట్లు, (ఒక గడియకిందట హెడ్డుమీదవిరగబడి నవ్విందన్న అక్కసు కూడా చంపేసుకుని) డిడ్డీతోవంటవచ్చిన హెడ్డుగారిచ్చిన పావలా పట్టుకుని తిరిగివచ్చి ఆమెముందర రామప్పని సప్తవధని చేసి, పంతు లిచ్చిన బేడా, హెడ్డిచ్చిన పావలా మాత్రమే కాక వెండితొడిపాడి కాయ(!)ని కూడా మధురవాణిచేతులో పెట్టి ఆమె పెట్టిన ముద్దుతో పైకెక్కి పీతినడుము కోతిగెంతులు వేశాడు. మధురవాణిని చూడగానే (ఎవరికైనా) మతి పోతుం దని ఆమె గురువుగారే అంటారు. వేశ్య అన్న మాట తనయెదుట ఎవరేనా పలికిన ట్టాయనా, అసందర్భం! అని చీదరించి, తనయెత్తు ధనం పోసినా వేశ్యను ముట్టనని వ్రతం పెట్టుకున్న అచ్చాణీ, సౌజన్యారావు గారు కూడా "అట్టేసేపు మధురవాణి తనయెదటగాని నిలచివుంటే ఆమె యేతగువు తీరిస్తే ఆ తగువుకు వొప్పవలసి అవుతానేమో" అని భయపడతాడు. ఆమె సొగసుకత్తె; ఆమెచేతులు "యేమి మృదువూ! తల తలదగ్గిర చేరిస్తే యేమి ఘుమఘుమా!"

మధురవాణి 'చాలా తెలివినమనిషి'. సరసులందరికీ అంతరాంతరాల్లో సానిదాని నీతిమీద నమ్మకం వుంటుందని ఆమె యెరుగును. అందుచేతనే రామప్ప సొమ్మిచ్చిన ఉత్తరక్షణం గిరీశాన్ని ముట్టుకోనివ్వకుండా యెత్తు యెత్తింది. ఉంచుకున్నవాడికి తన సాని ఇతర్లతో మాట్లాడితే కిట్టదని ఆమెకి తెలుసు. కనకనే పెద్దిపాలెం నించి పెళ్లిపాపిడికి వచ్చి అల్లరి పడి అల్లరిచేసిన రామప్ప తలుపు కొట్టేసరికి, డిడ్డీ తోవంట కనిష్టీబుని పంపేసింది. రామప్ప మధురవాణిసరసుల్ని పట్టుకుందామని డిడ్డీతలుపు తాళం వేసినప్పుడు, స్నేహితు లిద్దర్నీ గదిలో పెట్టి పైకి గొళ్లెము వేసింది. ఆయన పరున్నతరవాత వచ్చి తలుపుతీసి వొదిలేయవచ్చును. ఉంచుకున్నవాడి దగ్గిర భయం, భక్తి వున్నట్టు నటించవలసిన అటు ఉండా

కున్న వాడి సామర్థ్యాలీ, ఇటు పరాయిపురుషుల చేతులకి చంకలా అని కూడా తెలుసును మధురవాణికి. పంతులుమొదట వేరెవర్నీ మచ్చిక చెయ్యరు. ఏపాటి చనువిచ్చినా ఆడవాళ్లున్నచోటికి చొచ్చుకు వచ్చిన హెడ్డుకనిస్టీబు, పంతులు రాగానే దిడ్డీతోవంట వెళ్లిపోతూ కాపలాకాసే కొండిభొట్లుకి పావలా ఇచ్చుకుని దాటిపోతాడా? ఉంచుకున్న రామప్పంతులుమీద మోజువున్నట్టే నటిస్తూ నలుగుర్నీ సంతోషపెడుతూ ఒకవూరు వేగం సవరించి చెయ్యిచిక్కిన సొమ్ము దక్కించుకుని పెందరాళే మరోకొమ్మ పట్టుకోడానికి తగిన యత్నమే చేసింది.

మధురవాణి తెలివైనది. మనుష్యుల తత్వం ఆమెకి చక్కగా తెలుసు. గిరీశం స్వతహాగా సొమ్ము కలవాడు కాకపోయినా, డిప్టీకలక్టరుగారి కుమారరత్నం చెన్నపట్నంనుంచి పంపే సొమ్ము అందజేస్తున్నాడుగదా అని తన చేరువకి రానిచ్చింది. డిప్టీకలక్టరుభయంవల్ల పేరుగలవాడెవడూ ఆమెయింటికి రావడం మానేశాడు. ఇక పైవూరు వెళ్లడమే గత్యంతరం. కాని రామప్పతో సంబంధం స్థిరంకాగానే గిరీశం వచ్చాడు. ఏమేనా సొమ్ము పేల్తుందేమో అని కాబోలు పస్తాయించింది. వట్టికబుర్లే అని గ్రహించింది. గిరీశం మోసాన్ని గిరీశం 'దీనికో తప్పా చెప్పి రంజింపచేద్దాం' అనీ, 'నే నేదో ఉద్యోగాలూ ఊళ్లూ ఏలి తనతో వైభవం వెలిగిస్తానని నమ్మకంతో వుంది' అనీ సంతోషించుకుంటున్నా, అతని నటన ఎంతో కాలం ఆమెకళ్లు కప్పలేదు. రామప్పకథ పైకి పటారం, లోపల లొటారం అని ఇట్టే గ్రహించింది. రామప్పనీ, లుబ్ధుణ్ణీ, సిద్ధాంతినీ, మీనాక్షినీ సులువుగా మభ్యపరచిన శిష్యుణ్ణి మధురవాణి మొదటి చూపులోనే పట్టేసింది. ఈ శిష్యుడికి పెళ్లిచెయ్యడం పంతులు వక్కడివల్లా కాదని కరటకశాస్త్రికి గట్టి సలహా యిస్తుంది. మీనాక్షీ, సిద్ధాంతీ పెళ్లికి సుముఖులు కావాలి. దానికంతా డబ్బే కీలకం. "రెండుపెద్ద కాసులు యిస్తానని చెప్పండి" అంటుంది. ఇంతటితో కుదరదు. "యిట్నుంచి యెటొచ్చినా కాపాడుతాడు, హెడ్డుకనిస్టీబుకుమాత్రం కొంత నిజం చెపుదా" మంటుంది. ఈ ఆలోచన లన్నిటికీ తరవాత పని కలిగింది. శిష్యుణ్ణి రామప్ప చూస్తున్నప్పుడల్లా కోపమూ, ఈర్ష్య నటించి రామప్పకళ్లల్లో మత్తుమందు చల్లింది. చివరికి రామప్ప శిష్యుడిచెయ్యి చూడబోతున్నప్పుడు సీరా ముఖంమీద పోసి చల్లువ వెళ్లిపోతుంది. ఇంకోసారి చెంబుతో నీళ్లుదిమ్మరించింది. లుబ్ధుడి విచిత్ర వివాహనాటకంలో నాందీవిష్కంభాలు మధురవాణే నడిపింది. తరవాతకథ ఆమె ఎత్తులన్నీ ఉపయోగపడేటట్టే నడిచింది. సిద్ధాంతి కరటకశాస్త్రికి కావలిసినట్టు ముహూర్తాన్ని ఎనిమిది గడియలు ముందుకి లాగేడు. రాత్రివేళా, సిద్ధాంతితొందరా, కరటకుడు ఆశపెట్టిన పులిమొహురూ మీనాక్షికన్నులికి మసక కమ్మించాయి. పెళ్లి అయిపోయింది. కరటకుడు సొమ్ము చేతులో వేయించుకొని వూరువిడిచి దాటేశాడు. పోలీసుచికాకు లేకుండా మధురవాణి హెడ్డుని తనపంజాలో పెట్టుకుని, వాడితో ఈ మగపిల్లపెళ్లిలో జరిగిపోయే మాయాలుముచ్చట్లుచూస్తూ విరగబడినవ్వింది. పెళ్లి కాస్తా అయిపోయింది. ఇక పెళ్లికూతురుబండారం బయటపడకుండా, 'పాట పాడ' మని బ్రాహ్మణ్యం యావన్మందిచేతా గడ్డం పట్టుకుని బతిమాలించుకుంది. ఇంతలో తాషామర్ఫా, బాజాలూ, బోయీలూ కూడా వుడితో రామప్ప వచ్చాడు. ఇక ఆ నాటకంలో పడిపోయి అంతా వళ్లు మరిచిపోతారు. అందుకని తాను ఇంటికి వెళ్లిపోయింది. పోతూ పోలీసుని తీసుకుపోయింది. లేకుంటే కరటకుడికోసం జవాన్లు దాడా యిస్తారు. రామప్ప ఇంటికి చేరేవరకూ పోలీసుతో కబుర్లు పెట్టుకుకూచుంది. రామప్ప రాగానే పోలీసుని దిడ్డీతోవంట పంపేసింది. వా రిద్దరూ పరీక్ష కాగూడదు.

తెలివితేటల్తోపాటు మధురవాణికి ఆత్మవిశ్వాసం బాగా వున్నది. సౌజ్ఞ చేసిన హెడ్డుని గులాంగా ఏలగలనని ముందే అంటుంది. యంత్రం ఎప్పు డెదురుతిరిగినా చక్రం అడ్డువేస్తుంది. కొంప మునిగితే తేలుస్తుంది. ఆమెకి చాకచక్యంతోపాటు ఆత్మవిశ్వాసంకూడా వుంది. అచ్చాతీయాంటినాచ్చి సౌజన్యారావుగారిని చూడ్డానికి మగవేషం వేసుకుని,

నిశిరాత్రివేళ కబురు చెయ్యకుండా వెళ్లిపోయింది. ఆమె యెత్తులకు విఘాతం రెండుమార్లు వచ్చింది. మొదటిసారి, గిరీశం మంచంకింద దాక్కున్నట్లు కంటితో పూటకూళ్లమ్మకి చూపించినప్పుడు. పూటకూళ్లమ్మ చీపురుదెబ్బ రామప్ప తిన్నాడు. "అయ్యో నన్నెందు కొట్టావు?" లో మధురవాణి అదరిపాటు బయట పడింది. ఈ చిక్కు వక్కముద్దుతో సర్దుబాటయిపోయింది. అలాగే పోలీసుహెడ్డుని డిడ్డీతో వంట పంపేసినప్పుడు కొండిభొట్లు కాపలావల్ల ఆమెకి రెండో సారి అదరిపాటు వచ్చింది. ముద్దు అక్కడ కృతజ్ఞతా ఫలితమే. లేకపోతే రెండోసారి ముక్తాయించదు.

మధురవాణికి ఆత్మవిశ్వాసమే కాదు, ఆత్మ గౌరవం కూడా చాలా వుంది. ఆమె ఎన్నడూ తల వంచవలసిన పని చెయ్యదు. తల వంచనూ వంచదు. పూటకూళ్లమ్మ 'యెక్కడ దాచే వేమిటి?' అంటే "నాకు దాచడం ఖర్మమేమిటి?...నాయింటి కొచ్చే వాడు మహారాజులాగ దర్జాగ్గా వస్తాడు" అంటుంది. కరటకశాస్త్రితో "నాదగ్గరకు వచ్చినవాడల్లా చెడి పోయినాడో?" అని సవాలు చేస్తుంది. రామప్పగాణ్ణి వేలుమీద ఆడిస్తుంది గాని లొంగి చాకిరీ చెయ్యదు. అతన్ని 'మాటన్నేర్చిన పసక' మంటుంది. 'మతిలేని మాటా' అంటుంది. "వేశ్యకాగానే దయాదాక్షిణ్యాలు వుండవో?" అని లెంపలు వాయిస్తుంది. "వన్నెనా వెధవలు అంటున్నాడు!" అని రామప్ప అంటే "నన్నుకూడా కలుపుకోవాలని వుందా యేమి"టని వాణ్ణి పస్తవెనవని చేస్తుంది. రామప్ప లుబుధితో "అలా గడ్డి పెట్టండి" అంటే వెంటనే "గడ్డి గాడిదలు తింటాయి, మనుష్యులు తినరు" అని కొరడా విసురుతుంది. సరసులంతా ఇంట్లో పేకాడుతూంటే తలుపు కొంచెం తెరిచి "ఆ కంటె తాందీ గడపలో కాలుపెట్టనివ్వను" అని రామప్పకి తలుపు బిడాయిస్తుంది. కరటకశాస్త్రి సౌజన్యారావువద్దికి తనను తీసుకువెళ్లలేనని చెప్పినప్పుడు "కొత్తసంగతి వకటి ఈ నాటికి నాకు తెలిసింది. సృష్టికల్లా వన్నె తెచ్చిన మధురవాణి అనే వేశ్యాశిఖామణి గిరీశంగారి వంటి మక్కులపొత్తుకే తగివున్నది గాని సౌజన్యారావు పంతులుగారివంటి సత్పురుషులను చూడడమునకైనా అర్హత కలిగివుండలేదు." అని గ్రహించి, ఆ సౌజన్యారావు బింక మేపాటిదో చూడాలని వెళ్లింది. ఈమెకు ఆశమాత్రమే కాదు. దానిని సాధించగల తెలివీ యత్నమూ సమయస్ఫూర్తీ ఉన్నాయి. అందువల్లనే నిశిరాత్రివేళ మగవేషంతో, వర్తమానం చెయ్యకుండా మేడమీదికి వెళ్లి ఆయనగారి మంచితనానికీ వేశ్యా జుగుప్సకీ జగడము పెట్టి, "నేనుమట్టుకు వోడిపోయినా"నని వొప్పించింది. మొదటిప్రశ్నతోనే దిగాడు కిందికి సౌజన్యారావుగారు. అతని పిలక చేతికి దొరికింది. "వేశ్యలు బతికడ మెలాగ? వృత్తి మానితే తమవంటివారు వారిని వివాహమాడుదురా?" తో వకీలుగారి వాదము కట్టుఅయిపోయింది. అప్పుడు తననిజము బయటపెట్టింది. "మోసము" అన్నాడు. "గురువుల ఉపదేశము(చెడ్డవారియెడల కూడా మంచిగా వుండాలనేది)గురువులే మరవకూడదు. చెడ్డలో కూడా మంచి వుండవచ్చును. కాక మంచిచెడ్డలు యెంచేవారెవరు?" అన్నది. "యేమి దగా" అన్నాడు.

"నిర్మలమైన అంతఃకరణతో వస్తిని, నిజం దేమ డెరుగవలె. దగా అని తోచినది...వెళతాను." అన్నది. పొమ్మన్నాడు కాని యిక్కడ మనస్సుకి నోరు నొక్కుకు పోయివుండడముచేత, చిరకాలం నించీ గుండెలో గూడుకట్టుకున్న యాంటీనాచ్ తత్వమే పెద్దరికం వహించింది. ఈ గుండెలోనే మరో రెండుతత్వాలుకూడా ముడుచుకుని వున్నాయి. ఒకటి నైసర్గికంగా పురుషుడి కుండే స్త్రీవాంఛ. రెండోది "ఇంతకాలము ఆలోచించకుండానే వేశ్య అన్నమాట ఎవరన్నా 'అసందర్భం' అని చీదరించానే, వేశ్యలలోమాత్రం మంచి వుండదా?" అనే కలవరంతో పాటు తలఎత్తిన జాలి. ఈ జాలి ఇంకా లేచి నిలబడలేదు. ఈ స్థితిలో మధురవాణి గుమ్మము వరకూ వెళ్లింది. సౌజన్యారావుకి ఆమె విడిచిన పాగా, కోటూ ఎదురుగుండా కనబడ్డాయి. 'నిలు,నిలు' అన్నాడు. ఆమెకి పురుషులనాడి మహాగొప్పగా తెలుసు. తిరిగివచ్చి కొంచెము యెడముగా యెదుట నిలిచింది. ఆమెతాలూకు ఆస్తి ఆమెకే చెందాలన్న

వకీలిక సానుభూతితో "పోగ, కోటూ మరచిపోయి నావు" అన్నాడు.

"మనసే మరచిపోయినాను, కోదవేమిటి?" అని గద్గదికంగా బహుశా కన్నీటితో వెనక్కి తిరిగి రెండడుగులు వెళ్లింది. రావుగారికి దెబ్బతో వేశ్యాజుగుప్స ఎగిరిపోయింది (గాని దానివాసన ఇంకా పోలేదు).

"మాట" అన్నాడు. "ఈమాటు యేం మరిచావండి?" అని అక్కణ్ణించే తిరిగిచూచి గాలం వేసింది ఈ చేపకోసం. కాని సౌజన్యారావుగారు అంత సులువుగా పడరు.

"నువ్వు మరవలేదు, నేనే మరచినాను" అన్నాడు. జాలీ, రసికత్వమూ లేచి నిలబడ్డాయి ఆయనలో. కాని మాటమాత్రం ఆయనలోని వకీల్దే. "లుబ్ధావధాన్లుగారి మాటేమిటి?" అన్నాడు. ఆయనయందు తనకు అట్టే అభిమానం భగవంతుడు పుట్టించలేదు." అని సౌజన్యారావు నెత్తురులో నిండిఉన్న మంచితనాన్ని బుగ్గ నులిపింది. ఈ మంచితనంకో "ఆయనను కాపాడడముకు న్యాయమైనపని యేమి చెయ్యమన్నా చేస్తాను" అని వెంరపెట్టింది. దీనికితోడై యాంటీనాచి తత్వపు వాసన "అనేకసంవత్సరములాయి వేశ్య అన్నది నా యింటికి రాలేదే! యీనాటికి వ్రతభంగమైనది గదా" అని భోరుమని యేడ్చింది. మధురవాణి ఇప్పుడోక మెట్టు మీదికి లేచింది. వకీలుగారికి విప్పలేని చిక్కు పెట్టి కొంతా, చెడ్డలో మంచి వుంటుందని జ్ఞాపకంచేసి కొంతా "మనసే మరచిపోయినాను" అని కొంతా లేచి, ముఖాముఖి వాదించే ఎత్తుకి వచ్చిన మధురవాణి, ఆయనగారి "యీనాటికి వ్రతభంగమైనదిగదా, అని అపారమైన విచారములో మునిగి వున్నాను" అనే మూలుగుతో పరామర్శ చెయ్యగల హోదా దొరకబుచ్చుకుని—

"తమరు ప్రాజ్ఞులు; వ్రతభంగ మేది?" అని ప్రశ్నించింది.

"శివరాత్రివేళ పడకింటిలో వేశ్యను పెట్టుకుని మాట్లాడడంకన్న యింకా యేమికావలెను?" అన్నాడు.

"తమరు నన్ను రప్పించలేదే!" అనీ "మీ పార్టీని కాపాడే మనిషిని నేను యెవతెనైతే నేమి?" అనీ, "భగవంతుని దర్శనమునకు పోవచ్చునుగదా తమదర్శనమునకు మాత్రం నిరోధమా?" అనీ అడిగి యాంటీనాచ్ గారి నోరు నొక్కేసింది. కాని ఇంకా ఒక్క అనుమానం మిగిలివుంది ఆయనలో—"సానిదానికి మంచితో పనివుండదు" అని. అందుకని—

"నా శత్రువులు యెవళ్ళో నిన్ను నాదగ్గరకు పంపారు" అన్నాడు. సౌజన్యారావుగారు రెండో మారు వోడిపోయారు. మధురవాణి "అలాగైతే తమ మంచే తమకు శత్రువై ఉండాలి" అన్నది. ఆమె కూడా మంచిదే మరి. కాబట్టి ఆమెకీ జాలివేసింది. కాని కుట్ర అనుకుంటున్నాడు. "మీ కార్యం నిర్వహించి డబ్బు ఒల్లనప్పుడు కుట్రా కూహకం లేదని నమ్మరు రా?" అన్నది. ఇప్పుడు తట్టిం దతనికి ఆమె మంచి దని.

"అంత మంచిదానివైతే...మధ్య నాకు గంటకత్తె లేమి?" మధురవాణికి తన మంచితనం బాగా తెలుసు. పాపం గిరీశంవంటి కుక్కల పొత్తులో నలిగిపోయిన ఆమెను ఈ కుక్కలెవ్వరూ గుర్తించలేదు. అపరిమిత సహాయం పొందిన కరటకుడు కూడా గిరీశాన్ని కుక్క అనీ, ఆమెకి అందుబాటులో లేని సౌజన్యారావుని గంగిగోవనీ పొగిడి ఆమెమనస్సులో బల్లెము గుచ్చాడు. ఇక ఆమెని గుర్తించివా ళ్లెవరు? కామమూ, స్వార్థమూ, కక్కుర్తి కలిపి రంగరించి బ్రహ్మదేవుడు చేసిన 'పూరకుక్కల్నీ సీమకుక్కల్నీ' చాలామందిని చూచి విసిగిపోయింది. ఎవరు చెప్పినా సౌజన్యారావు మంచినిగురించే. ఆ సత్పురుషుణ్ణి దర్శించుకుని స్నేహం సంపాదించుకుంటే తనజన్మ ధన్యమౌతుం దనుకుని తెగించి ఆయనదగ్గరి వెళ్లింది. అక్కడ ఒకపట్టాన ఆయనగారు లొంగలేదు. ఇప్పుడు న్యాయమైనప్రశ్న "మధ్య నాకు గండకత్తె లేమి?" అని అడిగేడు. మధురవాణి జారింది.

"నేను మంచిదాన నని నమ్మగలరా?" అని ఆక్రోశించింది. ఆమె అణువణువునా అభిలషించినదిదే. ఆమె తనను వుంచుకోవడముకోసము ఆసించినా,

అది దైహికతృప్తికి కాదు; సృష్టికల్లా వన్నె తెచ్చిన మధురవాణి సౌజన్యారావుపంతులుకి తగినదే అన్న తృప్తి కోసము. కాని మరి ఆయన యిష్టమో? అది సున్న. ఇక ఆయనలో మిగిలిన మంచితనమే ఆధారం తనకు. "మధ్య నాకు గండకత్తెరేమి?" అన్న ప్రశ్నకి మంచి జవాబు లేదు. కాబట్టి కొంచెమాలోచించి "నేను మంచిదాన్నని నమ్మగలరా?" అన్నది. "ఆ బ్రాహ్మణ్ణి కాపాడితే నమ్మనా?" అన్నాడు. గడుసుదనంగా "అయితే ఒక చిని తగువు మనవిచేస్తాను" అంది. పాతపగలన్నీ పటాపంచలైపోయాయి. పుత్తడిబొమ్మ లాంటి మధురవాణి యెదట నిలిచి వుంది. సౌజన్యారావులోని మానవుడు అంటున్నాడు: "ఆట్టే సేపు నువ్వు నాయెదటగాని నిలిచిఉంటే, నువ్వు యే తగువు తీరిస్తే ఆ తగువుకు వొప్పుదల అవుతానేమో అని భయం వేస్తూంది." అని మధురవాణి "ఒక చిన్న ముద్దుకు కరువా?" అంటుంది. "నా వ్రతభంగం చెయ్యడమే నా నీ పట్టుదల" అని అసలు రహస్యము కనిపెట్టేకాడు. ఈ నాన్పుడుకి చికాకించుకున్నట్టు, "అడుగు మెట్టుకి దిగా నని చెప్పలేదు గదా, యిష్టం లేని పని యేల చేయించవలె, సెలవు-" అని వెళ్లబోయింది. మానవుడికంతా అర్థమైపోయింది. ఈమనిషి ద్రవ్యానికి సాధ్యురాలు కాదనీ, మృచ్ఛకటిక చదివి నెత్తురులోకి వసంతసేనతత్వాన్ని దింపుకుం దనీ, అఖండమైన తెలివితేటలూ, ఆత్మాభిమానమూ కలిగినదనీని. 'అసు' మన్నాడు. మంచంమీద కూర్చుని దుప్పటి కప్పుకుని 'కూర్చో' అన్నాడు. 'నాకేమిటీ గండకత్తెర' వాదము మళ్లీ మొదలుపెడతాడు. 'కూచోను' అన్నది. వేశ్య డబ్బుకోసమే కదా వ్యభిచారిణి అవుతుంది. ఈమె డబ్బొల్లకపోదు. "వెయ్యిరూపాయలిస్తాను; తీసుకొని బ్రాహ్మణ్ణి కాపాడు" మని బేరం పెట్టాడు. మాట్లాడకుండా వెళ్లబోయింది. ఈ మాట అతడన్నప్పుడామె చూపులేమన్నవో? చివరికి విధిలేక వొప్పుకున్నాడు. చిక్కు విడగొట్టేసింది; ఆశ్చర్యపోయాడు.

"నా ఫీజు యిచ్చి మరీ నిద్రపొ" మ్మంది.

"బీదవాణ్ణి, యిచ్చుకోలేనే!" అన్నాడు.

"చిత్రం! వెయ్యిరూపాయలకన్నా ఒక ముద్దు యెక్కువ విలువా? ఎంత పెద్ద ఫీజు! పేదవాణ్ణి, యిచ్చుకోలే"నన్నాడు.

"నాకు లోకంలో ధనమంతా అదే అనుకున్నానే!" అన్నది.

"నీవు సొగసరివి. ముద్దు చేదని కాదు. వ్రతభంగంగదా అని దిగులు" అని ముద్దుపెట్టుకోబోయాడు. సరి,దీనితో; 'వేశ్య' అన్నమాట ఎవరేనా అంటే 'అసందర్భం', అనే అచ్చాణీ, తనయెత్తు ధనంపోసినా వేశ్యను ముట్టను అనే యోచన, ప్రమాదంవల్ల వేశ్యశరీరం తగిలితే కోసేసుకుంటా నన్న పవిత్రుడు, సౌజన్యారావుగారు వ్రతభంగానికి ఓర్చి చిత్తయిపోయినారు. అయితే మధురవాణీవ్రతమో? సౌజన్యారావుని ముట్టుకో నివ్వదు. చెడనివారిని చెడగొట్టవద్దని తనతల్లి ఉపదేశము. ఆయనగారివ్రతాన్ని జుట్టుపట్టుకు లాగి కిందపడేసి, తనవ్రతం నిలబెట్టుకుంది. అయితే, "లోకంలో ధనమంతా అదే అనుకున్నానే" అన్న మధురవాణి ఇలాగ ఎందుకు చేసింది?

మధురవాణి మంచిమనిషి. గిరీశాన్ని రామప్ప తిడితే సహించిందికాదు. "యిన్నాళ్లూ ఆమహారాజు పోషించాడు కాడా?" అని ఆమెకి విశ్వాసం. రామప్ప నెత్తిచరిచి గిరీశంపారిపోగానే "వాడిపొంకం అణుకురు గాని లెండి" అని రామప్ప నొప్పి తణివి పోగొట్టింది. "లుబ్ధావుధాన్లుగారికి పెళ్లి ఎందుకు కుదిర్చారూ" అని మొదట్లోనే శకటుని అడ్డేసింది. "నేయింత బతిమాలుకున్నా యీ పెళ్లి తప్పించకపోవడమేమి! మీ బుద్ధికి అసాధ్యం వుందంటే నే నమ్ముతానా?' అని అకారణంగానే అన్యాయానికి అడ్డుతగిలింది. ఆతరవాత ఈ సంకల్పం కరటకశిష్యునివల్ల బలపడింది. ఒప్పుకుంటూకూడా, "నాటకంలో యెంత హాస్యమైనా చెల్లుతుంది. నటనలోకి హాస్యం తెస్తే యేమి మూడుతుందో ఆలోచించారా?" అని అతణ్ణి హెచ్చరిస్తుంది. "యిటుంచి యెటొచ్చినా కాపాడుతాడు. హెడ్డుకి మాత్రం కొంత నిజం చెపుదాం" అని ముందు కాపు చేస్తుంది. వృత్తిచేత వేశ్య కనక ఇయ్యవలసినచో

ద్రవ్యాకర్షణ చేస్తుందిగాని, మధురవాణికి దయాదాక్షిణ్యాలు ఉన్నాయి. లుబ్ధుడు పెళ్లి మాన్తాడేమో అని శాయశక్తులా యత్నించింది. ఊళ్లోని పేలుడుగాయల్ని నలుగుర్ని తనయింట జేర్చి, కరటకుడీ, శిష్యుడీ పలాయనానికి రహదారి ఏర్పరిచింది.

తాను మంచిగా వుండడమే కాదు, ఇతర్లను మంచిదారిలో పెట్టాలని చూస్తుంది మధురవాణి. పూటకూళ్లమ్మ సామ్మతిచేస్తున్న గిరీశానికి పూటకూళ్లమ్మ చీపురుచేతనే బుద్ధిచెప్పించా లనుకుంది. కొంచెంలో అది తప్పిపోయింది. రామప్పని తలుపు తీయక ఏడిపించి, శిష్యుడిచేత 'నీ యిల్లు యెక్కడే చిలకా' అనీ, 'ఊరికి ఉత్తరాన సమాధిపురములో కట్టె యిల్లున్నదే చిలకా' అనీ, 'కట్టెలే చుట్టాలు కట్టెలే బంధువులు కన్నతల్లెవ్వరే చిలకా' అనీ పాట పాడించి కాస్త ముందుగతి చూసుకోమని రామప్పని హెచ్చరించింది. కరటకశాస్త్రితో 'తమలాంటి పండితోత్తములు మాత్రం కార్యావసరం కలిగినప్పుడు పూరూవాడా వెతికి మధురవాణిదగ్గర లాచారీ పడవచ్చును' అనీ, 'లోకంఅంతా యేమి స్వప్రయోజనపరులా?' అనీ, 'నేను కలక్టరును చూడనంటే మీ మనస్సు చివుక్కుమనడం యెట్టిది' అనీ, 'చిత్రగుప్తుడికి లంచంయివ్వగలరా? ఆతడిదగ్గిరకి మధురవాణిని పంపి చేసినపాపాలు కుడుపుపెట్టించడానికి వీలువుండదు కాబోలు!' అనీ తలవాయగొట్టింది. ఇవిచాలక శిష్యుణ్ణి అప్పుడు పిలిచి వాడిచేత ఇంకొకటిపాట పాడించింది. కరటకుడు ఎంతచెడ్డా చదువుకున్నవాడు గనక 'మనసు మళ్ళించుకుందాం' అని తీర్మానించుకున్నాడు. సౌజన్యారావుగారు మంచితనంవల్లే తన ఫీజుకి వొప్పుకొన్నాడుగాని మోజువల్ల కాదని చక్కగా తెలిసిఉండడంచేతను, చెడనివారిని చెడగొట్టవద్దని తల్లి ఉపదేశించిఉండడము చేత, ఆయన్ని రక్షించి, యావజ్జీవం కాపాడే తనవారన్నవారిని సంపాదించుకుంది. సత్పురుషుడనే నామము సార్థకముగాగల శ్రీకృష్ణుణ్ణి పొంది కృతార్థురాలై వెళ్ళింది. మధురవాణివంటి మంచిమనిషి వున్నదా?

మధురవాణికి మనస్సూ, రూపమూ మాత్రమే కాదు. స్నేహమూ ప్రేమా కూడా వున్నాయి. శృంగారం వన్నెచెడిన దగ్గిరనుంచీ బంగారంగదా చేటుతేవాలి? ఆ బంగారాన్ని కరటకశాస్త్రికి ధారపోసింది. ఆమెస్నేహం ఎన్నవేల? ఇక వలపా? పాప మామెకి బ్రతుకే లేదు. హెడ్డుకనిస్టేబుదగ్గిర్నుంచీ సాంజ్ఞ చేశేవాడే. అసిరిగాడిదగ్గిర్నుంచీ 'పంతులు యింట్లో లేనప్పుడల్లా కనిష్టీబు మధురవాణితో వుంటా'డని చెప్పి యాగీపెట్టేవారే. ఈగల్లాగ ముసిరే మగరాజులందరిలోనూ ఆమెహృదయాన్ని చూరగొన్నది ఒక్కకరటకుడిశిష్యుడు మాత్రమే. 'ఈ చిల్లంగికళ్లు నీ కేదేవు డిచ్చాడు' అని వాణ్ణి ముద్దెట్టుకుంది. 'నీ బుగ్గ కొరికేతునా' అని ముద్దుచేసింది. 'ముందు దాసరివేషం వేస్తాను. అగ్రహారం పోయి నీ గురువును చేరుకుందువుగాని' అని అభిమానం చూపింది. 'నాదగ్గిర శిష్యరికం అంటే యేమేవేం చెయ్యాలో తెలుసునా!' అని 'నన్ను ముద్దెట్టుకొంటున్నప్పుడల్లా ముద్దెట్టుకోవాలి' అని ఒప్పించింది. ఆడవేషంలో అతడున్నప్పుడు ఏదో మిష కల్పించుకుని 'నీకు సిగ్గులేదే లంజా' అని బుగ్గ తణిచింది. చివ్వర అతడు వినకుండా కరటకుడితో 'యిక అతణ్ణి నాటకా లాడించీ, ముండలిళ్లకి తిప్పి చెడగొట్టకండి' అని ఉపదేశించింది. వాళ్లు వెళ్లిపోయినారు. పాపం అంతవరకూ నా అన్నవాళ్లు లేకపోయినారు. సౌజన్యారావుని పట్టింది. మంచిదా న్ననిపించుకుంది. శ్రీకృష్ణుణ్ణి వక్షమున ఆనించుకుని చేతులు జోడించింది. ఎంత చిత్రమైన మనిషీ మధురవాణి!

# రెండు అపూర్వ వచనరచనలు

శ్రీ నిడుదవోలు వెంకటరావు

### [౧. శివరహస్యఖండము

ఈ ప్రశస్తవచనకావ్యము ముదిగొండ బ్రహ్మయ లింగారాధ్యులచే రచితమై క్రీ. శ. ౧౮౫౨లో ముద్రిత మైనది. ౧౮౭౬ లో రెండవమాఱు ముద్రితమైనది. ఆ గ్రంథవివరణము ఈక్రింద నీయబడినవి.

ఇది స్కాందపురాణశంకరసంహితయందు ౧౩౦౦౦ శ్లోకములుం గల ఖండము. ఇం దేడు కాండలు (౧) సంభవ (౨) ఆసుర (౩) వీరమాహేంద్ర (౪) యుద్ధ (౫) దేవ (౬) దక్ష (౭) ఉపదేశము లను నవి. తెనుగున వచనముగ వ్రాసిన గ్రంథకర్త చంపూ కావ్యములవలెనే గ్రంథావతారిక, ఆశ్వాసాద్యంత గద్యపద్యములు వ్రాసియున్నాడు. మఱియు ప్రఖ్యాత శైవగురుడగు నుద్భటారాధ్యునుండి తన వంశక్రమ మును వర్ణించియున్నాడు.

కాశీవిశ్వేశ్వరునివలన ఉద్భటారాధ్యగురుడు జనిృంచెను. అతడు కాశియం దుండగ పరమేశ్వరుడు కరుణించి మల్లనారాధ్యు డను సుతు నొసగెను. ఇతడు ముదిగొండగురుడు. తరువాత విశ్వనాథ దేశికుడు జనిృంచెను. ఈ వంశక్రమ మిట్టిది:




బ్రహ్మయలింగము—(భార్య విశాలాక్షి)

|

మల్లనారాధ్యుడు,
పాపయసూరి,
అష్టభాషాకవి రామయ్య,
పెదవిశ్వనాథుడు,
చంద్రయ్య

|

అఘోరయ్య — నాగలింగయ్య — బసవయ్య

|

విశ్వపతి-భార్య పార్వతమ్మ.

|

మల్లయారాధ్యుడు (సర్వమంగళాంబ) - ఈతడు గ్రంథ కర్తయగు బ్రహ్మయలింగము తండ్రి. భారద్వాజ గోత్రుడు.

తల్లి సర్వమంగళాంబవంశము:—

కౌశికసగోత్రకాశినాథుని వంశములో సుప్రసిద్ధుడగు వీరనారాధ్యుని పుత్రిక వియ్యమ - భర్త ములుగు శరభయారాధ్యుడు.

కౌండిన్యగోత్రుడగు శరభయారాధ్యునకు సోదరు లిద్దరు. వారు వీరభద్రయ్య, శ్రీగిరిలింగము అను వారు.

ములుగు శరభయ — వియ్యమ




పైవారిలో గ్రంథకర్త తన మాతామహుడగు కౌశినాథుని వీరారాధ్యుడు మిగుల ప్రసిద్ధు డని కవి యిట్లు వర్ణించియున్నాడు:

సీ. శ్రీవ్యాఘ్రపురనగరసంస్థితవరేంద్రేశ్వర
వరలబ్ధవిద్యచే వాసి కెక్కి
పరమతవాదిభీకరవిరుదాంకుఁడై
స్వమతసంస్థాపనాచార్యుఁ డనుచు
తర్కాదినిఖిలశాస్త్రములందు రెండవ
గౌతముఁ డనఁగఁ బ్రఖ్యాతి వడసి
రాజాధిరాజులు పూజించి తన కిచ్చు
నాందోళికంబుల నధివసించి
గీ. మించె నిల కౌశికసగోత్ర మంచితప్ర
తీతిఁ గాంచెను. నీధన్యుచేత ననుచు
పాఠకులు నుతింప శ్రీకాశినాథవంశ
దీపకుఁడు వీరనారాధ్య దేశికుండు [1].

తన మేనమామయును, బ్రహ్మయనామాంకితుడు నగు ములుగు శరభనారాధ్యుని[2] ఇట్లు వర్ణించి యున్నాడు:

మ. కవితాగానవిలాసపేశలితవాక్
వైశద్యసంప్రీతిపా
ర్థివదత్తాధరణోత్తమాశ్వవసుధా
దివ్యాంబరాందోళికా
దివిశేషాన్వితవస్తుసంపదభివృ
ద్ధిం గాంచి నిస్తుల్యుఁడై
భువి నాబ్రహ్మయదేశికేంద్రుఁ డలరెన్
భూరిప్రభావోన్నతిన్.

శివరహస్యఖండము మంచి వచనరచన గల కృతి. శైలి సరళముగ నుండును. మచ్చునకు :

"విష్ణునేత్రసంజనిత లగు సౌందర్యవల్లి, అమృతవల్లి యను కన్య లిద్దఱు నొద్దిక నద్దేవసేనాపతిని వరింపం దలచి మోహంబున మన్మథశరావిద్ధచిత్తలై యావిత్తరలు విశాఖు డభంగతపశ్చర్యంగాని వరింపడని మనంబున నిశ్చయించి యహోరాత్రంబు లాహారనిద్రల నూహింపక కుమారు దుద్భవించిన శరవణతటాకతటంబు జేరి దుకూలవసనంబులు విసర్జించి నారచీరలు దాల్చి, మణికాంచీదామంబులు దలంపక, శరపుంజమౌంజీ ధరితలై యాగరితలు భస్మత్రిపుండ్రంబులు రుద్రాక్షాభరణంబులు దాల్చి జటాధారిణులై షడక్షరీమంత్రంబు జపియించుచు దహరపుండరీకంబున గుహుని నిల్పి యనేకహాయనంబులు నిరాహారులై తపంబు సేయుచున్న బాహులేయుం డాయువతుల యతిశయతపశ్చర్య జరించుట గాంచి యవార్యంబగు దయ దళుకొత్తనత్తఱిం బోడనూప వేడుక పొడమ, మణిహారావళీకలసితవక్షస్థలుండు, దరహాసచంద్రికావిరాజమాన ముఖచంద్రుండు నగుచు మారట మారుడో యన గుమారుండు గనబడియె. (పుట ౬౮)

## శివరహస్యఖండము

టీకాతత్త్వప్రకాశినివచనకావ్యము ముదిగొండ బ్రహ్మయలింగారాధ్యకృతము. ౧౮౯౬లో ఎద్దనపూడి సంజీవయ్యగారికై చెన్నపురి శశిలేఖా ముద్రాక్షరశాలలో ముద్రితమైనది. ఈ ముద్రణమున రాయలు సైజున ౮౧౬ పుటలు చిన్నటైపులో గలవు. గ్రంథాంతమున గద్య యిట్లున్నది.

---

1. పైని పేర్కొనబడిన కాశినాథుని వీరనారాధ్యుడే ధర్మగుప్తాభ్యుదయము, భద్రాయుశ్చరిత్ర అను వీరశైవపద్యకృతులను రచియించిన మహాకవి. పూజ్యపాదులు, దేశోద్ధారకులు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులవారు వీరికి నైదవతరమువారు. పైకృతులలో ధర్మగుప్తాభ్యుదయ మముద్రితము. భద్రాయుశ్చరిత్ర కొంతభాగము బందరులో మల్లంపల్లి భైరవమూర్తిగారి 'రత్నాకర' పత్రికలో ప్రకటితమైనది. ఇది పూర్ణముగా ముద్రింపదగిన కృతి. శ్రీ కాశీనాథునివారి వంశవృత్తాంత మిందు సమగ్రముగా నున్నది.

2. ములుగువారిలో పెక్కుమంది తెనుగుకవులు గలరు. ఈ శరభనారాధ్యుడు రచించిన కాళహస్తీశ్వర, మల్లికార్జునశతకములు లభించుచున్నవి. ఈతని కొమారుడు మృత్యుంజయారాధ్యకవి కాళిదాసకుమారసంభవమును "గౌరీపరిణయము" అను పేర తెలిగించి యున్నాడు. అది క్రీ. శ. ౧౮౮౪లో ముద్రితమైనది. ములుగువంశీయులలో లింగనారాధ్యకవి బ్రహ్మోత్తరఖండమును పద్యకావ్యముగా రచియించియున్నాడు. దాని ప్రతి తంజావూరి పుస్తకశాలలోను, మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోను గలదు. వీనిని గూర్చిన వివరణము నా 'వీరశైవవాఙ్మయము'న జూడవగును.

ఇది శ్రీమద్భ్రమరాంబామల్లేశ్వరకరుణాకటాక్ష వీక్షాపాత్ర భారద్వాజసగోత్ర ముదిగొండ మల్ల వారాధ్య పుత్ర సకలకవిజనానుషంగ బ్రహ్మయలింగ ప్రణీతంబైన శ్రీస్కాందం బను మహాపురాణంబున శంకరసంహిత యందు, శివరహస్యఖండంబున కర్త తత్త్వప్రకాశిని యను వచనకావ్యంబు పంచాశీతి తమోధ్యాయసమన్విత ముపదేశకాండంబు సమాప్తము.

| | |
|---|---|
| సంభవకాండ | —౫౦ |
| ఆసుర | —౧౫ |
| వీరమాహేంద్ర | — ౪ |
| యుద్ధ | —౩౫ |
| దేవ | — ౪ |
| దక్ష | —౪౧ |
| ఉపదేశ | —౭౫ |
| అధ్యాయములు— | ౨౪౦ |

ప్రతిఅధ్యాయముముందును వచనభాగమును సంగ్రహముగా దెలుపు పద్యములు గలవు.

ఈ గ్రంథము శైవులకేగాక సాహితీవేత్తల కుపాదేయ మగు కృతి. ఈ వచన రచన పునర్ముద్రణము చేయదగినది.

## ౨. తెలుగువెలుగుముగుదకత
## అను శ్రీమదాంధ్రకవితావేదినీవిలాసము

ఇది తిరువల్లిక్కేణినిలయుం డగు తడకమళ్ల వేంకటకృష్ణరావుచే రచియింపంబడి పిల్లలమఱ్ఱి పూర్ణయ్య సిద్ధాంతిచే బరిష్కృతమై చెన్నపురి శ్రీనిధి ముద్రాక్షర శాలయందు ముద్రింపబడెను. ౧౮౪౯; ౧౦౨ పుటలు. చిన్న సైజు.

చివర సీసపద్యము కలదు:

సీ. శ్రీగోలుకొండాఖ్య జెన్నొందు వ్యాపారి
కులమున హారితసగోత్రమునను
యజుసున తడకమళ్లాన్వయజాతుండు
శైరవిణీసర స్తీరవాసి
కనకమ్మగర్భసంజనితుండు వేంకట
కృష్ణరావుసమాఖ్య వెలయు సుకవి
రసికప్రియార్థమై రచియించి తెనుగున
నీ చంపుకావ్యంబు నింపుమీఱ
గీ. పిల్లలమఱి పూర్ణయ్య యన్ శ్రీకిశాపు
రాధి శేత్ప్రసమాన్యనితుం డగుచు వెలయు
దైవవిదుని సహాయము తనకు గలుగ
ముద్రితము జేసి వెలయించె ముదముమీఱ.

ఇది తెనుగుకవిశ్వనుకు సంబంధించిన నవల. కల్పితము. శృంగారలతికయను రాజకన్యక కుండుడను రాజకుమారుని మోహించుట, వారికి సమాగమము కాక, ఇరువురు ప్రాణములు విడిచి పిశాచరూపములు ధరించుట, ఒక యోగివలన వారల పూర్వవృత్తాంతము తెలిసికొనుట, కిమిడియను పట్టణమున సకలకళాధురంధరుడగు రాజునకు చంపకామోద యను కూతురు గలుగుట, ఆమెకు "తెలుంగువెలుంగు" అని యామె విద్యావిశేషములబట్టి పండితులు పేరుపెట్టుట, ఆమె కవితాచమత్కృతులచే నందఱిని మెప్పించుట చీంబోతురాయని యుదంతము—మున్నగున వందు గలవు. అచ్చటచ్చట పద్యములు గలవు. శైలి సరళమై, సులభగ్రాహ్యమై యున్నది.

మచ్చునకు—

"కిమిడి యను పట్టణంబున తెలుంగువెలుంగను నొక పడుపుకత్తియ, యాలోకంబున దనకు సరి తెలుంగుపండితులు లేరనియు, కవులు పశువులే యనియు బలుకుచు వచ్చినవారియెడ తొలుతన ౧౦౦౦ వరహాలొక్కరాత్రికని తీసికొని యాపిదప సెద్దియో యొక పద్దము వ్రాసి పంపుటయు, నతం డుత్తరం బివ్వనియెడల నతనిపై పేడనీరు బోయించి చీపురు చేటలచే గొట్టి యవమానం బొనర్చి యనుపుటయు జేయుచున్నయది. దానిచే ననుతులుం ధనముం గోల్పోయినవారు నసేకులు గల రందులోన నేనును నొక్కండ నయ్యు నా ధననష్టంబును నవమానమును నోర్వజాలక యిక్కడకు వచ్చితి." (౩౪, ౩౭ పుటలు)

ఇందు 'దీని భావ మేమి తిరుమలేశ !' వంటి యుత్తర ప్రత్యుత్తరపద్యములు గలవు.

మచ్చునకు—

"పచ్చి యారఁబోదు పదియేడులకునైన
గచ్చుకంపు బిట్టుగాదు నీరు
ఇట్టిదాని విలువయే వేయి నిష్కముల్
తగిన విలువ బలుకు తడయ కిపుడు.
వినూ రై మారుసు మరి
జానగు బోనంబు కూర చవులుగఁ గొఱకుల్
మా నగరపు విలువ యగుఁగా
మానిని యన్యతంబు రాదు మద్యాపలకున్."

శ్రీవిద్యాప్రసక్తి, శ్రీ స్వాతంత్ర్యము పెంపొందు నీకాలమున నీగ్రంథ మావశ్యకముగ ముద్రింప

# వాద ప్రతివాదములు : యాస్కుని సిద్ధాంతము

శ్రీ శివశంకరస్వామి

(గతసంచిక తరువాయి)

(౨) 'తథాపిచేత్ సర్వాణ్యాఖ్యాతజాని నామాని స్యుర్యావద్భి ర్భావైః సంప్రయుజ్యేత తావద్భ్యో నామధేయప్రతిలమ్భః స్యాత్ తత్రైవం స్థూణా దరశయా వా సంజనీచ స్యాత్.'

—అనగా, నామఘటకధాతువాచ్యక్రియ నవలంబించి నామోత్పత్తి యగుచో ఒక వస్తువునందు నానావిధక్రియాసంబంధహేతువుచే ఏకవస్తువుకు నానావిధనామములు కలుగును. ఉదాహరణము : 'దరే గర్తే శయా వా' అని స్థూణమును 'దరశయా' అనుట ఉచితము.

అభిప్రాయ మిది : స్థాధాతువాచ్యక్రియాధర్మానుసారముగా 'స్థూణా' నామము నిష్పన్నమైనచో, అన్యాన్యధాతువాచ్యక్రియాధర్మానుసారముగా దానికి దరశయాదినామముకూడ నిష్పన్నమనుట ఉచితము. ఇది గార్గ్యుని ద్వితీయాపత్తి.

శాకటాయనపక్షమున 'ఏతేనైవోత్తరః ప్రత్యుక్తః' అన్నాడు. రెండవ యాపత్తికూడ పూర్వోక్తప్రకారముగానే ప్రత్యాఖ్యాత మయినది. ఏకవస్తువునకు బహుక్రియాయోగ మున్నను, ఒక్క క్రియను బట్టియే నామము వచ్చును. పరివ్రజనము కాక తక్కిన పనులు చేసినను సన్యాసిని పరివ్రాజకు డందురు.

(3) 'తథాపి య ఏషాం న్యాయవాన్ కార్మనామికః సంస్కారో యథా చాపి ప్రతీతార్థాని స్యుః తథైనా వ్యాచక్షీరన్ పురుషం పురిశయ ఇత్యాచక్షీర న్నష్టే త్యశ్వం తర్దన మితి తృణమ్' అనగా స్పష్టార్థతావిధానమునకై వస్తుగతక్రియాధర్మానుసారముగా వస్తువునకు నామ ముండుపక్షమున, ఏశబ్దము స్పష్టతరముగా క్రియాప్రతిపాదకమో తద్ద్వారా నామ ముండుట మిక్కిలి సమీచీన మగును. కాబట్టి పురుషుని 'పురిశయ', అశ్వమును 'అష్టా', తృణమును 'తర్దన' అనుట సమంజసము. దీని యభిప్రాయ మిది: పురిశయనప్రతిపాదక పురుషశబ్దము అత్యనావశ్యక మగుచో దానిని 'పురిశయ' యనుట మిక్కిలి మంచిది. ఇట్లే వ్యాప్త్యర్థక అశ్ ధాతూత్పన్న అశ్వశబ్దస్థానమున 'అష్టా' అనుటయు, హింసార్థక తృద్ ధాతూత్పన్నతృణశబ్దస్థానమున 'తర్దన' మనుటయు నుచితము. కాని యెవ్వరును ఇట్లనరు. కాబట్టి పురుషాదిశబ్దములు ధాతుజములు కావు. 'కార్మనామికః సంస్కారః'—ఏతత్సంబంధమున దుర్గాచార్యుడు, "కర్మకృతం నామ కర్మనామ తత్ పునః పాచకలావకాది, తస్మిన్ భవః కార్మనామికః సంస్కారః" అన్నాడు. ఇది గార్గ్యుని తృతీయాపత్తి.

దీనికి ప్రత్యుత్తరముగా శాకటాయనపక్ష మిట్లన్నది : "యథాచాపి ప్రతీతార్థాని స్యుః తథైనా వ్యాచక్షీర న్నితి. స న్త్యల్పప్రయోగాః కృతోఽ ప్యైకపదికా యథా వ్రతతి ర్దమూనా జాట్య ఆట్

ణాకో జాగరూకో దర్విహోమీతి." దీని విస్తరార్థమును దుర్గాచార్యు డిట్లు లిఖించినాడు :

"యత్పున రేత దుక్తమ్—యథాచాపి ప్రతీతార్థాని స్యుః తథైనా న్యాచక్షీరన్ ఇతి. అత్ర బ్రూమః—శబ్దస్వాభావ్య మేతత్ యన్న తథా సర్వాణ్యాఖ్యాయన్తే యథా ప్రతీతార్థాని భవన్తి, న తత్రాహ మపరాధ్యో భవతః, నాపి శాస్త్రమ్. యథావస్థితానాం హి శబ్దానా మన్వాఖ్యానమాత్ర మేవ క్రియతే. నాహం శబ్దానాం కర్తా. య ఏషాం ప్రయోక్తార స్తానే వోపాలభస్వ, నిరాకురువా యది శక్నోషి.

"అహ—కస్మా త్పునః కానిచి దాఖ్యాయన్తే లోకే? తదభిధానస్వాభావ్య మేవ. కానిచి త్ప్రతీతార్థాని కానిచి దప్రతీతార్థాని, తాన్యపి శాస్త్రేణ ప్రతీతార్థాన్యేవ కర్తవ్యాని, ఏతదేవ శాస్త్రస్య శాస్త్రత్వం యదప్రతీతార్థాన్యపి ప్రకృత్యాదినా ప్రతీతార్థాః స్యుః తథైనా న్యాచక్షీర న్నితి. 'సన్తి' ఏవ 'అల్పప్రయోగాః' ప్రతీతార్థక్రియాః కేచిత్ కృతః కృత్ప్రియాన్తా శ్శబ్దాః 'అపి' 'ఏకపదికాః' ఏకపద ప్రకరణాన్తర్వర్తిన స్సద్ధాన్యాణః. తత్ 'యథా వ్రతతి ర్దమూనా జాట్య ఆట్ణారో జాగరూకో దర్విహోమీతి." వ్రతతి ర్వల్లీ. దమూనా దమమనా వేశ్యనమాడి. అగ్ని రతిథిర్వా. జాట్యో జటావాన్. ఆట్ణారః అటనశీలః. జాగరూకో జాగరణశీలః, దర్విహోమీతి దర్వ్యా యో జుహోతీతి ఏవం ప్రతీతార్థాన్యపి ఇతి శాకటాయనాభిప్రాయః."

(౪) "తథాపి నిష్పన్నే ఽభివ్యాహారే ఽభివిచారయన్తి ప్రథనాత్ పృథివీత్యాహుః. క ఏనా మప్రథయిష్యత్ కి మాధారశ్చేతి?" అనగా, వస్తుసిద్ధనామములుగాని, నిష్పన్న నామములుగాని గ్రహించి ధాతు విచారము చేయుట నిరర్థకము. ఏవస్తువుకు ఏనామము ప్రసిద్ధమో ఆ వస్తువే ఆనామమున కర్థము. 'పృథివి' శబ్దము నిష్పన్నశబ్దముగాని, చిరప్రసిద్ధశబ్దముగాని యనుటచే దానిని ప్రథనసంబంధాధీనమని భావించి,— అనగా ప్రథితమని కాని,విస్తారితమని కాని భావించి— భూమికి పృథివి యను నామము వచ్చెనని విచారణ చేసిన శాకటాయనుడు 'ప్రథనాత్ పృథివీ' అనుట సంగతము కాదు. ఇట్లనుచో ఒకానొకప్పుడు అప్రథిత యగు భూమి ప్రథితకాని, విస్తారితకాని యగుటచే దీనికి పృథివీ నామము వచ్చెనని ఉపపన్నమగును. ఈవిధముగా పృథివిని సంబంధాధీనము చేసినచో సహజముగా ఈ ప్రశ్నము పుట్టును: "ఎవరు అపృథివిని పృథివిని చేసినారు? ప్రథనకర్తయు ఏయాధారముపై అవస్థానపూర్వకముగా ఆ ప్రథనకార్యమును సంతరించెను? కాని, వస్తుతః ప్రథనక్రియాకర్త కాని, ప్రథనకర్తకు అన్యాధారము కాని అసంభవములు. కాబట్టి ప్రథనక్రియ అలీకము. అందుచే పృథివీశబ్దము ధాతుజము కాదు." ఇది గార్గ్యుని చతుర్థాపత్తి.

దీనికి సమాధానముగా శాకటాయనపక్షమువారిట్లు చెప్పినారు: "యత్తో ఏతన్నిష్పన్నే ఽభివ్యాహారే ఽభివిచారయన్తీతి, భవతి హి నిష్పన్నే ఽభివ్యాహారే యోగపరీష్టిః ప్రథనాత్ పృథివీత్యాహుః. క ఏనా మప్రథయిష్యత్, కిమాధారశ్చ త్యథవై దర్శనేన పృథు రప్రథితాచే దప్యన్యైః. అథో ప్యేవం సర్వఏవ దృష్టప్రవాదా ఉపాలభ్యన్తే" ఈస్థలమున 'యథా' శబ్దము వాక్యోపాదానమున గ్రహింపవలెను. 'యథా' అనగా 'యేన ప్రకారేణ.' యథాశబ్దానంతరము ఉకారము అవధారణార్థకము. శాకటాయనమతమును విస్తరించుచు దుర్గాచార్యు డిట్లు వ్రాసినాడు: "యత్తో ఏతత్ యత్పున రేత దుక్తమ్—నిష్పన్నే ఽభివ్యాహారే ఽభివిచారయన్తీతి అత్ర బ్రూమః, యుక్తం తే కుర్వన్తి. భవతిహి నిష్పన్నే ఽభివ్యాహారే యోగపరీష్టిః. యోగపరీష్టిర్నామ యోగస్య పరీక్షణమ్. కథం నామాఽనయో ష్పన్నస్య న్నభిధానయోగః పరీక్ష్యతే? అత్ర యదుక్తమ్—ప్రథనాత్ పృథివీత్యాహుః క ఏనా మప్రథయిష్యత్, కి మాధారశ్చేతి?—న వయ మేవ బ్రూమః ప్రథితేయం కేనచి దితః పృథివీయ మితి.

"అహ—కథమియ మప్రాథతా సతీ పృథివీత్వ మాపేతి? ఉచ్యతే—అథవై దర్శనేన పృథు రప్రథితాచే దప్యన్యైః—దృశ్యమానా హీయం పృథివీ. తస్మాత్ యద్య ప్యప్రథితా కైశ్చి దన్యైః తథా

షీయం పృథుదర్శనక్రియాయోగాత్ పృథివ్యేవ... 'అథాపి' చ యది దృష్టే పృసాత్యః పృథుత్వే వయ ముపలభ్యామహే, నను 'ఏవం'సతి, సర్వఏవ దృష్ట ప్రవాదా ఉపాలభ్యన్తే, న కేవల మహామేవ. యో యద్దృష్ట్వా బ్రవీతి, స తత్ర దోష ఏవ. తథాసతి దృష్ట హానం ప్రసజ్యేత. అనిష్టం చైతత్. తస్మాత్ పృథు దర్శనాత్ పృథివీ త్యుచ్యేత."

నిష్పన్న నామములకు ప్రకృతిప్రత్యయాన్వేషణము చేయుట అన్యాయ్యమని గార్గ్యుని చతుర్థాపత్తి. కాని ఇదియు సంగతము కాదు. నామము నిష్పన్నమో ప్రవృత్తమో కానిచో యోగపరీక్షకాని ప్రకృతి ప్రత్యయముల యోగాన్వేషణముకాని యెట్లు సంభవ పరమగును? ప్రథనాత్ పృథివీ అన్నాడు శాకటాయనుడు. అందులకే ఉపహాసచ్ఛలమున గార్గ్యుడు రెండు ప్రశ్నలు వేసినాడు.

(౧) మొదట అప్రథితపదార్థవిశేషమును ప్రథనముద్వారా ఎవరు పృథివిని చేసినారు?

(౨) ప్రథనకర్త ఏయాధారావస్థానపూర్వకముగా తత్ప్రథనకార్యమును సంపాదించినాడు?

యాస్కు డిట్లన్నాడు: "ఇట్టి ప్రశ్న మప్రాసంగికము. ఎవరివలన నయినను పదార్థవిశేషము ప్రథితమయినను కాకున్నను ఈ భూఖండము ప్రథనముకాని, విస్తారముకాని, ప్రత్యక్షదృష్టమని దీనిని పృథివి యనవలెను. ఇక పృథుత్వహేతువుచే దీనిని పృథివి యనకున్నచో దృష్టహాని యను దోషము దుర్వార మగును. కావున శాకటాయనుని పలుకు నింద్యము కాదు."

నిరుక్తమున న్యాయమార్గావలంబనపూర్వకముగా గార్గ్యుని ప్రశ్నద్వయము ప్రత్యాదిష్టమయినది. శ్రౌతమార్గానుసారముగా గూడ దీనికి సమాధాన మిచ్చుట అసంభావ్యము కాదు. ఋగ్వేద, బృహదారణ్యకముల ఘోషణానుసారముగా ప్రథమప్రశ్నమునకు "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" (ఋ. ౬-౪౭-౧౮ ; బృహ. ౨-౫-౧౯) అని సమాధానము. ద్వితీయప్రశ్నమునకు సమాధానముగా "స భగవః కస్మిన్ ప్రతిష్ఠితః? స్వే మహిమ్ని" అని ఛాందోగ్యమున ఆమ్నాతము. (౭-౨౪-౧).

(౫) "అథాన్వితేఽర్థేఽప్రాదేశికే వికారే పదేభ్యః పదేతరార్ధాన్ సంచస్కార శాకటాయన ఏతేః కారితంచ యకారాదిం చాన్తకరణ మస్తేః శుద్ధంచ సకారాదించ" ఈపట్టున దుర్గాచార్యు డిట్లు లిఖించినాడు: "తత్ర కేషాంచి న్నైరుక్తానాం కైశ్చిత్ వైయాకరణై స్సాకం కేషుచిత్ శబ్దేష్వైకమత్యం కేషాంచిత్ వైమత్యమ్. తత్ర శాకటాయనో నైరుక్తాశ్చ గార్గ్యవర్జం కానిచి దభిధానాన్యనేకై ర్ధాతుభి రనువిదధతి, కానిచి దేకైనైవ... తత్ర యదనేకై రనుహితవాన్, తదితరైః గార్గ్యపాణిన్యాదిభి ర్నమృష్యతే. కిం కారణమ్? అప్రసిద్ధోహి స తేషాం శబ్దానువిధానమార్గో ధాతుసముదాయమాత్రమేవ నామేతి. అత స్తే శాకటాయన మాచిక్షిప్సన్త ఆహుః—అథాన్వితేఽర్థఇతి, అనన్వితేఽర్థేననుగతే శబ్దే నార్థే—యత్ర సంస్కార్యమాణోఽపి శబ్దోఽర్థమనుగన్తుం నశక్నోతి' ఏవం ధాతుజోఽసమర్థో భవతి. 'అప్రాదేశికే వికారే చ' యయాహి క్రియయా తద్ద్రవ్యం ప్రదిశ్యతే తదభిధాయకో యోధాతుః స తదభిధానం విగృహ్యమాణం వికర్తుం నశక్నోతి. యత్రతత్ర హీయమానప్రతిజ్ఞః శాకటాయనః సర్వాణ్యాఖ్యాతజాని నామా న్యుపపాదయిష్య న్నసంభవేసతి కాశకుశావలంబన మివ కుర్వన్ కిమకరోదితి? 'పదేభ్యః పదేతరార్ధాన్ సంచస్కార శాకటాయనః'—పదేభ్య ఆఖ్యాతపదేభ్యః సమస్తేభ్యోఽవయవా నపాదాయ పదేతరార్థాన్ అన్యాంశ్చ అన్యాంశ్చేతరేతరాఖ్యాతపదావయవై రనైష్ట న్యాసస్య దన్యదర్థం నామ్నః సంస్కృతవాన్. తద్యథా—'సత్యమ్' ఇత్యేతదభిధానం సంచస్కార. కథమ్? 'ఏతేః కారితంచ యకారాదిం చాన్తకరణ మస్తేః. శుద్ధంచ సకారాదించ.' ఏతేః ఇణ్ గతౌ ఇత్యస్య-కారితం ణ్యన్తం రూపం కృత్వా, తతో యకార మాదాయ మకారాన్తం కృత్వా సత్యశబ్ద స్యాన్త మర్థం సంచస్కార, తతో యమ్ ఇతి భవతి. అస్తేః శుద్ధంచ. 'అస్ భువి' ఇత్యేతస్య శుద్ధమేవ రూపం కృత్వా న కారి

తాస్తి మిత్యర్థః. తతః సకారాదిశబ్దరూపం గృహీత్వా సత్ ఇత్యేతత్, సత్యమ్ ఇత్యేతస్య శబ్దస్యాది మకరోత్. అద్య మర్ధం సంచస్కార. తత్ సదితి భవతి. అత్రకారోఽయ మస్తే స్తకారః స యకార మభిరోహతి. ఏవ మేత దేక మభిధానం ద్వయోర్ధాత్వోః సంచస్కార సత్యమితి. అథ కోఽర్థః? సన్త మర్థ మాయయతి ప్రత్యాయయతి గమయ తీతి సత్యమ్...... తదేత దకృతపూర్వ మన్యై ర్విద్వద్భిః శాకటాయనోఽతిపాండిత్యాభిమానా దకరోత్......తస్మా దతిప్రసంగదోషోపపత్త్యా నానేకధాతుజాని నామాని నాపి సర్వా ణ్యాఖ్యాతజానీతి."

పైదానికి నిష్కర్ష యిట్లుండును. శబ్దము ఏ స్థలమున అర్థానుగామి కాదో, ధాతు వెచ్చట అర్ధప్రకాశము చేయదో ఆ స్థానములలో శాకటాయనుడు ఏకాధిక పదములనుండి పదాంశలు గ్రహించి అలౌకికోపాయముచే శబ్దవ్యుత్పత్తి ప్రదర్శించినాడు. ఉదాహరణముగా సత్యశబ్దమును జూపవచ్చును. సత్యపదమున సత్, య అను రెండుభాగములను విభజించిన పిమ్మట అస్తిపదమందలి అకార, సకార, తకారములను గ్రహించి వర్ణవిపర్యయప్రణాళిక ననుసరించి సకారముతరువాత అకారమును స్థాపించి, సత్యశబ్ద పూర్వార్ధమును—అనగా సత్ అను అంశను శాకటాయనుడు సంస్కరించినాడు. ఇంతియేకాక, జ్ఞానార్థక ఇణ్ ధాతుణ్యంతరూపమయిన "ఆయయతి" అను పదమునుండి యకారమును గ్రహించి, సత్యశబ్దశేషార్ధ యకారాంశను సంస్కరించినాడు. ఆయనమతమున సంస్కృతసత్యశబ్దముద్వారా ఏది విద్యమానార్థమున జ్ఞానమును కలిగించునో అదియే సత్యమని గ్రహింపవలెను. శబ్దమును అర్థానుగామిని చేయుటకై ఈవిధముగా నెవ్వరును ఎన్నడును పదవ్యుత్పత్తిని చూపలేదు. సమస్తనామములకును ధాతుజత్వమును చూపెడి ప్రతిజ్ఞను రక్షించుకొనుటకై శాకటాయనుడు చేయుయత్నమున పదసంస్కారసందర్భములో అప్రసిద్ధ నూతనప్రణాళిక నవలంబించినాడు. ఇది గార్గ్యుని అయిదవ ఆపత్తి.

దీనికి బదులు శాకటాయనపక్షమున యాస్కుడిట్లన్నాడు: "యత్తో ఏతత్ పదేభ్యః పదేతరార్ధాన్ సంచస్కారేతి యోఽనన్వితేఽర్థే సంచస్కార స తేన గర్హ్యః, సైషా పురుషగర్హా నశాస్త్రగర్హా ఇతి." దుర్గాచార్యు డిట్లు లిఖించినాడు: "యత్తో ఏతత్—యత్పున రేత దుక్తమ్—పదేభ్యః పదేతరార్ధాన్ సంచస్కారేతి; అత్ర బ్రూమః—'యోఽనన్వితే' శబ్దే నానభిధేయే 'అర్థే' అననుగత మసంబంధం 'సంచస్కార సతేన' అసమంజసేన అసంబద్ధేన సంస్కారేణ గర్హ్యః గర్హణీయః, నపున రాచార్యో యోఽనుగమయ్య ధాతుభి రనేకై రేకాభిధానగతా నర్థాన్ తతః సంచస్కార, సైవ మాధ్యేన. 'సైషా'......'పురుషగర్హా'......పురుషదోషః, న శాస్త్రగర్హా, న శాస్త్రదోషః......అనుగత ఏవార్థే సంచస్కార శాకటాయనః 'సన్తమేవ హ్యర్థ మాయయతి గమయతీతి సత్యమ్' ఇతి. తస్మా దుపపద్యత ఏవ శాకటాయన మతమ్."

స్కాందభాష్యమున యాస్కీయవాక్యమునకు రెండువిధముల యోజన కానవచ్చుచున్నది. అందిట్లు లిఖించియున్నది: "యోఽనన్వితేఽర్థే సంచస్కార స తేన అన్యాయ్యేన గర్హ్యః. సైషా పురుషస్య శాకటాయనస్య గర్హా, న నామ్నా మాఖ్యాతజత్వస్య." ఇదియే మొదటి యోజన. ఇక ద్వితీయయోజన: "యోఽనన్వితే......శాకటాయనస్తు నానన్వితేఽర్థే సంచస్కార...అతో అసా వగర్హ్యః, సైషా భవతః పురుషస్య గర్హా, న గర్హ్యః శాకటాయనః."

ప్రథమయోజన హృద్యముగా లేదు. శాకటాయనమతానుసారముగా సంస్కృతసత్యశబ్దము, దానియర్థము యథాయథముగా అన్వితమయినవి. సంస్కారముతో శబ్దార్థముల అన్వయాభావమును అందరును గ్రహించినారు. స్కందస్వామి చేసిన ద్వితీయయోజన దుర్గాచార్యుని వ్యాఖ్యానము ననుసరించియున్నది.

ఏకాధిక ధాతువులనుండి సుసంగతముగా తథాకథితరూఢశబ్దముల వ్యుత్పత్తినిరూపణము దోషావహము

కాదని యాస్కుని యాశయము. వేదములందుగూడ కొన్నికొన్ని రూఢశబ్దముల వ్యుత్పత్తి బహుధాతువులవలన సాధితమయినది. అందులకే దుర్గాచార్యు డిట్లన్నాడు: "అపిచ రూఢిశబ్దవ్యుత్పత్తిః మంత్రేష్వపి దృశ్యతే. యథాచ లక్ష్యం తథాచ లక్షణం ప్రవర్తితు మర్హతి. ఇతరథాహి కస్య తల్లక్షణం స్యాత్. 'యదసర్పత్ తత్ సర్పిః' ఇతి మంత్రః, 'య న్నవమేవ నీతం త న్నవనీత మభవత్' ఇతి మంత్రః'* అపిచ బ్రాహ్మణే నాప్య నేకధాతుజాన్యేవ కృత్వా నిరుచ్యన్తే తత్ర మంత్రాభిధానాని య త్పరిజ్ఞానే చ ఫల ముపపద్యతే. ఆహ. 'తదేతత్ త్ర్యక్షరం హృదయ మితి.'† హృ ఇత్యేకమక్షర మభిహర న్త్యస్మై స్వాశ్చాన్యేచ య ఏవం వేద, ద ఇత్యేక మక్షరం, దద త్యస్మై స్వాశ్చాన్యేచ య ఏవం వేద, య మితి త్యే కమక్షర మేతి స్వర్గం లోకం య ఏవం వేద' (శతపథ బ్రాహ్మణ ౧౪-౮-౪-౧; బృ. ఉ. ౫-౩-౧) ఇతి. ఏవం హరతే ర్దదాతే రేతేః హృదయశబ్దః. తదర్థఫలోప ప్రదర్శనార్థం బ్రాహ్మణేనైవం నిరుక్తః. తచ్చ నః పరం ప్రమాణమ్. తస్మా చ్ఛాకటాయన స్తదనుదృశ్య సమ్యగేవ కృతవాన్ య దనేకై ర్ధాతుభి రేక మభిధానం నిరుక్తవా నితి."

గార్గ్యుడు శాకటాయనుని పరిహసింపనక్కర లేదు. వేదప్రవృత్తి గమనించి శబ్దవిత్తము లగు ఋషులు అనేకశబ్దములకు ఏకాధికధాతుకల్పన చేసినారు. వేదాచార్యుడగు శాకపూణి మూడుధాతువుల ద్వారా అగ్నిశబ్దనిర్వచనము స్మరించినాడు. ఆయన మతప్రకారము వర్ణవికార ప్రక్రియానుసారముగా గత్యర్థ—ఇణ్ ధాతు అకారము, ప్రకాశార్థక అంజ్ ధాతువును గాని, దహనార్థక దహ్‌ధాతుగకారమును, ప్రాపణార్థక నీధాతునకారమును గ్రహించి, అగ్నిశబ్ద సాధన చేయవలసియుండును. ఈ ధాతుత్రయవాచ్య క్రియలు అగ్నిశబ్దమున ఉపలబ్ధము లగును. అగ్ని గమన క్రియాశీలము, ప్రకాశకము, పార్థివవస్తుదాహకము, దేవతలకు హవనీయద్రవ్యవాహకము. అందువలన శాకపూణి ఈరూపముగా సిద్ధాంతము చేసియుండును. కావున ఈ విధానము శ్రుతివిరుద్ధము కాదు, ప్రథా విగర్హితముకూడ కాదు.

వేదములో 'సతీయమ్' 'సతియమ్' 'సత్యమ్' అను మూడు సమానార్థకపదముల విశ్లేషణము చూపబడినది. ఛాందోగ్యమున నిట్లు శ్రుతము: తాని హవా ఏతాని త్రీ ణ్యక్షరాణి సతీయ మితి, తద్ యత్ సత్ తదమృత మథ యత్ తి తన్మర్త్య మథ యద్ యం తేనోభే యచ్ఛతి, యదనేనోభే యచ్ఛతి తస్మాద్ య మహరహ ర్వా ఏవంవిత్ స్వర్గం లోక మేతి." (౮-౩-౫). దీనిపై భాష్యములో, శంకరభగవత్పాదు లిట్లు పలికినారు: "సకార స్తకారో యమితిచ. ఈకా స్తరకారే

* మంత్రమున కిట్టి క్రమము, పాఠము నెట నుండి గృహీతములయినవో చెప్పుట కష్టము. కాని కృష్ణయజుర్వేదమున "యన్నవ మైత్ త న్నవనీత మభవత్, య దసర్పత్ తత్ సర్పి రభవత్, య ద్ధ్రియత తత్ ఘృత మభవత్"అని అమ్నాతము. (౨-౩-౧౦) మంత్రభాష్యమునం దిట్లున్నది: య ద్యస్మాత్ కారణాత్ దధ్న ఉద్ధ్రియమాణం సత్ నవ మైన్నవం నూతనం రూప మభవత్ తస్మా న్నవంచ తన్నీతం చే త్యుద్ధృ తస్య సారపిండస్య నవనీతనామ సంపన్నమ్. య ద్యస్మాత్కారణా దగ్నిసంపర్కే సతి పిండో విలీయమానో౽సర్పత్ ప్రసృతో౽భూత్ తస్మాత్ సర్పిరితి నామ. యస్మాత్ ప్రసృతస్య శీతలపాత్రస్థాపనేన తత్ పున ర్ధ్రియత ఘన సీభూత మభవత్ తస్మాత్ ఘృతమితి నామ. ఘృ క్షరణ దీప్త్యో రితి ధాతో ర్నైతత్ రూపం; కిన్తు ఘృత మిత్యత్ర ధకారస్య ఘకారాదేశః." దుర్గాచార్యు డీమంత్రము నే స్వీకరించినట్లు తోచును. కాలక్రమమున లిపికారుల ప్రమాదమువలన పాఠాంతరము, క్రమ విపర్యయము సంఘటిల్లియుండును.

† బృహదారణ్యకోపనిషత్తులో మంత్రమునకు (౫-౩-౧) భాష్యమున శంకరభగవత్పాదులు ఇట్లు చెప్పినారు: "హృదయనామాక్షరవిషయ మేవ తావ దుపాసన ముచ్యతే. తదేతత్ హృదయమితి నామ

ఉచ్చారణార్థోఽనుబన్ధః, హ్రస్వేనైవాక్షరేణ పునః ప్రతినిర్దేశాత్ తేషామ్ - యత్ సత్ సకార స్తదమృతం బ్రహ్మ. అమృతవాచకత్వా దమృతమేవ సకార స్త కారాన్తో నిర్దిష్టః. అథ యత్ తి తకార స్త న్మర్త్యమ్. అథ యద్ య మక్షరం తే నాక్షరే నామృతమర్త్యాఖ్యే పూర్వే ఉభే అక్షరే యచ్ఛతి యమయతి నియమయతి వశీకరోతి ఆత్మ నేత్యర్థః."

ఆనందగిరి ఈపట్టున "బ్రాహ్మణః సత్యమితి నామ తస్య య న్నిర్వచనం కృతం తస్య ప్రయోజనమాహ..." అన్నాడు. బృహదారణ్యకమున నిట్లు ఆమ్నాతము: "దేవాః సత్య మేవోపాసతే తదేతత్ త్ర్యక్షరం సత్య మితి స ఇత్యేకమక్షరమ్, తీ త్యేకమక్షరమ్, య మిత్యేక మక్షరమ్..." (౫-౫-౧). దీనిపై ఆచార్య శంకరుల భాష్యము: "కాని తా న్యక్షరా ణీత్యాహ —స ఇత్యేకమక్షరమ్, తీత్యేక మక్షరమ్. తీతి కారాను బన్ధో నిర్దేశార్థః. య మితి త్యేక మక్షరమ్. తత్ర తేషాం ప్రథమోత్తమే అక్షరే సకారయకారౌ సత్యమ్..."

కావున సత్యశబ్దనిర్వచనమున శ్రుతిప్రవృత్తి ననుసరించియే శాకటాయనుడు తన్మధ్యస్థితాక్షర త్రయమునకు ధాతూత్పన్నత్వము చూపినాడు. కాబట్టి సత్యశబ్దవ్యుత్పత్తినిరూపణము సంపూర్ణముగా ఆయన బుద్ధిమాత్రోత్ప్రేక్షితము కాదు.

(౬) "తథాపి సత్త్వపూర్వో భావ ఇత్యాహు రపరస్మా ద్భావాత్ పూర్వస్య ప్రదేశో నోపపద్యత ఇతి తదేత న్నోపపద్యతే." దుర్గాచార్యు డిట్లన్నాడు: "తథాపి అయ మపరో దోషః ప్రసజ్యతే. కతమః? 'సత్త్వపూర్వో భావ ఇత్యాహుః,' అభియుక్తా స్తద్విదః సత్త్వం పూర్వమస్మాత్ సోఽయం సత్త్వపూర్వః. కిం కారణమ్? సత్త్వాశ్రయఏవ హ్యసౌ. తత్రైవంసతి 'అపరస్మాత్ భావాత్' అపరకాలీనేన భావేన క్రియయా 'పూర్వస్య' పూర్వోత్పన్నస్య సత్త్వస్య 'ప్రదేశః' ప్రదేశనం సంజ్ఞాప్రతిలంభో 'నోపపద్యతే.' కిం కారణమ్? ఉత్పత్తిసహభూతాహి సా. స్వేనాభిధానేన క్రియానిరపేక్షేణాభిసంబద్ధమేవ ద్రవ్య ముత్పద్యతే, నిత్యసంబద్ధౌహి శబ్దార్థావితి. 'తదేతత్' సర్వథా సర్వాణ్యాఖ్యాతజాని నామానీతి శాకటాయనమతం 'నోపపద్యతే' తదనుపపత్తౌ నస్మత్పక్షసిద్ధిః కానిచి దాఖ్యాతజాని నామాని కానిచి దనాఖ్యాతజానీతి.

దీని యభిప్రాయ మిది. ప్రథమమున వస్తువు, పిమ్మట క్రియయు ఉత్పన్నము లగును. క్రియ ద్రవ్యాశ్రితము. శాకటాయనమతమున ఉత్తరకాలభావిని యగు క్రియాద్వారమున పూర్వోత్పన్నవస్తువునకు నామకరణ మగును. ఇది అసంభవము. వస్తునామము వస్తువుతోడనే పుట్టును. కావున, ఉత్తరకాలభావిని యగు క్రియతో సంబంధము లేకుండనే వస్తూత్పత్తి తోడనే నామ ముత్పన్నమగునని చెప్పవలసియుండును. ఇట్లు చెప్పనిచో శబ్దార్థసంబంధ మనిత్య మగును. కాబట్టి సమస్తనామములకును ధాతుజత్వము కల్పించుట అసంభావ్యము. ఇది గార్గ్యుని తుది యాపత్తి.

---

త్ర్యక్షరమ్. త్రీ ణ్యక్షరా ణ్యస్యేతి త్ర్యక్షరమ్. కాని పున స్తాని?...హృ ఇత్యేక మక్షరమ్, అభిహరన్తి హృతే రాహృతికర్మణో హృ ఇ త్యేతత్ రూప మితి రూపా వేద యస్మాత్ హృదయాయ బ్రహ్మణే స్వాశ్చేంద్రియా ణ్యన్యేచ విషయాః శబ్దాదయః స్వంస్వం కార్య మభిహరన్తి హృదయంచ భోక్త్రర్థ మభిహరతి. తతో హృదయనామ్నో హృ ఇత్యేత దక్షర మితి రూపా వేద అస్మై విదుషే అభిహరన్తి స్వాశ్చ జ్ఞాతయోఽన్యే చాసంబద్ధాః. బలిమితి వాక్య శేషః, విజ్ఞానానురూప్యేణ హ్యేతత్ ఫలమ్."

'ప్రకాశికలో' రంగరామానుజు డిట్లన్నాడు: బలిముపహరన్తి తత్ క్రతున్యాయాదితి భావః....ఏవం నామాక్షరనిర్వచనజ్ఞానాదపి ఈదృశం విశిష్టం ఫలం లభ్యతే కిముత తదుపాసనయేతి హృదయస్య స్తుతిః కృతా భవతి."

వార్తికకారులు సురేశ్వరాచార్యు లిట్లన్నారు:-

"యతఏవ మతో యత్నా
దుపాస్యం హృదయం సదా
హృదయాఖ్యాక్షరాణాం చ
శ్రుత్యోపాసన ముచ్యతే."

(బృహదారణ్యకవార్తికము)

శాకటాయనపక్షమున సమాధానము : "యథో ఏత దపరస్మాత్ భావాత్ పూర్వస్య ప్రదేశో నోపపద్యత ఇతి పశ్యామః పూర్వోత్పన్నానాం సత్త్వానా మపరస్మాత్ భావాత్ నామధేయప్రతిలంభ మేకేషాం నైకేషాం యథా బిల్వాదో లంబచూడక ఇతి బిల్వం భరణాద్వా భేదనా ద్వా." ఇక్కడ దుర్గాచార్యుని వాక్యములు : "యత్పున రేతదుక్తమ్—అపరస్మాత్ భావాత్ పూర్వస్య ప్రదేశో నోపపద్యతఇతి. అత్ర బ్రూమః—'పశ్యామః పూర్వోత్పన్నానాం సత్త్వానా మపరస్మాత్ భావా న్నామధేయప్రతిలంభమ్' అపరస్మా దపరకాలీనా దపి సతో భావాత్. 'ఏకేషాం' 'న ఏకేషామ్' తద్ 'యథా' బిల్వాదో లంబచూడక ఇతి. పశ్చాత్కాలీనయాపి చూడాలంబనక్రియయా భవిష్యతా యోగేన బిల్వాదనక్రియయా చ పూర్వోత్పన్నస్య సత్త్వస్య నామధేయప్రతిలంభ ఉపపద్యమానో దృష్టః. క్వచాన్యత్ర నోపపద్యతే. తత్ర యదుక్తమ్—'అపరస్మాద్ భావాత్ పూర్వస్య ప్రదేశో నోపపద్యతే' ఇతి. ఏత దనైకాన్తికత్వా దయుక్తమ్. ఉపపద్యత ఏవ కేషాంచి దితి. 'బిల్వం భరణాద్వా భేదనాద్వా'. భూతం హి తద్భవతి బీజానామ్, బిభర్తి వా దుర్భిక్షాదౌ భక్ష్యమాణం జనమ్. భేదనాద్వా భిద్యతే హి తదవశ్యం భక్షణాయేతి."

భూతక్రియాద్వారమునను వర్తమానక్రియాద్వారమునను నామకరణము కావచ్చును. సోమయాజి, పాచకుడు ఉదాహరణములు. కాని క్రియకు ముందుగా తద్ద్వారమున వస్తువునకు నామకరణ మసంభవము. ఇట్టి యాలోచనవలన గార్గ్యుని యాపత్తి యుదయించెను.

దీనిపై యాస్కు డిట్లనెను: ఉత్తరభావినీక్రియాద్వారమునకూడ నామకరణప్రథ కానవచ్చును. నవాగతశిశువు బిల్వాదు డందురు. భవిష్యత్కాలమున లంబచూడు డగునని శాండిలసంప్రదాయమున సద్యోజాతశిశువునకు లంబచూడకనామ ముంతురు.

'భావిని భూతవ దుపచారః' అను న్యాయప్రకారము ఇట్టిప్రథ ప్రవర్తిత మయియుండును. ఈ న్యాయానుసారముగా శ్రుతికూడ పరభావిని క్రియాద్వారమున పూర్వజాతవస్తువ్యపదేశము చేసియుండును: "పురోడాశకపాలేన తుషా నుపవపతి" అనుపట్టున భవిష్యత్పురోడాశసంధానానుసారముగా కపాలవిశేషమునకు పురోడాశకపాలమని పేరు.

నైరుక్తులు శాకటాయనుని సమర్థించు టెందులకు ? దీనికి సమాధానము దుర్గాచార్యుడు వ్రాసినాడు : "శిష్యబుద్ధివృద్ధ్యర్థమేవ తదుక్తమ్. కథం నామ వ్యుత్పన్నబుద్ధిః శిష్యోఽప్రతిబుధ్యమానః సర్వతోముఖా నేవ లౌకికా న్వైదికాన్ శబ్దాన్ నిర్బ్రూయాదితి! సర్వాణ్యేవహి వ్యాకరణాని నిరుక్తాని చ వేదాంగత్వావిశేషాత్ ప్రమాణాని. తేషామేవ ఫల మిదం క్వచి దసాధ్వ్యేత దశక్యం వక్తుమితి."

కావున వ్యుత్పన్నత్వవాది యగు మునివ్యాకరణానుసారముగా అన్యాన్యవ్యాకరణములందును సమస్తనామములకును 'ధాతుజత్వ'ము దర్శితమయినది. యాస్కుడు శాకటాయనుని సిద్ధాంతానవద్యత నిరూపించినాడు. అయన స్పష్టముగా నిట్లు చెప్పినాడు : అథాపీద మన్తరేణ మన్త్రే ష్వర్థప్రత్యయో న విద్యతే, అర్థ మప్రతియతో నాత్యన్తం స్వరసంస్కారోద్దేశః, తదిదం విద్యాస్థానం వ్యాకరణస్య కార్త్స్న్యం స్వార్థసాధకం చ." *

దీనిపై దుర్గాచార్యుని వాక్యములు : "మన్త్రేషు ...యః సమస్తార్థ స్తస్మిన్ ప్రత్యయో విశేషావధారణం న విద్యతే......అపీదం శాస్త్ర మన్తరేణ పదార్థప్రత్యయో నాస్తి...పదార్థశ్చ పదలక్షణమ్. పదార్థసన్నియోగేన హి వ్యాకరణే పదానాం ప్రకృతి

---

* *Now, without this (Nirukta) the exact meaning of the Vedic Mantras is not properly understood and one who does not properly understand the meaning cannot conduct a thorough investigation of accent and grammatical form ; hence this Nirukta is the complement of grammar and a means of accomplishing one's own end.*

ప్రత్యయాదీని లక్షణాని వ్యాదిశ్యన్తే. యత ఏవ మతః 'అర్థ మప్రతియతో నాత్యన్తం స్వరసంస్కారోద్దేశః' అర్థ మప్రతియతః...అనవగతార్థస్య...నిశ్చయేన... స్వరావధారణం సంస్కారావధారణం చ నాస్తి... కిం కారణమ్ ? న హ్యనవధృతార్థః స్వరసంస్కారా వవధారయితుం శక్నుయాత్. అర్థవశేన హి స్వర సంస్కారా వ్యవతిష్ఠన్తే.†

'తదిదమ్'...నిరుక్తశాస్త్రం విద్యాస్థానం వేద దర్థనత్వా దర్థపరిజ్ఞానస్య. అర్థవశగతాచ్చ స్వర సంస్కారయో రిదం వ్యాకరణస్య 'కార్త్స్న్యం' కృత్స్నభావం కరోతి......వ్యాకరణేహి స్వర సంస్కారా చిన్త్యన్తే. తస్మా దపరిసమాప్త మేవ తావద్ వ్యాకరణం యావన్నిరుక్తం నాధిగత మితి. నహ్యనైరుక్తోఽర్థ మవధారయితు మలం నా నవధృతార్థః స్వరసంస్కారతత్త్వం విజానీయా దితి. అహ— నను వ్యాకరణస్య కార్త్స్న్య మేతత్ కరోతీ త్యుచ్యమానే తచ్ఛేషభూత మేవైత దణాదికల్, తతశ్చ విద్యాస్థానత్వ మస్య విరుధ్యతే—ఇతి. నేత్యుచ్యతే. 'స్వార్థసాధకం చ. స్వార్థాజహద్వృత్త్యా హ్యేత దనుషంగతో వ్యాకరణకృత్స్నతాం కరోతి, యథా లోకే స్వార్థ మపరిహాయ కశ్చిత్ పరానుగ్రహం కరోత్యేవమ్. యత్ పున రేతదుక్త మణాదివ దితి, తేహి తన్త్రాంతరాఖ్యాతా ఏవ. 'ఉణాదయో బహులమ్' ఇత్యుక్తం నపున ర్నిఘంటవో బహుల మితి."

స్కందస్వామియు ని ట్లన్నాడు: "ఇదం శాస్త్ర మన్తరేణ యస్య నామ్నో య దాఖ్యాతజత్వం తస్య తత్ప్రయోజనం నావసీయతే. అపి చేద మన్తరేణ మన్త్రే ష్వర్థప్రత్యయో౽ర్థావగమో న విద్యతే... అర్థం చాప్రతియతో౽నవగచ్ఛతో యో౽యం వ్యాకరణే స్వరసంస్కారయో రుద్దేశ ఉపదేశ ఏషో౽పి నాత్యంతం భవతి."

కావున నిరుక్తవ్యాకరణములు రెండును వేదాంగములును, పరస్పరసంబంధము కలవియు నని శాకటాయనవ్యాకరణములోవలె ఇతరవ్యాకరణములలో కూడ ఉణాదిసూత్రముల ద్వారమున గాని, ఊహన ద్వారమున గాని అన్ని నామములకును ప్రకృతిప్రత్యయ ముపదిష్ట మయ్యె నని యాస్కమహర్షి శాకటాయన మతమును సమర్థించినాడు.

† "స్వరసంస్కారాభ్యాం యుక్తః శబ్దః క్వచి దర్థే సాధుః క్వచి దసాధుః. యథా—అస్వ ఇతి నిర్ధనే సాధుః, నాశ్వే—"

అని స్కందస్వామివచనము.



# పరాజయం

శ్రీ బలివాడ కాంతారావు

పరుపుమీద వారబడి పుస్తకం విప్పినా కాంతకు నిద్దర రావటం లేదు. అప్పుడే పదకొండు కొట్టింది. దీపం ఆర్పేయాలనుకుంటూనే చిన్నక్క పరుపువేపు చూసింది. రాధ అగపడలేదు. అయినా దీపం ఆర్పి పరుపుమీద కూర్చుంది.....

పెళ్లిచూపులనాటినుంచి అక్కయ్య సంచరించే విధం చూస్తుంటే ఆమెకేదో అసూయ పుట్టుకొచ్చింది. ఇదివరలా కిలకిల నవ్వుతూ కబుర్లతో కరిగించి, నవ్వించకుండా యేకాంతంగా కూర్చొని యేకధాటిగా ఆలోచించుకోవటం కాంతకేమీ నచ్చలేదు. ఆశలు, కోరికలు సమాజంలో యింకొకరివి ఫలించటంతో మనిషిలో యివి రెచ్చగొట్టబడతాయ్. కాంతమనస్సులో అక్క పెళ్లిచూపులై గడచిన మూడువారాలలోనూ అంతూ పంతూ లేని ఆలోచనలు పరుగెత్తినయ్ అంటే ఆశ్చర్యపడవలసిన విషయం కాదు.

ఆమె లేచి గదిలో యిటూ అటూ చీకటిలో పచారుచేసినా ఆలోచనాప్రవాహాన్ని అరికట్టలేకపోయింది. ఎడబాటు ఒక్కసారిగా సహించటం ఆమెకు కష్టమైపోయింది. ఈ ఆలోచనలతోపాటు ఆమెదృష్టి కిటికీవేపు పోయింది. తలుపు చారవేసివుండబట్టి అక్క తోటలోనికే వెళ్లివుంటుం దనుకుంది. కాంత మల్లెపందిర నానుకొని విశాలాకాశంవేపు చూస్తోంది. మబ్బు విడిచిన చందమామ మెల్లగా కదులుతున్నాడు! ఆమె కోరికలను దాచిపెట్టిన అసూయ మెల్లమెల్లగా విడిచిపోతోంది!!

రాధ దగ్గరగా వచ్చి 'అక్కా యేమీ లేదు చెల్లీ' అంది. అక్క బొంగురుపోయిన గొంతుక విని కంగారు కప్పిపుచ్చుతూ 'ఏం అక్కా!' అంది.

'ఏంటలా దీర్ఘంగా...'

'చూడక్కా! ఎంత చల్లగా వుందో'

తడుముకోకుండా, రాధ, 'అలాంటిదల్లటి వెంటనే వస్తాడులే' అంటూనే గదిలోనికి వెళ్లిపోయింది. అక్కయ్య యీమాటలు అని ఆమెమనసులో సువ్యక్తం కాని యేవేవో ఆలోచనలను గిరగిర త్రిప్పివేసింది.

గదిలోనికి వచ్చిన కాంత అక్కమంచంమీద కూర్చుంది. 'పోయి పడుకోవే' అంది రాధ.

'పడుకుంటాను— కానీ, ఒక మాట..'

రాధ యేమాటా ఆడలేదు. కాంతకూడ ఆగిపోయింది. కొంతసేపయ్యాక 'చెప్పాలని లేదా?' అంది అక్క.

'ఈ వారంలోజులైనా నాతో సరిగ్గా మాటాడకూడదా? ఎంత అందగాడైనా యెప్పుడూ నీదగ్గర వుండవలసినవాడిగురించే ఆలోచించాలా?'

చెల్లెలు యెన్నాళ్ళనుంచో అడగాలనుకున్న ప్రశ్న యీవేళ అడిగింది. ఈ ప్రశ్న వేసి జవాబుకోసం నిరీక్షిస్తున్న కాంతకు కొద్ది నిముషాలకు చిరాకు వేసింది.

'ఈసంబంధం నాన్న కిష్టం లేదే' అంది పెద్ద నిట్టూర్పుతో రాధ.

ఈమాటల్లో వ్యక్తమౌతున్న బాధను కాంత కొంతవరకు గ్రహించినా అక్క యేదో నిజాన్ని కప్పి పుచ్చటానికి యీమాటలను అందేమో అనుకుంది. కాని, నాన్నగురించి అక్కయ్య అలా అందంటే ఆమెకు చాలా విడ్డూరంగా కనిపించింది.

'శుద్ధఅబద్ధం అక్కా!' అంది.

'నా చెవుల్నే నమ్మవద్దంటావా?'

'నాన్న అనటమే విన్నావా? అయినా నాన్న యెవరితో యెప్పుడు చెప్పారని?'

'సుందరంతో... మొన్న నే'

'ఏంటో, నాన్న అన్నారంటే నమ్మలేనే.... నువ్వు సరిగ్గా విన్నావా?'

'గాలి లేదని డాబామీదకు వెళ్లానే. ఆయనతో చెప్తుంటే విన్నాను'

'చెప్పినా చెప్తారులే! ప్రక్కనే మంచం వేసి పడుకో బెట్టుకుంటున్నారుగా! ఈ యింటికి యజమానిని చేసేస్తారేమో!'

కోపంగా అంటున్న చెల్లెలివేపు ఒకసారి చీకటిలోనే చూసింది. తరవాత రాధ చేతితో నుదురు కప్పుకుంది.

'ఇంకేం మాటాడకున్నా రక్కా?'

'పోయి పడుకో చెల్లీ...తలనొప్పిగా వుంది!'

'అబ్బా! దానికే అంత భయపడాలా! నాన్నకు ఆలోచనా పాలోచనా లేదు!!'

రాధ చిరాకుతో లేచి వెళ్లిపోతున్న చెల్లెల్ని కిటికీగుండా వచ్చే కాంతిలో చూస్తూ హీనస్వరంతో ఆగిఆగి 'నాన్న యీలోకంలో మనుషుల్ని అరవై యేళ్లు చూసారే!'

ఈమాటలు వినవస్తే కాంత పరుపుమీద వ్రాలింది!!

౨

తెల్లవారింది. సుందరం కొళాయిదగ్గర స్నానంచేసి మేడమొదటిమెట్టుమీద కాలువేసి ఆగి అలా వస్తున్న కాంతవేపు చూశాడు. ఈ చూపులో అంతర్యాన్ని గ్రహించిన కాంత ముఖంముడుచుకొని చరచరా మళ్లీ గదిలోనికి వెళిపోయింది. వచ్చిన యీ మూడురోజులలోనూ తనవేపు చూడని సుందరం యీరోజు దీక్షగా యెందుకు చూడాలి? ఇటూ అటూ గదిలోనే గిరగిరలాడింది. పరుపుమీద మళ్లీ వారబడి ఆవలించింది.

సుందరంగురించి ఆలోచించటానికి తీరిక లేక పోయింది. అమ్మ అప్పుడే స్టేషనుకు పోడానికి తయారైంది. కాంతలేచి స్నానంచేసి అలంకరించుకొనే సమయానికి ఒక స్వచ్ఛమైన గొంతుక మేడమీద గీతా పారాయణం చెయ్యటం వింటూనేవుంది. ఆగొంతుక సుందరంకే అని పోల్చుకుంది.

అమ్మతో కలసి మేడమీదకు వెళ్లేటప్పుడు డాక్టరుగారు బట్టలు వేసుకుంటూ దగ్గర కుర్చీమీద కూర్చున్న సుందరంతో అంటున్నారు. "ఈ జన్మలో యేం సుఖపడ్డానో చిన్నప్పుడు అమ్మవల్ల...గడించుకొనే రోజుల్లో పెద్దకూతురువల్ల..."

వరసమ్మ, కాంత అలా నిలుచునే వున్నారు. డాక్టరుగారు ముఖం ముడుచుకున్న భార్యవేపు చూడకుండానే మళ్లీ మొదలుపెట్టారు:

"ఫస్టు గ్రేట్‌వార్‌లో ఫ్లెండర్సులో ఒకరాత్రి ఒక సైనికుడి గాయానికి కట్టుకడుతూ అలా పడిపోయాను. అమ్మా అని అరిచానని, నాకు తెలివి వచ్చాక, యింకో డాక్టరు చెప్పాడు. గాయంతగిలిన సైనికుడు నన్ను బాధతోనే అడిగాడు— 'డాక్టరుగారూ! మాఅమ్మకు నే నొక్కడనే... చాలా కష్టపడి పెంచింది... వద్దంటే సైన్యంలోనికి వచ్చాను... బ్రతికి మా అమ్మను మళ్లీ చూస్తానా?' అని. ఈమాటలు చచ్చిపోయేముందు అంటున్నాడేమో మా అమ్మ జ్ఞాపకంవచ్చింది. నేనూ ఆసైనికుడిలానే చేశాను... నాకూ గాయం తగులుతుంది... నేనూ మాఅమ్మను చూడకుండా యిలాగే చచ్చిపోతాను!! కాని... ఇన్ని గండాలు గడిచి వచ్చానురా బాబూ! ఇన్ని ఆసుపత్రులు చూశాను... రిటైరయ్యాక డిస్పెన్సరీ పెట్టాను... అరవై యేళ్లు దగ్గరపడ్డాయా...?"

చెవు లప్పచెప్పి తలెత్తి ప్రశాంతంగా సుందరం వింటున్నాడు.

"ఎందు కింత బలంగా వున్నాను? మా అమ్మ నించే. ఏం చేసే దంటావ్? కులంవాళ్ల యిళ్లల్లో ప్రొద్దున్నుంచీ సాయంత్రంవరకూ ధాన్యం దంచో, అంట్లు తోమో సేవ చేసేది. మెత్తని తవుడు రొట్టె చేసి వుంచేది. నేను పట్నంలో బడి విడిచిపెట్టాక ప్రయివేట్లు చెప్పుకొని నాలుగుమైళ్లు నడిచి యింటికి వెళ్ళేసరికి ఆరొట్టె యిచ్చేది. తిని మంచినీరు త్రాగే సరికి అమ్మకళ్లు నీటితో నిండిపోయేవి. అంబలీ గంజీ త్రాగి నలుగురికాళ్లూ పట్టుకొని చదివించింది. నాకొడుకు గడించుకొనేటప్పుడు మీ ఋణం తీర్చు కుంటా ననేది. నేను గడించుకొనేరోజుల్లో ఒకనాడు మాఅమ్మ దగ్గర కూర్చొని 'ఆచిన్నా పెద్దల భూములన్నీ కొనేశా' నని చెప్పేరోజున రెండు చేతులూ చూసు కొని బావురుమని యేడ్చింది. 'ఈచేతులతో నే ఆ పొలా లిచ్చిన తవుడురొట్టెలు చేసి యిచ్చాను, ఇప్పుడు అదియావత్తునీ ఈచేతులతో వండివ్వలేను నాయనా' అంది."

డాక్టరుగారి స్వరం కొంత మందగించింది.

"నా కివ్వవలసిందంతా ప్రేమతో చిన్నప్పుడే యిచ్చింది. అతవుడురొట్టెలలో విటమిన్లే నా నరాలన్నీ పటుత్వంగా వుంచి యీనాటికీ యెలాంటి అపరేష నైనా యేమాత్రం అనిపిస్తోంది!"

డాక్టరుగారి మాటలఫక్కీలో గోచరిస్తున్న పరిపూర్ణహృదయంగూర్చి ఆలోచిస్తూనే సుందరం వింటున్నాడు.

"అమ్మ చనిపోయాక పెద్దమ్మాయి ఆలోటు తీర్చింది. చూడు, తెల్లవారేసరికి యెందరు బాధతో కాచుక్కూర్చుంటారు! నేను లేచేసరికి పూజగదిలో అంతా అమర్చేది. వంటమనిషిని లేపకుండానే అమ్మాయే నీరు మరగపెట్టేది. టిఫిన్, కాఫీ తెచ్చి దగ్గర కూర్చొని తినేటట్లు చేసేది. ఇంత డబ్బు తెచ్చేవాడినా, ఇంకో కూతురైతే నెలనెలా వందలు కూడబెట్టుకొనేది. ఏరోజు కారోజు లెఖ్ఖలు చూపిస్తూ వారానికి ఒక్కసారి 'నాన్నా! నాకై రూపాయలు కావా' లనేది. 'తీసుకో అమ్మా' అ. నాడ్ని. 'నీచేతులతో యివ్వాలి నాన్నా' అనేది ఆడబ్బుగురించి నే నెప్పుడూ ఆలోచించలేదు. కాని యిచ్చేటప్పుడు యింత తక్కువా అనిపించేది. తరవాత నాకు తెలిసింది నాతల్లి నాపేరు చెప్పి బీదవాళ్లకు ధర్మం చేసేదట!"

డాక్టరుగారు కళ్లొకసారి నలుపుకున్నాడు. సుందరంశరీరం ఒక్కసారి గగుర్పాటుచెందింది. కుర్చీ మీద సర్దుకొని మళ్లీ మొదలుపెట్టారు.

"ఒరే బాబూ! అమ్మాయిపెళ్లి చెయ్యటమంటే నాగుండె కదలిపోయేది. కాని, ఆడవాళ్లప్రేమకు హద్దులంటూ వుండవు. నాతల్లి యొక్క కున్నా నాతల్లే—అన్నింకా హెచ్చుగా మాసుకుంటుంది. మాఅమ్మ కష్టకాలంలో కడుపు మాడ్చుకుంది. నేను గడించుకున్న రోజుల్లో యెవరికైనా చిరాకుగా యేమైనా అంటే అప్పుడూ వస్తుంది కడుపు మాడ్చు కొనేది. ఎప్పుడైనా ఒకసామెత చెప్తుండేది. 'పెద్ద చెట్టుకన్నా వంగిన తుంగదుబ్బే గెలిచిందిరా!' అని. అమ్మాయిపెళ్లినాటికి అమ్మ లేకపోయినా అమ్మ సామెతమాత్రం నే బ్రతికినంతకాలం మరచిపోలేను"

డాక్టరుగారు ఆగారు. తల్లీ కూతురూ దేనికో ఆశ్రుతపడ్తున్నారు. డాక్టరుగారు నాలుకుర్చీమీద చారబడి మళ్లీ మాటలు పొడిగించారు.

"లక్షలు గడించాను. వేలు ఖర్చుపెట్టాను. కాని మర్యాదను గడించలేదు. మాఅమ్మ గడించి నా కిచ్చింది. ఎవరింట్లో మాఅమ్మ తవుడు తెచ్చి గంజి త్రాగిందో వాళ్లగురించి చనిపోయేముందు చెప్పింది. 'వాళ్ల భూములు కొన్నావు. కాని వాళ్లవల్ల నే నివ్వింతవాడి వయ్యావు. వాళ్ల నొకకంట చూడు బాబూ!' అంది. ఒకసారి ఆవూరు అమ్మవున్నరోజుల్లో నే వెళ్లేటప్పుడు వాళ్లింటిలో ఒక కుర్రాడ్ని చూశాను. అప్పటికి ఎని మిదవతరగతి చదువుకున్నాడు. ప్రతిసంవత్సరం ఫస్టుగా పాసవుతున్నాడట! చదివించటానికి శక్తిలేకపో వటంవల్ల ఆసంవత్సరంతో మానిపించేస్తా మన్నారు.

'సరే, నేను నెలనెలా డబ్బు పంపిస్తాను. కుర్రాణ్ణి పాడుచెయ్యొ'ద్దన్నాను. ఆకుర్రాడు యింటర్‌మీడియేట్‌కి వచ్చేవరకూ నేను చూడలేదు.

"పొలాలు చూట్టానికి వెళ్ళేసరికి 'కుర్రాడు కలవుల్లో వచ్చాడు. ఎక్కడో గుమస్తాగా వేస్తే నాలుగు రాళ్లు సంపాదించుకుంటాడు. చదువు మానిపించేస్తా'మన్నారు. కాని ఆకుర్రాణ్ణి చూశాక నా కేదో ఆశ కలిగింది. ప్రతిస వత్సరం ఫస్టుగా పాసవుతున్నాడు! వచ్చేయుండు అన్నాను. 'మీరు మా దగ్గరవాళ్లే. మానాన్న చచ్చిపోతే మీయింట్లోనే పాలిచ్చి నన్ను పెంచారట! సత్యంకు మా పెద్దమ్మాయిని యివ్వాలని వుంది. మీరువొప్పుకోవా'లన్నాను. 'మీతోసంబంధం చెయ్యటానికి తాహతు చాలదు బాబూ!' అన్నారు. 'తాహతు లెత్తితే మీయింట్లో యిలాగే వుండిపోతాను. మీదగ్గర నేర్చుకోవలసిన మర్యాద యెంతైనా వుంది. మనిషి తాహతు చెప్పేది మర్యాదకాని, డబ్బు కాదు' ఇలా అనేసరికి ఆయన వొప్పుకున్నారు. ఆపిల్లడికి సంబంధం స్థిరం చేసుకొచ్చానంటే 'నాకూతుర్ని కడుపుకు గంజినీరు లేనింట్లో పారేస్తారా!' అని తల బాదుకొని యేడ్చింది...ఇదిగో ఇక్కడే వుంది. కావలిసివస్తే అడుగు. వారంరోజులు నాతో మాటలుకూడ మానేసింది! నిరుడు కేన్సరైతే మద్రాసు తీసుకవెళ్లి మూడు నెలలు సెలవుపెట్టి సేవచేసి యే అల్లుడు బ్రతికించాడు? ఏపండక్కయినా నేను పిలవాలని లేదు. ఇంట్లో వాడిలా బుద్ధిపుట్టేటప్పుడు వస్తాడు. చూసిపోతుంటాడు. నా కీ దివ్వలేదని ఆ దివ్వలేదని అడుగుతాడా? అదీ లేదు. నవ్వులబండి. పెద్ద యింజనీరా! ఇప్పటికీ నా యెదురుగా సిగరెట్ కాల్చడు! ఏమడులూ మాన్యాలు చూసి ఆసంబంధం చేశాను!! మడులూ మాన్యాలూ వున్నా మర్యాద లేనివాళ్ళకు పిల్లనిస్తే మన కెంత అప్రతిష్ఠ! మొన్న రెండో అల్లుడు యేంచేశాడు! పెళ్లినాడు నే నిచ్చిన వాచీకి రిపేరు వచ్చిందని బాగుచేసి పంపించమని పోష్టులో పంపించాడు!!

"నా కిష్టం లేదనమ్మా అని, యిదే కాదు తీర్ల చుట్టాల సందర్నీ తెప్పించి మరీ చేర్పించింది కూతురికి. కాని నాతల్లి 'నాన్న యిష్టపడితే నాకూయిష్టమే' అంది. బాబూ! అమ్మాయి తనచేతులతోనే డబ్బు పంపించి మొగుణ్ని చదివించింది! చల్లనిచేయి కాబట్టి మొగుడు యింజనీర్‌గా కూర్చున్నాడు! దాని కేం లోటిప్పుడు? ఇప్పటికీ యేమైనా వస్తే నాన్నసలహా తీసుకోనిది యేమీ చెయ్యదు. అదే మొన్న పెద్దకూతురు పెళ్లి చేసేటప్పుడు పెద్దసంబంధాలొస్తే మానాన్న యిష్టమంది. నేను వాడు దగ్గరవాళ్ళే— కాస్త చితికిపోయారనుకో— చదువుకుంటున్నవాళ్ల కుర్రాణ్ణి తెచ్చి పెళ్లి చేసి పెద్దవాణ్ణి చేసుకో అన్నాను. ఆపెళ్లికి మిగతావాళ్లందరికీ కోపం వచ్చింది. నామీద అలక సాగించారు. రోగి అలిగాడంటే నా పంచప్రాణాలూ పోతాయిగానీ, ఇలాంటివాళ్ళెందరు అలకసాగించినా నేను నేనేలే. అల్లుడు మనగుండెల్లో మేకవటానికి కాదు. మన కష్టసుఖాలు మనవాడైనందుకు పంచుకుంటా డనేగా చేసుకుంటాం! ఏదో వున్నవాళ్లు పేదవాళ్ళని పైకెత్తకపోతే జాతికే కళంకంకాదూరా?"

ఆగదిలోనికి పెద్దపెద్ద ఆఫీసర్లు, పేరుప్రతిష్ఠలుగల బంధువులూ, స్నేహితులు వచ్చారు. ఆపేముకుర్చీమీద పందలకొద్దీ కూర్చున్నారు. కాని, ఒక్కసుందరంకు తప్పించి యింకెవరికీ అలాంటి మాటలు వినే భాగ్యం కలగలేదు.

'రైలు యీపాటికి వచ్చేస్తుందేమో!' అంది చిన్నకూతురు శాంత.

'అయితే?' అన్నారు డాక్టరుగారు ప్రక్కకు తిరిగి.

'మాతమ్ముడు వస్తున్నా డని మరిచిపోయారా?' అంది వరసమ్మ.

'ఆ దంత జ్ఞాపకం వుంచుకోవలసిన విషయం కాదే!'

'ఎందుకుంటుంది? మాతమ్ముడికి మీ గొళ్లి కలుసుకోకపోతే పోయే దేమీ లేదుకాని... వాడికేం...?'

'సరి! ఇంకా యింటికి రానివాడికి మర్యాద చెయ్యటానికి మీరంతా యెదురెళ్తున్నారు. ఇంట్లో వున్నవాళ్ళకి మర్యాద చెయ్యనందుకు తల్లీపిల్లలకు

పిన్నపుట్టినం లేదూ? చూస్తున్నాగా... బలవంతాన యింట్లో వుండరా బాబూ అని తెచ్చిపెడితే వేళకు కాఫీభోజనం పెడుతున్నారా? వంటమనిషి పెడితేవుంది లేకపోతే లేదు!'

'బాబూ' అన్నాడు సుందరం- కొంత వుద్రిక్తంగా వచ్చే డాక్టరుగారి మాటలకు అడ్డుగా— 'ఈ యింటిలో మర్యాద లేదని యెవరన్నారు?'

'సరే! నివ్వేలా తీసుకోకపోవచ్చు. నీ జాతి వేరు. నిన్ను చూసి పిల్ల తెచ్చుకోవాలి. ఆ పిల్ల లున్నారే, ప్రొద్దెక్కేదాకా లేవరు. లేచినా ఒక పూజా, పురస్కారమా? యేమీ లేదు. పెద్దమ్మాయి వెనక పుట్టినందుకు కొంతలో కొంతైనా ఆ గుణాలు అబ్బాయి కావు!'

మాటాడకుండా వరసమ్మ, శాంతా అక్కడనించి వెళ్లిపోయారు. కొంతసేపు డాక్టరుగారు మాటాడలేదు. సుందరం కాలిబొటనవ్రేలు నేలకు నొక్కుతూ తల దించి చూస్తున్నాడు.

'ఈవచ్చేవాడు డెప్యూటీకలెక్టరోయ్! మూడో అమ్మాయికి యీయన నే సంబంధం తీసుకొచ్చి ఐదువేలు కట్నం యిప్పించాడు. ఒరే బాబూ! మనుషుల రోగాలు కుదిర్చేవాణ్ని నన్ను రోగిష్ఠిని చేద్దామని వీళ్ళందరి ప్రయత్నం. ఆ ఐదువేలూ తప్పించి ఒక దమ్మిడీ ముట్టచెప్పలేదు. నిర్మొహమాటంగా వాళ్లే కట్నం పిండకపోతే వామనమూర్తిగా పదివేలిచ్చేవాడిని...సరే యెవరి అదృష్టానికి యెవరు కర్తలు? ఈ డెప్యూటీకలెక్టరు యీజన్మలో డెప్యూటీకలెక్టరవుతాననుకున్నాడా? అప్పటిలో వాడిలో వున్న వినయం లేశమంత వుంటే యెంత బావుండేది? మనిషి సింహాసనం యెక్కినా పాతరోజులు మరచిపోకపోతే మనిషి మనిషనిపించుకుంటాడు అక్కడ జబ్బుచేస్తే వెళ్లి బాగుచేశాను. ఆపరిచయంమీద గుమస్తాగా మగ్గుతున్నవాడిని పైకెత్తించాను...చేసిన మేలు చెప్పుకో కూడదు కాని, వీళ్లంతా యెక్కడో సుఖంగా వుండటమే నాక్కావాలి...!' జేబుగడియారం చూస్తూ లేచిపోయారు.

## 3

డాక్టరుగారు నాలుగోకూతురిపెళ్లిలో కూడా వచ్చిన చుట్టపక్కాలు, విన్నవారుకూడా ఆశ్చర్యపడేటట్లు చేశారు.

పెద్దకూతురిపెళ్లి చేసేటప్పుడు రెండువేపుల ఖర్చులూ భరించి బ్రహ్మాండంగా చేశారు. రెండో అమ్మాయిపెళ్లికి మగపెళ్లివారు మర్యాదలు జరగలేదని అలకసాగిస్తే బ్రష్ పట్టుకొని విడిదికి వెళ్లి మొదట వియ్యంకునిబూట్లు బ్రష్ చెయ్యటం మొదలెట్టారు. జరిగిన కోలాహలమంతా చూడనట్టే చివరకు 'బావగారూ, మీరంతా ఆఫీసర్లు! బంట్రోతులచే బూట్లు కూడా తుడిపిస్తే గాని మీకు తృప్తివుండదు...కార్యం చేసేవాడూ బంట్రోతే కదా! ఇంకా యేం చెయ్యాలో సెలవియ్యండి' అన్నారు.

మూడోఅమ్మాయిపెళ్లికి ఐదువేలు కట్నం అని నిర్మొహమాటంగా అడగటంతో ఆ అయిదువేలూ తప్పించి ఒక్కదమ్మిడీ హెచ్చు యివ్వలేదు. అల్లుడికి మోటరుసైకిలు కావాలంటే ఆ అయిదువేలలోనే కొనుక్కోమని చెప్పారు. వాచీ అంటే 'నీజీతంలో ఒక నెల బేంకులో వెయ్యకుండా కొనుక్కో బాబూ!' అన్నారు. అడగని పెళ్లికొడుక్కు చెప్పి అడిగినవారి ముఖాలు ముడుచుకో నిచ్చారు.

ఇప్పుడు నాలుగోఅమ్మాయిపెళ్లికి పెద్ద గలాటా జరిగింది. డబ్బు ఖర్చుపెట్టారు. కాని, పెద్దరికం సుందరం కిచ్చారు. పెళ్లికుమారుడికి కట్నాలూ కానుకలూ వర్షిస్తుంటే యింత పేరుప్రతిష్ఠలున్న డాక్టరుగారు పిల్ల యెదురుగా వుంచిన పళ్లెరాన్ని బోర్లించి నిల్చొని 'మీరంతా వచ్చి నన్నానందింపజేసినందుకు కృతజ్ఞుణ్ని...' అంటూ చేతు లెత్తారు.

రాధతో అత్తవారింటికి పెద్దమ్మాయీ, ఆమె భర్తా వెళ్లారు.

ముడుతలు దిగని పంచెతో మీసాలు పండిన పెద్దవియ్యంకునితో ఆరాత్రి భోజనానికి కూర్చుని యేవేవో కుటుంబవిషయాలు మాట్లాడుకుంటున్నారు.

పెళ్ళై నాలుగురోజులైనా ఆగొడవ లింకా సుందరం మీద పడివుండటంచేత యింకా భోజనానికి రాలేదు. ఈవేళ శాంత వడ్డనకు వచ్చింది. అన్నంకలుపుతూ 'మీ అమ్మను ఒకసారి పిలమ్మా' అన్నారు.

శాంత వెళ్లింది.

"అయితే, బావగారూ! అల్లుడు అమ్మాయిని పంపించకపోయినా, వ్రాసిన వుత్తరాలకు జబాబులైనా యిస్తాడా?" మధ్యను ఆపిన విషయాన్ని మళ్లీ లేవనెత్తారు.

"అదీ లేదండి బావగారూ! ఏం అదృష్టమో! లక్ష్మీదేవిలాంటి కోడలున్నందుకు......"

"పోనీ మీమీద కోపమైనా...భార్యాభర్తలు పొత్తుగా వుంటారా?"

"దానికేం లోటు లేదండి! ఆడపిల్లకదూ— మాఅందరినీ చూడాలని వుంటుంది. మీచెల్లెలుకు మాత్రం విచారం లేదు. ఎక్కడో సుఖంగా దానిబ్రతుకది బ్రతికితే చాలంటుంది"

"మీ చెల్లెలుకు యేడుపు యిట్టే వచ్చేస్తుంది—"

ఈమాటలు అప్పుడే వస్తున్న నరసమ్మచెవిలో స్పష్టంగా పడ్డాయ్.

"నే నెవరిగురించి యేడవాలన్నయ్యా? ఏం కొడుకులు పోయారని. నలుగురూ ఆయనమీద విరుచుకపడితే యేడవనూ?"

పెద్దవియ్యంకు డేమీ మాటాడకముందే "వారెదురుగా రేం అనలేదే? ఏం అన్నా రేమిటి?"

"ఏం అంటారు బావగారూ? వాళ్లకు తోచిన అభిప్రాయాలు యిచ్చుంటారు" అందుకున్నాడు వియ్యంకుడు.

"బావగారూ! ఈఅభిప్రాయా లివ్వటం ప్రతివాడికీ ఒకజబ్బయిపోయింది. మనిషితో మాటాడకండా అభిప్రాయా లిచ్చేస్తారు! చూశారూ...అర్థంలేకండా ఊతపదాలు వాడి మాటాడితే ఎంత అసహ్యంగా వుంటుందో,... అర్థంలేకుండా అభిప్రాయాలు యిస్తే మనబ్రతుకూ అంత అసహ్యం అయిపోతుంది....లో టేమైనా వుంటే యెదురుగా అనాలి గాని—ఇదిచ్చారుకాదు అదిచ్చారుకాదని..."

"వాళ్లు అంటే అన్నారు. అయినా వాళ్ల హోదాకి తగ్గట్లు మనం యేం యిచ్చాం—యేం చేశాం?"

నరసమ్మ అందుకుంది—

"ఇంకేం యివ్వాలి? వాళ్లబ్బాయిని చేసుకున్నంతమాత్రాన వాళ్ల కాళ్లు పట్టాలని లేదే!"

"ఆడపిల్ల నిచ్చుకొనేవాళ్లు యిలానే అనుకుంటారు!!"

"మ రెలా అనుకోవాలి! చేసింది చాలు. వందలు ఖర్చుపెట్టినా వాళ్ళను సంతోషపెట్టలేం! ఈఅన్నం పెట్టకపోయినా యీ బావగారు నవ్వుకూనే యీయింట్లో తిరుగుతారు. సరే! మీతమ్ముడింకేం చెప్పాడు?"

నరసమ్మ యేమీ సమాధానం యియ్యకుండా గుమ్మాన్నానుకొని అలానే నిలుచునుంది.

"పుచ్చిటప్పాలు కొట్టుకొని, పేకాటలు వేసుకొని తిండవా లాడారుగానీ, యేమైనా సహాయం చేశారా వీళ్ళంతా?"

"ఎవర్ని చెయ్యమని అడిగారని?"

"అడిగితే యెవరైనా చేస్తారు. ఇది వాది అని కలుగజేసుకొని సుందరంతప్పించి యింకెవరైనా చేశారా?"

"ఈకాలానికి వాడో దగ్గరివాడు దొరికాడు!"

"అవునే. దగ్గరివాడేనే!" బావగారివేపు ముఖం త్రిప్పి "అదేం ఖర్మమోగాని, మనిషివిలువ డబ్బుమీనే కట్టుందండి! ఆసుందరంతల్లిని తలచుకుంటుంటే మాఅమ్మ జ్ఞాపకం వస్తుంటుంది. నాలానే కష్టపడి చదివాడు. స్కూలుఫైనలుతో మానేస్తా నన్నాడు. బి. ఏ. పూర్తికానీరా అన్నాను. ఇంటర్ పూర్తిచేసి పెళ్లియీడుకొచ్చే చెల్లెలుందని వుద్యోగంలో ప్రవేశించాడు. రెండేళ్ళయింది. మొన్ననే చెల్లెలిపెళ్లి

కూడా చేశాడు. వాడు గొప్పవాడంటారా? లేక పెద్ద వాళ్లు చదివించి, పెళ్లిచేసి వుద్యోగంలో వెయ్యించాక కబుర్లుచెప్పే వీళ్ళంతా గొప్పవాళ్ళంటారా? బదిలీ మీద యీవూరు వస్తే బలవంతాన యింట్లో తెచ్చి పెట్టినందుకు నాపరువు యేం నిలబెట్టారు?"

ఈమాటలన్నీ వినవస్తే నరసమ్మ "నన్నెందుకు పిలిపించా" రంది.

"ఈయింటియిల్లాలి వని..."

డాక్టరుగారి యీమాటల ధోరణి విస్మయంపడితే కాదు, శాంతనూ, వంటమనిషినీకూడా ఆశ్చర్యపరిచేలను చేసింది!

"కాళ్ళు పట్టుకుంటే తన్నేవాళ్లకోసం యెందుకు ప్రాకులాడతావు? పిల్లలమీద నీ కెంత అభిమానమో నాకూ అంతే వుంది. నివ్వేడ్చి వాళ్ళని చేతకానివాళ్లని చెయ్యక— ఈ బావగారిలాంటి వాళ్ళని కష్టపెట్టడం నా కిష్టంలేదు. అందుకే పిలిపించాను... ఇక వెళ్లొచ్చు!"

ఈమాటలు రాల్చటంలో వుద్రేకపుచిహ్నాలు కొద్దిగా అగపడ్డాయ్. నరసమ్మ కొంతసేపటికిగాని మాటాడలేకపోయింది.

"ఇదంతా యెవరికి? మీరు చెప్పకపోతే నా కింకెవరు చెప్తారు? మీకంటే నా కింకె దేవు డున్నాడు?" అంటూనే నరసమ్మ భోజనాలగదిలోనికి వచ్చింది. ఆమొగెంతుక చాలాదీనత్వాన్ని సూచిస్తోంది.

"నాదగ్గరే మీకు దాపరికమా? ఈసంబంధం నా కిష్టంలే దనిఅంటే నేం కాదంటావా? నాకంటే సుందరం మీకు ఆప్తబంధువా? నాకూతురు యేడుస్తూనే అత్తవారింటికి వెళ్లింది! మీరు వాళ్ళకి మర్యాద చెయ్యలే దనా? లేక మీకు అభిమానం లేదనా? చెప్పండి. నన్ను మీరు యింటియిల్లాలుగానే చూస్తున్నారా?"

ఎదురుగా కళ్ళల్లో నీరుతో నిలుచున్న భార్య వేపు చూసి—"ఇందులో నాజోక్యం యేం వుంది! నీతమ్ముడూ నివ్వూ కలిసేగా చేసింది..."

"నాతమ్ముడు! వాడు హెచ్చా, మీరు హెచ్చా నాకు? ఏనా వా డెవరివల్ల అంతవా డయ్యాడు! మీరు కల్పిత్తి చూస్తే వా డెక్కడుంటాడు! ఏదో గొప్పసంబంధం వుందంటే చూస్తాం అన్నానుగానీ, మీతో చెప్పకుండా చేస్తానా? ఆమాత్రం చెయ్యటానికే నాకు అధికారం లేదా? మొన్న పెళ్లిలో కానుక లేవీ పుచ్చుకోవద్దని చెప్పి పంతంనెగ్గించుకున్న సుందరంపాటైనా చేశాను కానా?"

"చేశావు కావు" అంటూనే పీటమీదనుంచి లేస్తూ "ఈవేళలా యిదివరకు మాటాడి వుంటే ఒకరితో పోల్చుకొనే అవస్థ నీకు పట్టేది కాదు. ఇక మీదనైనా నీమొగుడు అంబలిజాగ్రేవా డని జ్ఞాపకం వుంచుకొని వచ్చే చుట్టాలకు మర్యాదచేస్తే యీయింటి యిల్లాలి వౌతావు."

ఈమాటలు పూర్తికాకుండానే సుందరం భోజనానికి వచ్చాడు. "ఒరే బాబూ! భోంచేసినవెంటనే పడుకుంటావు. అది చాలా చెడ్డ అలవాటు." సుందరం చిన్న నవ్వు నవ్వాడు.

నరసమ్మ అక్కడనుంచి వెళిపోయింది. డాక్టరుగారు మెల్లకక్కుతూ బిగ్గరగా అంటున్నాడు— "ఈకాలంకుర్రవాళ్లకి ఆరోగ్యానికి సంబంధించిన చిన్న విషయాలు తెలియకపోవటంచేత పెద్ద జబ్బులు తెచ్చుకుంటా రండీ బావగారూ!"

సుందరం పీటమీద కూర్చొనే చెవులు రిక్కించి వింటున్నాడు. వడ్డించిన శాంత గోడ నానుకొని నిలుచుంది. మామూలుధోరణిలో తల దించుకొనే భోజనానికి మొదలుపెట్టాడు.

శాంత నాలికచివరవరకు వచ్చిన మాటలను అపుకుంది. కాని ఆవిషయాన్ని స్పష్టంచేసుకోవాలనే వుబలాటంమాత్రం పోలేదు. నరసమ్మ వంటమనిషితో కలిసి కళ్లు నులుపుకుంటూ భోజనానికి రావటంతో శాంత అక్కడనుంచి కదిలింది.

౪

ఏప్రెల్ నెల యెండమాపు చల్లారింది. ఆ సాయంసమయాన ఆగిఆగి వీచే గాలుల తాకిడికి

మెల్లగా కదిలే పూలమొక్కలమధ్య కుర్చీ వేసుకొని కూలబడ్డాడు. అప్పుడే ఆకాశాన నడినెత్తిమీద యిటూఅటూ కదిలే పొడి మేఘాలమల్లే సుందరంతలలో ఆలోచనలు పరుగులెత్తుతున్నాయ్!

హృద్యమైన ఆప్రదేశంలో, ఏవో తియ్యని కోరికలను ప్రేరేపించే కమ్మని వాతావరణంలో యీ యెడతెగని ఆలోచనలకు హద్దులేకుండా పోయింది...నడినెత్తినవున్న మబ్బులు మెల్లగా కదిలి పోతున్నాయ్! వెన్నెల ప్రకృతికి ఒక శోభాయమాన మైన అలంకారంవలె ప్రకాశించి వన్నె తెచ్చింది. సుందరం మనసులో తిరిగే ఆలోచనలవల్ల పొందే అను భూతివలన ఒక్కొకసారి శరీరం గగుర్పాటు చెందు తోంది— ఈప్రపంచంలో ఒక నిరుపేదకు, ఒక లక్షా ధికారికి యేమిటి సంబంధం?... చివరకు యీసరి పోల్చుకోవడాలు విడ్డూరంగా అగపడ్డాయ్. ధనకనక వస్తువాహనాలతో నిమిత్తం లేకుండా అందరియందు మనోవాక్కాయకర్మలతో అభిమానాన్ని చూపిం చటం గొప్పవాళ్ల లక్షణం. తను చదువుకున్న బడిలో తనొక్కడే డాక్టరుగారివలన సహాయం పొందేవాడను కొనేవాడు. కాని ఐదవ తేదీకల్లా తనకు వచ్చినట్లే మరొక ఐదుగురికి డాక్టరుగారిదగ్గరనుంచి మనీ యార్డర్లు వచ్చేవని కొన్నాళ్లకుగాని తెలిసింది కాదు. దానం, ధర్మం లోకంకళ్లు కప్పడానికి చేశాడంటే అదీ లేదు. తను ఆర్థికంగా సహాయంచేస్తున్నానని యెవరితో నైనా చాటుకతిరిగితే ఆనాడే తనకు ద్రోహం చేస్తు న్నట్లు భావించమని అన్నాకే యీడబ్బు పంపించే వాడు......

ఈఆలోచనాప్రవాహం శాంత అప్పుడే యెక్కడ నుంచో రావటంవల్ల అరికట్టబడింది. శాంత సరాసరి చరచరా యింటిలోనికి వెళిపోయింది. సుందరం లేచి నిలుచున్నాడు. ఒకసారి యిటూఅటూ అక్కడే పచారుచేశాడు. వరసమ్మ యింకా రాలేదు. అప్ప టికి యింటిలో శాంతా, వంటయింటిలో వంటమనిషీ తప్పించి యింకెవరూ లేరు.

సుందరం శాంతిగదిగుమ్మం దగ్గర నిలుచున్నాడు. ఆమె అద్దంలో ముఖం చూసుకుంటోంది. సుందరం చూపుడువ్రేలితో తలుపుతట్టి చిన్నచప్పుడు చేశాడు. శాంత గుమ్మంవేపు చూసింది. ఆమెవేపు చూడకుం డానే, 'ఒకసారి యిలా వస్తారా?' అన్నాడు.

"ఎందుకూ?"

"మీతో ఒక విషయం చెప్పాలి." జంకూ గొంకూ లేనట్లుగా చెప్పాడు.

"ఏం టావిషయం!" కాస్త చిరాకును వ్యక్త పరిచే కంఠస్వరంతో అంటూనే గుమ్మంవేపు వచ్చింది.

"ఏమీ లేదు! ఈవిషయం కాస్త ఆలస్యంగా చెప్తున్నాను. అయినా ఫరవాలేదు. ఎవరైనే యీయింట్లో వుండమని బలవంతంచేశారో వారు పొమ్మనేవరకూ కదలను."

"ఓహో! బలవంతం!!"

"మీకు అనవసరంగా బాధపడవద్దని..."

"అయితే మా అమ్మకూ చెప్పు..."

ఆమెమాటలకు హఠాత్తుగా అడ్డొచ్చి "ఆమెతో యీమాటలే చెప్పఖ్ఖర్లేదు. ఆమె యీకాలంమనిషి కాదు."

శాంత నోరు అవలించింది. నాన్న ఆడిన మాటలుకూడా బహుశః అప్పుడే జ్ఞప్తికి రావటంవల్ల కాబోలు ఆమె ఆలోచనలో పడింది.

"మానవనైజాన్ని మరమ్మత్తుచెయ్యటం అనుకు న్నట్లుగా సాధారణంగా జరిగే విషయం కాదు. విసవిసలాడినా మీఅమ్మ మీతోనైనా మీనాన్నగారి గురించి పెద్దగా చెప్పివుండదు......వస్తాను."

ఈమాటలను స్ఫుటంగా, సహజశాంతంతో అన్నాక సుందరం ఆమెవేపు మళ్లీ చూడకుండా యెదు రుగా వున్న మేడమెట్లు మెల్లగా యెగబ్రాకాడు.

ఈపలుకులలో కానవచ్చే సత్యాన్ని స్వీకరించే బదులు శాంత తనగురించి తానై ఆలోచించసాగింది. ప్రతిమాటలోనూ తను అవమానింపబడ్డా నని అను కున్నా, సుందరం మాటాడేటప్పుడు కనపరచే నిగ్ర హాన్ని గంభీరభంగిమను మనసునుంచి వెంటనే తుడిచి పెట్టలేకపోయింది.

అక్కచెల్లివాడు యెందరు ఆమెవేపు యేదో తెలియనిబాధతో చూశారు! ఏదో పనికల్పించుకొని తనెక్కడుంటే అక్కడకు వచ్చేవారు. అక్కయ్యకంటే తనే పెళ్ళిలో నలుగురివల్లా అభిమానింపబడింది. అక్కయ్యే ఒకసారి 'నివ్వు చాలా అందమైనదానవే' అంటే ... ఈభ్రాజత్వం సుందరంలో కొంతలో కొంతైనా లేకపోవటంతో ఆమె కోరికోరి మనసులో అపహాస్యాన్ని నింపుకుంది.

ఈసంఘటన జరిగిన మూడోరోజు రాత్రి డాక్టరుగారు కేసుమీద యేదో పల్లెటూరు వెళ్ళటంవల్ల చాలా రాత్రివరకూ సుందరం యేదో రాసుకుంటూ కూర్చున్నాడు.

మరుచటిరోజు మెలకువ వచ్చేసరికి చాలా పొద్దెక్కింది. ఆదివారం ఆఫీసు లేదని మంచంమీదే బద్ధకం తీర్చుకుంటుంటే ఆయనకళ్ళకి తెరచివున్న కిటికీగుండా డాబామీద వున్న కాంత కనపడింది.

జుత్తు విరబోసుకొని యెండలో నిల్చొనివుంది. లేచి కూర్చున్న సుందరం మనసు త్రిప్పుకోలేక పోయాడు. కాంతముఖం పసుపురాసుకోవటంవల్ల పసిడి నిగ్గులను వెదజల్లుతోంది. ఆ అందమైన ముఖంమీద సూర్యరశ్మి పడటంవల్ల తళుక్కుతళుక్కుమని మెరుస్తోంది! నుదుట గుండ్రని కుంకుమరేఖ—ఆకాటుకకళ్ళు చూడగానే సుందరం మనసును అదుపులో పెట్టుకోలేక పోయాడు. ఏదోమరచిన వెరచివవాడిలా ఇటూ అటూ ఆగదిలోనే పచారుచేస్తున్నాడు. రానురాను సుందరం కుడిచెయ్యి వణకటం ప్రారంభించింది. ఆచేతితో ఆమె ముఖం కాస్త పైకెత్తి ఆకాటుకకళ్ళల్లోనికి దీక్షగా చూడాలన్నంత ఆవేశం పుట్టుకొచ్చింది!

అలాంటి సమయాన కాంత సుందరంవేపు చూసింది. మళ్ళీ చూడనట్లు ముఖం చప్పున త్రిప్పి వేసింది. సుందరంకు తనవేపు చూసుకొనేసరికి యెందుకో సిగ్గు వేసింది. ఇంతసేపు తనేంచేస్తున్నా ననే ఆత్మవిచారణ చేసుకుంటున్నా ఆమెవేపు చూడకుండా వుండలేకపోయాడు.

కొంతసేపట్లో ఆమె తనవేపే వస్తోం దని అనుకొని గబగబ పరుపుమీద కూర్చుని ప్రక్కనే వున్న టేబిలుమీది పుస్తకాన్ని విప్పి దృష్టి పోనిచ్చాడు.

"మీదకు రాటానికే భయం వేస్తోం" దని గొణుక్కుంటూ సన్నని స్వరం రానురాను మందగించటంతో నిల్చొని చూశాడు. కాంత అక్కడ లేదు. ఆ మాటలుమాత్రం మనసులో కదిలిపోతున్నయ్.

ఏదో ఆలోచిస్తూ కూర్చున్నా డాక్టరుగారు జ్ఞాపకానికి రావటంవల్ల లేచి క్రిందకు వెళ్ళాడు. స్నానంచేసి మెట్లెక్కుతూ కాంతగదివేపు చూశాడు. ఆమె పరుపుమీద చారబడివుంది. కాలంకాని కాలంలో ఆకాశాన మబ్బులు కమ్మేసేమో...కిటికీగుండా వుండివుండి వుటికివుటికి దొంతరలుగా వీచే గాలికి తెల్లని పల్చనిచీర మెల్లిగా కదులుతోంది. సుందరం ఏటికన్నా కాంతకాటుకకళ్ళకోసం ఆగాడు. ఆమె పుస్తకంతో ముఖాన్ని దాచి యింకా చదువుకుంటోంది.

కాళ్ళీడ్చుకుంటూ మెట్లెక్కాడు. పంచెకట్టి బంగాళీషర్టు వేసుకొని మేడమెట్లమీద కాస్తచప్పుడు చేస్తూనే దిగాడు. కాంత పుస్తకం ప్రక్కకు పెట్టి చూడకపోవటంతో చాలా ఆశాభంగం కలిగిం దతనికి. ఇటూ అటూ చూశాడు. సరసమ్మ అగపడలేదు. గది గుమ్మందగ్గర నిల్చొని "ఈ రెండు శరత్ రచనలు...చదువుతారా?" అన్నాడు ఆమెవేపు చూస్తూనే. కాంత చప్పున పుస్తకం దించి కూర్చొని కాటుకకళ్ళల్లో మెరుపు మెరపించి, కటువుగా 'అక్ఖర్లేదు' అంది.

ఈతృణీకారంతో సుందరం అలా ఒకనిముషం తల దించి నిలుచుండిపోయాడు. ప్రక్కకు తిరిగి 'అయితే' అంటూ పెద్ద దీర్ఘాన్ని తీసి—అడుగడుగు వేస్తూ వేస్తూ తరవాత ఒక్కొక్కమెట్టు మెల్లగా యెక్కుతున్నాడు......ఈదీర్ఘమైన 'అయితే...'ను అనుసరించే మాటలకోసం చెవులు రిక్కించివున్న కాంత మనసు ఆ ఒక్కొక్కమెట్టుమీదనుంచి ఒక్కొక్క పాదాన్ని అనుసరించి పోతోంది......ఆ మాటల్లో ఆ వేళలా యేదో హృదయంలో దాగొన్న నగ్న సత్యాలు పైకొస్తాయని ఆతృత ఆమె నలా చేసింది!

కాని ఆ వేళలా సుందరం మనసు స్థిరంగా లేదు. కాలు కాలినపిల్లిలానో, దెబ్బతిన్న దుప్పిలానో అయి వెళిపోయాడు.

శాంతమనసుకు ఆ అయితేను అనుసరించే పదాలే కాకుండా...ఆకాటుకకళ్లకి మెల్లగా మీదికి పోతున్నప్పుడు కనిపించిన శాంతగంభీరమూర్తిని మళ్లీ చూడాలనిపించింది. కోరికతో పాటు...ఆచక్కని కిశోరికళ్లలో చల్లదనం—వదనంలో ప్రసన్నం మూర్తీభవించటంచేత పులకిపులికి వెంటాడే వయ్యారంతో మీదికి వెళ్లింది!!

సుందరం వేపు చూసింది. ధ్యాననిష్ఠలో నున్న యోగీంద్రునిలా పుస్తకం చదవటంలో నిమగ్నుడైపోయున్నాడు. ఏదో ఆలోచిస్తున్నట్లు నిల్చుంది...ఇటూ అటూ గదిలో అరిపోయిన జాత్తును సర్దుకుంటూ తిరిగింది. అప్పటికీ తన వేపు చూడని సుందరాన్ని చూసి నాన్న పరుపుమీద దుప్పటి దులిపి పరిచింది. బీరువా తీసి తల గడగలేబా మారుస్తూ కళ్లనిండుగా ఆయన వేపు చూసింది. రాని దగ్గుకూడ తెచ్చుకుంది...కాని, సుందరం ఆమె వేపు చూడలేదు.

మనసులో పుప్పొంగే భావాలనూ, కోరికలనూ ఆపట్టున శాంత శాంతింపజేసుకోలేకపోయింది. ఒక యువతివయసాలలో మరుగుపడ్డ మరునిభావాల బాధను అనిముషంలో కోరిన యువకుని కళ్లలోని కళకళలే శాంతవరకు శాంతింపజేస్తాయ్!—ఆసమయంలో ఆమె ఆదర్శాలు, ఔన్నత్యాలు ససేమిరా, జ్ఞాపకం రాలేదు—ఆమెకు కావలసిందంతా అనిముషంలో ఆయన ఆమెకు లొంగిపోవాలి.

పంగ్యలో యేర్పడే యెరుపువర్ణాల శోభవలె నే ఆఅనుభూతి యెంతసేపో ఆమెలో లేదు. సుందరం పుస్తకం అక్కడే వదిలేసి ఆమెవేపు చూడకుండా క్రిందికి వెళిపోవటంతో చీకటి అలముకున్న ఆకాశంలా ఆమెమన సైపోయింది!

శాంత నాన్నపరుపుమీద కూర్చుండిపోయింది. చాలాసేపటికిగాని ఆమెమనసు మళ్లీ మామూలు గర్వంతో నిండిపోలేదు. ఆమెఆదర్శాలు, ఔన్నత్యాలు అన్నీ జ్ఞప్తికిరాసాగినయ్...ఇంతసేపు తనలా యెందు కయిపోయిందో ఆమెకే అర్థంకాలేదు! ఆమెచేసిన చేష్టలు జ్ఞప్తికిరావటంతో చిన్నతనం వేసింది—

౫

నరసమ్మ చివరమెట్టుమీద నిల్చుని మేడమీదకు చూస్తున్న శాంత వేపు చూసి 'అక్కడేవమ్మా నిల్చు న్నావ్?' అంది.

"గదిలో సామాన్లు సర్దుదామంటే......"

"ఇంకా కదల్లేదా? కదలమని చెప్పేవరకూ యిల్లు విడిచి పోయేటట్లు లేదులే..."

ఈమాటలు అంటుండగానే మెట్లు దిగి వస్తున్న సుందరం వేపు చూసింది. పక్కకు తప్పుకుంది. కాని అక్కడ నిల్చోటానికి సిగ్గు పుట్టడంచేత ఆమె గది లోనికి వెళిపోయింది. సుందరం తలవంచుకొని వెళిపోతోంటే నరసమ్మ కళ్లు పెద్దవిచేసి అలా చూస్తూనే వుంది.

శాంత కిటికీదగ్గర యినపగజాలు గట్టిగా పట్టుకొని సుందరం కనిపించేవరకూ చూసింది.

ఒకనాడు సాయంత్రం శాంత మేడమీద యేదో వ్రాసుకుంటూ అప్పుడే మీదికి వచ్చిన సుందరాన్ని చూసి చప్పున లేచింది.

"ఈయింటికి మాఅమ్మ రావచ్చా?" ప్రశ్నించాడు సుందరం. తనెందుకు యీప్రశ్న వేయవలసి వచ్చిందో కాని, ఆమె చప్పున "రావటానికి వీల్లేదు. ఇష్టంలేకపోతే మీరుకూడా వెళిపోవచ్చు" చాలా తీవ్రంగానే అంది. మనస్సు చివుక్కుమనటంచేత గుటకలు మ్రింగుతూ "నేనూ అదే ఆలోచిస్తున్నా" అన్నాడు నిల్చొనే.

"నాన్న కదలమనేవరకూ కదల నన్నారు?"

"అందుకోసమే నేనూ ఆలోచిస్తున్నా. మనిషి అమాయకు డైనంతమాత్రాన ఆత్మాభిమానం వుండక పోదు, ఆవిషయం తెలుసుకోలేనివాళ్ళదగ్గర యెందు కుండాలి?"

"ఓహో యెంత పెద్దవాక్యం? అందుకనేనా అంత భక్తి!"

సుందరం అలా తలదించుకొనే "మీనాన్నగారి విషయం, నావిషయం కాదు నే మాట్లాడింది! మీ విషయం!!"

"మీజోక్యం అనవసరం"

సుందరం అక్కడనుంచి మారుమాటాడకుండా వెళిపోయాడు. శాంత మెట్లు దిగిపోతున్న సుందరం వేపు తొంగితొంగి చూసింది. మళ్లీ కూర్చొని రాయాలనుకున్నా కలం ముందుకు సాగిపోలేదు.

ఆ వేళ రాత్రి డాక్టరుగారు సుందరంకోసం చాలా సేపటివరకు చూసి సినీమాకు వెళిపోయివుంటాడేమో నని భోంచేసి మేడమీదకు పోయారు. తలనొప్పిగా వుండటంవల్ల నరసమ్మ మూలుగుతూ అప్పుడే నిద్ర పోయింది.

శాంత గదిలో కిటికీదగ్గర కుర్చీ వేసుకొని వీధిలోనికి చూస్తోంది. అప్పటికి పది దగ్గరపడింది. వెన్నెల్లో సుందరం మెల్లగా తల దించుకొని రావటం చూసి ఆయన తలుపు తట్టకుండానే వీధితలుపు తీసింది.

"మీకోసమే... వేగిరం బట్టలు మార్చి భోజనానికి రండి" అంది మెల్లగా. అగొంతుకలో అభిమానం పుట్టిపడుతుంటే సుందరం తనశరీరంవేపు చీకటిలోనే చూసుకున్నాడు!

భోజనంచేస్తూ శాంతవేపు ఒకసారి చూశాడు. ఆమె తలుపు నానుకొని నిలుచుంది. మళ్ళీ తల దించాడు. శాంత ప్రయత్నంమీద చాలా సేపటికి అంది —"శాంతం పసూనం అంటారే - సాయంత్రం అలా అయిపోయారేం?"

"అవును. అయ్యాను, మీరు పరీక్షకే అలా మాటాడా వంటే అప్పుడుకూడా-అలానే అయిపోయి వుందును!"

శాంత కంతా అగమ్యగోచరమైంది. సుందరం ఒకసారి తలెత్తి చేతిలో అన్నంముద్ద పట్టుకొనే యేమో చెప్దామనుకొనే ఆమెవేపు దీనంగా చూశాడు. అన్నం ముద్ద ఆకుమీద పారేసి తల దించి అన్నాడు: "మీ పనిమనిషిలానే మాఅమ్మ నన్నూ నాచెల్లినీ పెంచటానికి ఒకరింట్లో పనిచేసేంది. ఈవేళ ప్రొద్దున్న మీరు మీపనిమనిషిమీద విరుచుకపడ్డట్టే ఒకనాడు మాఅమ్మమీద ఒకావిడ విరుచుకపడింది. నాకు బాగా జ్ఞాపకం వుంది. ఆనాడు మాఅమ్మ నన్నూ, నాచెల్లిని పట్టుకొని బావురుమని యేడ్చింది. ఈనాడుకూడా మాఅమ్మలా ఒకావిడ యేడ్చే వుంటుంది—" అంటూనే లేచి చెయ్యి కడుక్కున్నాడు. వెళిపోతున్న సుందరంవేపు శాంత చూస్తూనే నిలుచుండిపోయింది.

౬

నరసమ్మను చూడటానికని వచ్చి నెలరోజులై ఆమెఅక్క అక్కడే వుంది. శ్రావణమాసంలో నాలుగోకూతురుయింటికి వెళ్లాలనుకున్న నరసమ్మ తమ్ముడియింటికి ప్రయాణం కట్టింది.

"సరే, వెళ్ళొమ్మ! నీ ముసలిమొగుడు యిక్కడ వున్నాడనిమాత్రం మర్చిపోకేం" అన్నారు చిన్ననవ్వుతో డాక్టరుగారు.

శాంత నవ్వేముఖాన్ని రెండోప్రక్కకు త్రిప్పుకొనేసరికి సుందరంనవ్వుముఖం యెదురైంది. 'పిల్ల వుంది' అన్నట్లుగా సైగచేస్తూ నరసమ్మ నోరుమూసుకుంది.

"ఏం అమ్మా! అమ్మతో వెళ్తావా?" అన్నారు డాక్టరుగారు. ఆమె జవాబు చెప్పటానికి తటపటాయిస్తుంటే, "ఇంకోసారి వస్తుందిలెండి. ఈసారి నేనే వెళ్ళొస్తా" అని నరసమ్మ అందుకుంది.

నరసమ్మ వెళిపోయింది. ఇంటిపెత్తనమంతా శాంతమీద పడింది. తెల్లారి లేవటం, పూజకు పువ్వులు, కాఫీటిఫిన్లు అమర్చటం ఆమె చెయ్యవలసి వస్తోంది.

"బజారుకు డబ్బు..." అన్నాడు సుందరం క్రొత్తమేనేజరు యెదురుగా నిల్చొని.

"మీ రెందుకూ...?"

"సిగరెట్లకి రోజూలా డబ్బు మిగిలించుకోవద్దూ?"

ఈమాటలు సుందరం నవ్వుతూ అన్నా శాంత ముఖం నల్లబడిపోయింది. చాలా కనికరంగా ఆయన

వేపు చూసింది. పనిమనిషి మిగిలిస్తుం దని, సుంద రాన్ని బజారు తెచ్చేమనిషిని చేసి, సుందరం మిగిలిస్తున్నా డని వంటమనిషితో చెప్పేటప్పుడు అమ్మతో యేమని యెందుకు చెప్పా లనుకుందో, యెందుకు చెప్పలేకపోయిందో ఆమె తెలుసుకోలేకపోయింది!

ఆ మరుచటిరోజు డాక్టరుగారు పూజ అయ్యాక టిఫిన్ చేస్తున్నారు. ఎదురుగా కాఫీ పెట్టి శాంత నిల్చుంది. ఒక గుక్కెడు కాఫీ త్రాగాక సుందరం వేపు తిరిగి "ఒరే బాబూ! మాచిన్నమ్మాయంటే నా కెంతో అభిమానం! ఎంచే తంటావ్? మాఅమ్మపేరూ శాంతమ్మే. నాచిన్నప్పుడు నన్ను పెంచి పోషించిందా? ఈముసలికాలంలో యీ శాంతమ్మ పోషిస్తుంది." కూతురువేపు తల త్రిప్పి "ఏం అమ్మా అంతేనా?"

"ఇదేంటి నాన్నా—ని న్నొకరు పోషించాలా?"

"ఇదంతా నాదే అనుకొని నువ్వైనా యింట్లో వుంటావని..."

శాంత ముఖం దాచుకోటానికి చోటు లేక పోవటంతో గబగబ యెదురుగా చారవేసివున్న కిటికీ రెక్కలు తెరవటానికి వెళ్లింది. శాంత ముఖం నాన్న వేపు త్రిప్పేసరికి నాన్న కాఫీ పూర్తయిపోయింది.

"ఒరే బాబూ! నే చెప్పినట్లు ఆపెద్దకూతురు వింది. దాని కేం లో టొచ్చింది చెప్పు. చిన్నమ్మాయిమీదా అలాంటి ఆశే వుంది.—ఏంఅమ్మా—మీరెండో అక్కలా మీఅమ్మమాట వింటావా? లేక మీపెద్దక్కలా నామాట వింటావా?"

శాంత పొందుతున్న పరిపూర్ణానందంతో చప్పున "నీమాటే నాన్నా" అంది సిగ్గు నభినయిస్తూ. సుందరం నోరు ఆవలిస్తే శాంత తల దించుకుంది...

సుందరం లేచి క్రిందికి వెళ్లాడు. కొంతసేపయ్యాక తిరిగి వచ్చేసరికి తండ్రీ కూతురూ యేగోడవలో మాటాడుకుంటున్నారు. ఆమాటలు వినకుండా వుండాలని టెర్రేస్ వేపు వెళ్లాడు. ఎండలో నిల్చొని యేదో తెలిసి తప్పుచేసినవాడిమల్లే అయిపోయాడు.

ఆలోచనలనుంచి బయటపడి చూసేటప్పటికి డాక్టరుగారు ఆయనవేపు చూస్తుండటం గమనించాడు. తనవికారముఖకళలను ఆయన చూశారేమోనని బాధపడ్డాడు.

డాక్టరుగారు వెళిపోయారు. శాంతఅంతకుముందే అక్కడనుంచి వెళిపోయింది. ఆఫీసుకు టైము కాకపోయినా బట్టలు వేసుకొని మెట్లు దిగుతుంటే శాంత యెదురైంది. ఆమెవేపు చూడనట్లుగా వెళిపోతూంటే—

"ఆఫీసుకు కాదనుకుంటాను..."

"కాస్త అర్జంటుపనుంది" అనుకుంటూనే సుందరం వెళిపోతోంటే "తోటలో పువ్వు లేమీ లేవు. వచ్చేటప్పుడు తెస్తారా?" అంది.

'హుఁ' అన్నాడే గాని, మనసులో యేదో అనుకొనే వెళ్ళిపోయాడు.

ఆవేళ ఆఫీసునుంచి చాలా ఆలస్యంగా యిక్కడా అక్కడా అర్థంపర్థంలేకండా తిరిగాక వచ్చాడు. డాక్టరుగారు తనకోసమే చూస్తున్నారు. శాంత, సుందరం డాక్టరుగారికి చెరోవేపు నడుస్తూ ఆయన చెప్పే కబుర్లు వింటూ సినీమాథియేటరు చేరారు.

సినిమా విడిచిపెట్టాక జట్కా యెదురుగా నిల్చింది. శాంత మొదట కూర్చుంది. డాక్టరుగారు యెక్కుతా రని కాస్త తప్పుకొని వున్న సుందరం వేపు చూస్తూ, 'యెక్కరా బాబూ' అన్నారు చేతికర్ర వూపుతూ. సుందరం కూర్చున్నాక చివరను డాక్టరుగారు కూర్చున్నారు.

శాంత రెండుజడలు ముందుకు వేసింది. సుందరంముఖం యెదురుగా వున్నా ఆమె చూడలేదు. పువ్వులు లేనందుకు సంజాయిషీ చెప్పుకోకపోవటం అటుంచి సుందరంముఖం వుదయంనుంచీ అదోకలా వుండటం ఆమెకు కష్టంగానే వుంది. అమ్మ యేదో అన్నప్పుడుకూడ నవ్వుతూనే వెళిపోయేవాడు కాని, యీవేళ ఆ సిగ్గుతో కూడిన నవ్వు సుందరం ముఖంలో లేకపోవటంతో ఆమెకు యెవరిమీదనో అలక సాగించా లన్నంత కోపం వచ్చింది!!

డాక్టరుగారు స్వీయచరిత్ర మొదలు పెట్టారు:

"నీ వ్వంటావు కారు కొనే తాహ తుందని. మారాధమ్మ వాసైకిలు చూసి అసహ్యించుకొనేదిరా బాబూ. ఆ సైకి లుండబట్టే నేనూ వున్నాను—యీడబ్బూ గడించాను..."

ఈ చరిత్ర చెప్పే ధోరణి వినటానికి కుతూహల పడేవారికి కమ్మగానే వుంటుంది! కాని సుందరం సరిగ్గా పూఁకొట్టలేదు!!

"సున్నైఖయేళ్లపైనే అయింది! చచ్చిపోతా నన్నవాడికి చేతిడబ్బు పెట్టి మందులు, యింజక్షన్లు కొని బాగుచేశాను. వాడేం చేశాడంటావ్—పాత సైకిలు, పెళ్లాం, ఐదుగురుపిల్లలతోసహా మాయింటికి వచ్చాడు. కుర్చీమీద కూర్చున్నానేమో కాళ్లమీద అందరూ ఒకసారి పడి మ్రొక్కారు. ఆసైకిలు పుచ్చుకొనేవరకూ విడిచిపెట్టారు కాదు. ఆసైకిలు యేరోజునుంచి యెక్కానో ఆరోజునుంచీ డబ్బు అలానే వచ్చిపడిపోయేది! చిన్నచిన్న సామానులు మార్చినా సైకిలు అదేనా? అదివుంటేగాని మనకి డబ్బు రాదోయ్!!"

డాక్టరుగారు వ్యాఖ్యానిస్తూ చెప్పుకపోతు న్నారు...టక్ టక్...శబ్దం చేస్తూ గుఱ్ఱపుబండి పోతూ యిద్దరిగుండెల్లో గడగడలాడిస్తోంది... 'ఎక్కరా బాబూ' అని బహుతేలిగ్గా అన్న డాక్టరుగారుమాత్రం మామూలుగానే వున్నారు! కాని ఆమాటలవల్ల రెండు జీవాలమనసుల్లో గాలిలో రేగిశే ఆకుల్లా ఆలోచనలు పరుగులెత్తుతున్నాయ్!!

సుందరం ఒకసారి శాంతవేపు చూశాడు. ఆ పువ్వులులేని రెండు జడలు చూసి మళ్లీ ముఖం త్రిప్పి పూఁకొడ్తున్నాడు. ఈసారి శాంత సుందరంవేపు చూసింది. గాలికి మెల్లగా ఆయనజుత్తుమొనలు ఆడు తున్నయ్. సుందరం సర్దుకోబోయాడు.

కదిలేటప్పుడు ఆయనకుడిచేయి ప్రక్కనే వున్న శాంత కాళ్లమీద పడింది. గభ్భున తీద్దా మనుకున్నాడు, తీశానను కున్నాడు—కాని తీయలేదు. నిముషంలోనే శాంత కాళ్లు తనచెయ్యిలానే వణుకుతున్నా యని గుర్తిం చాడు.

జట్కా ఆగింది. గుఱ్ఱపుటకటకలు లేవు—ఆ అనుభవంలోని లయకూడా దూరమై పోయింది. వాస్తవికపరిస్థితులను గుర్తించిన వారు ఆశానిరాశలతో ఒక నిమిత్తమాత్రుని వెనకాలే యింట్లోకి వెళ్లి పోయారు!!

మరుచటిరోజు శాంత లేచేసరికి సుందరం స్నానం అయిపోయింది. నాన్నపూజకోసం పువ్వులు తీసుక వెళ్లేటప్పుడు సుందరం దీక్షగా యేదో పుస్తకం చదువుకోవటం గమనించింది. కాఫీ త్రాగేటప్పుడైనా ఆమెవేపు చూడలేదు. ఇదివరకు పొరపాటునైనా చూసేవాడు. ఈ వేళ అలాంటి పొరపాటేమీ చెయ్య లేదు.

రాత్రి భోజనందగ్గర యేమీ అడగలేదు. వేసిం దేదో తిని లేచిపోయాడు. నాలుగురోజులు యిందుమించు యిలానే గడిచిపోగానే శాంత సుందరం గూర్చి యెందు కాలోచించా లనుకుంది—ఐదో రోజు రాత్రి భోజనానికికూడ రాలేదు. చాలా ఆల స్యంగా వచ్చి శాంత పెద్దమ్మతో "స్నేహితునింట్లో భోంచేశాను" అన్నాడు.

రోజుకురోజూ సుందరంమార్పుకు శాంత చాలా కంగారుపడింది. అమ్మతో వెళ్తావా అని నాన్న అడిగేటప్పుడు యే ఆశ మనసులో పెట్టుకొని తటపటాయించిందో ఆ ఆశ నిరాశగానే మారింది.

అమ్మ రేపు వెళ్తుంది. సుందరంను యిదివరకే ఒకవిషయం అడగా లనుకున్నా అడగలేకపోయింది. ఈవేళరాత్రి ఆమెకు నిద్దర రావటంలేదు. ప్రక్క గదిలో పెద్దమ్మ అధ్యాత్మరామాయణకీర్తనలు పాడుకుం టోంది. నాన్న అప్పుడే యేదో కేసుమీద బయటకు వెళ్లారు. నిముషనిముషానికీ శాంతమనసు వుద్వేగంతో కొట్టుకొంటోంది...మెల్లమెల్లగా మేడమీదకు వెళ్లింది. సుందరం లేడు. డాబావేపు వెళ్లింది. వెన్నెల మసగ్గా వుంది. ఒకమూల సుందరం కుర్చీమీద తలదించు కొని యేదో ఆలోచిస్తూ కూర్చొనివున్నాడు. దగ్గరగా వెళ్లా లనుకుంది కాని వెళ్లలేదు. గుంచెందూరంలో తల దించుకొని నిల్చుంది. చిన్న చప్పుడుకూడ చెయ్యక పోలేదు. సుందరం ఆమెవేపు చూసి మామూలుగా

తల తిప్పేశాడు. ఈ నిరాకరణ ఆమెకు చాలా అవమానంగా తోచింది. ఆవెన్నెలరాత్రిలో యేం చెయ్యాలోతోచక బేజారెత్తింది. చివరకు వెనుకకు తిరిగినా ముందుకు అడుగు వెయ్యలేకపోయింది.

సుందరం లేచాడు. శాంత ప్రక్కచూపు చూసింది. సుందరం తల దించుకొనే వున్నాడు.

గొంతుకనురగురలనుంచే లేని కటుత్వాన్ని బలవంతాన తెచ్చుకొని "నావేపు చూడకండి. నావిషయం మరచిపోండి"

ఈ కటుస్వరాన్ని వినగానే శాంత అడగాలనుకున్న విషయాన్ని మరచిపోయింది. తనెవరు? తనేం చేస్తున్నది? ఇలా అనటంలో ఆయనవుద్దేశం యేమిటి? తను ఆయనకోసం చచ్చిపోతోందా? దిగువ పెదిమను పళ్లతో గట్టిగా నొక్కుకుంది. దీర్ఘ ఉచ్ఛ్వాసనిశ్వాసాలను తీస్తూనే చప్పున ముందుకు వెళిపోయింది. నిద్రపోదామన్నా నిద్దర రావటంలేదు. ఆమెమనస్సంతా మండిపోతోంది. ఇంతనీచంగా తను ఒక ఆశ్రితునిచే తూలనాడబడుతుం దని యెన్నడూ అనుకోలేదు! రాను రాను ఆమెకు పెద్దపెట్టున తన అజ్ఞానానికి యేడవాలనిపించింది...

నరసమ్మ వచ్చాక కూతుర్ని చూచి "యీపది హేనురోజుల పెద్దరికానికే చిక్కిపోయావమ్మా"అంది. నరసమ్మ చాలా వుత్సాహంగా వుంది. వచ్చినదగ్గర నుంచీ యీకబురూ ఆకబురూ తెగచెప్తుంటే వినటానికి శాంతకు చిరాకుగా వున్నా వూఁకొట్టి అభిప్రాయాన్నిచ్చే అక్క వుందిగా!

ఆవేళ సాయంత్రం ఆయింట్లో పెద్ద గృహకలహం లేచింది. తీర్పు చెప్పే భారం నరసమ్మ అక్క వెంకమ్మమీద పడింది. డాక్టరుగా రన్నారు "నాకు తెలుసు ఈ ఆడపెద్దరికాలు పీకలమీదికి తెస్తాయని. నే వెళ్లేటప్పుడే చెప్పానే—యీముసలి ముండన్ని మరచిపోవద్దని. నీకెవరు మా టిస్తున్నారు? ఇప్పు డెవ రేమనన్నారు?"

నరసమ్మ తనమాట నిలబెట్టకపోతే యే మవుతుందోనని భయపడింది. డాక్టరుగారి వైపు కోపంగా చూసుకుంటూ నంది. 'పో! నీ ఖర్మం నేనేం చేస్తా' నన్నారు డాక్టరుగారు.

ఈమాటలతో భార్య కళ్లనిండా నీరు నింపటం చూసి వదినగార్ని వుద్దేశిస్తూ డాక్టరుగా రన్నారు— "ఇదిగోండి మాశాంత పెళ్లి నాచేతిలో వుంది. నాయిష్టం వచ్చినట్లు మీ రెవరూ కానివ్వకపోయారంటే... యీయింట్లో ఒక్కనిముషం వుండమంటే వుండను—సరా!"

మేడమీద జరుగుతున్న యీ గందరగోళాన్ని శాంత అడుగుమెట్టుదగ్గర నిలబడి వింటోంది. నరసమ్మ నిష్ఠూరం మిళితంచేసి యేడుస్తోంది.

"ఈకాలంపిల్లలు విన రంటావ్? నాకూతురే నామాట విన దంటావ్? పరే! నీయెదురుగా చెప్పిస్తే?"

నాన్నగారిపిలుపు వినిపించేసరికి శాంత కెందుకో భయంవేసింది. మెట్లెక్కుతున్నా ఆమెనరాలన్నీ పట్లు తప్పినట్లనిపించినయ్.

వస్తూరావటంతోనే నాన్న అడిగారు "ఏం అమ్మా! నీపెళ్లివిషయంలో నామాట వింటావా? మీ అమ్మమాటా?" ఇదివరలా 'నీమాటే నాన్నా' 'అని తేలిగ్గా అనలేకపోయింది. కొన్నేపటికి ముఖం దాచి "నీమాటే నాన్నా" అంటూనే మెట్లు దిగిపోతోంటే డాక్టరుగారు అన్నారు—"నాఅమ్మపేరూ నాపేరూ నిలబెట్టావే—ఇదంతా నీదే నమ్మా!"

వదినగారివేపు తిరిగి—"ఇక చెప్పండి తీర్పు. మీ చెల్లెలుగారు తమ్ముడిగారింటికి సంబంధంచేసుకరాటానికి వెళ్లింది. వాళ్లెవ్వరికి కావాలి? నాతల యెత్తిన పని చేసిందా? నేను యీలోకంలో లేననుకుంది"

"రామరామ! యెంతమాట!" అంటూ వెంకమ్మ చెవులు మూసుకుంది. నరసమ్మ అక్కడనుంచి లేచివెళిపోతోంటే—"ఏమయినా స్త్రీఅడబ్రతుకు. ఆశాపాశాలు వుంటాయ్! ఏదో తొందరపడింది. మీ యిష్టం కాకపోతే యింకెవరియిష్టం పనికొస్తుంది?"

ఈతీర్పు చెప్పి ఆమె మెల్లగా ఒక్కొక్కమెట్టు దిగి పోయింది.

కాసేపయ్యాక సుందరం వచ్చాడు. మెట్లెక్కుతూ కాంతగదివేపు చూశాడు కాంత రెండుచేతులతోనూ కళ్లు మూసుకొని వాలుకుర్చీమీద కూర్చొని వుంది. ఆమె అలపటకెంకుతూ యేడుస్తోం దని గ్రహించాడు. ముందుకు వెళ్లటానికి మనసు పోలేదు. కాని ఆమెదగ్గరగా వెళ్లి మాటాడటానికికూడ ధైర్యం చిక్కలేదు ఎలాగో మేడయెక్కి డాక్టరుగారు తలపట్టుకొని కుర్చీమీద కూర్చొని నిర్విణ్ణు డయ్యాడు.

సుందరాన్ని చూసి "కూర్చోరా బాబూ" అన్నారు చిన్న నవ్వుతో.

౭

మాఘం వచ్చింది. డాక్టరుగారు చిన్నకూతురు పెళ్లి యెంతవైభవంగా చేద్దా మనుకుంటున్నారో కావలసిన బంధువులు, ఆత్మీయులు యెక్కడకక్కడే యెదురుతిరుగుతున్నారు. ఎలాంటి దెబ్బలనైనా లోలోనే పాతిపెట్టి ముందుకు పోతున్నారు. పెద్దల్లుడు పెద్దకూతురు తప్పించి మిగతావాళ్ళంతా ఉత్తరాలతోనూ మాటలతోనూ చిరాకెత్తించారు. కాని కేవుడురాట్టల భత్తువతో మనిషి స్తంభంలా నిలుచునే వున్నాడు.

వరసమ్మ తల మొత్తుకొని యేడిస్తే "నీ మొగుడు మంచిపని చేస్తే యేడుస్తావ్. చెడ్డ చేస్తే నీకు సరదా. అలాంటప్పుడు యిద్దరిలో ఒకరు ఛస్తేగాని యీయిల్లు బాగుపడ" దన్నారు.

పెద్దకూతురు మనసు వుండబట్టక "ఇంత తొందరేం వచ్చింది నాన్నా" అంది. "నా కాంతమ్మే కాదు అని వుంటే అప్పుడే యింటినుంచి వెళిపోయేవాణ్ని. ఏమైనా నివ్వాడవలసిన మాట కాదమ్మా యిది" అన్నారు డాక్టరుగారు చిన్న కూతురుకు వినిపించి వట్లుగా.

ఇదంతా కంటున్న, వింటున్న కాంతకు యెక్కడలేని భయం వేసింది. నాన్నదగ్గరకు వెళ్లి 'నాకీ పెళ్లి యిష్టంలేదు నాన్నా' అని అనాలనుకుంది. కాని మళ్లీ ముక్కుమీదకు పౌరుషం వచ్చేసింది. పిడికిలు పట్టుకొని ఆ సమయానికై వేచివుంది. బ్రతుకంతా బూడిదపాలైనా తను చెయ్యాలనుకున్న పని చేసి తీరాలనే పంతంతో నిలుచుంది.

డాక్టరుగారు స్వయంగా వెళ్ళి పిల్చారు. పెద్దల్లుడుతప్పించి మిగతాముగ్గురూ రాలేదు. పోనీ కూతుర్లను పంపించమన్నా అదీ లేదు. భార్య ఏడుపు ఆపకపోవటం చూసిన డాక్టరుగారికి యెన్నడూ రానంత కోపం వచ్చింది! కాని ముందు పరిస్థితి మనసులో పెట్టుకొని నవ్వుకున్నారు!!

కాంతపెళ్ళి అయిపోయింది. కాని ఆమె మనసులో భయంకంటే కోపం, అహంభావం హెచ్చుగా నులుముకపోతున్నాయ్. తన అక్క పెళ్ళప్పుడు యెంత అనుకుంది! అక్క మొగుడుకంటె యెంతో అందగాణ్ణి, ధనవంతుణ్ణి, విద్యాధికుణ్ణి పెళ్లిచేసుకుంటా ననుకుంది. కాని యిప్పుడు త నెవర్ని చేసుకుంది?

శోభనపుగదిలోకి పంపించి టకీమని తలుపు వేసేటప్పుడు గుండె ఆగిపోతుందా అనిపించింది. కొద్ది నిముషాల్లో మేల్కొన్నట్లు యేవేవో ఆలోచనలతో మెదడు మళ్లీ పనిచేయటం మొదలుపెట్టింది.

సుందరం పుస్తకం పడవేసి ఆమెవేపు చూశాడు. ఆమెదగ్గరగా వచ్చి నిలుచున్నాడు. కాంతతలదించుకొనే బుసకొట్టోంది. చెయ్యి పట్టుకోబోయాడు. విదిలించుకుంది.

సుందరం వంగి ఆమెకళ్లల్లోనికి చూశాడు. ఆమె అక్కడనుంచి చరచరా మంచందగ్గరకు పోయి నిలుచుంది! ముఖం కందగడ్డలా వుంది.

దగ్గరగా వెళ్లి నిలుచుని "ఇది నిజం కాదనుకుంటాను..." అన్నాడు.

పడగ యెత్తిన నాగులా తల యెత్తింది. కటువుగా ముఖం చిట్లించుకొని "నిజం, ముమ్మాటికీ నిజం—నావేపు చూడక్కర్లేదు. నావిషయం మర్చిపోవాలి!"

ఈమాటలు అనటానికి అదనుకోసమే యీఐదు నెలలూ యెదురుచూసింది! ఈమాటలు అప్పచెప్పటానికే పెళ్లిఆడి తీరా లనుకుంది!! ఈమాటలాడి హృదయంలో

బరువు తగ్గించుకోవాలని రాత్రింబగళ్లు యేకధాటిగా ఆలోచించుకొని కూర్చుంది!!! కాని, యీమాటలు యిప్పుడు అడటంవల్ల ప్రయోజనం గురించి గాని, రాబోయేపరిస్థితులగురించిగాని ఆమె ఆలోచించలేదు. ఈమాటలు ఒకనాడు ఆమెనుండి వెలొచ్చీ వేశాయో అంతకంటే అధికంగా సుందరంనుండెను చెల్చుతా యని ఆశించింది. కాని, సుందరం అక్కడనుంచి యెలా చరచరా వెళ్లిపోలేదు. అలానే నిల్చునివున్నాడు. ఈసన్ని వేశం ఆమెకు వెర్రెత్తించింది. కొఱకొరా చూసింది. కాని చలించకుండా సుందరం అలానే నిల్చున్నాడు. పాశీనవ్వు నవ్వి "చాలాదూరం ఆలోచించి అన్నవేనా యీమాటలు!" అని ప్రశ్నించాడు.

ఈప్రశ్నతో ఆమె తోకతొక్కిన పాములా చర్రున లేచింది—"నివ్వే తెలివైనవాడివి కా"నంది.

ఈ ఏకవచనప్రయోగంతో విస్మితుడై యేమీ మాటాడలేకపోయాడు. తిన్నగాపోయి మళ్లీ పుస్తకం పట్టుకున్నాడే గాని విప్పలేదు.

ఆమరుచటిరోజురాత్రి శాంత సరాసరి వచ్చి పందిరిమంచంమీద పడుకుంది. సుందరం చాలాసేపటి వరకూ అలా చారబడి యేదో ఆలోచించుకుంటున్నాడు.

లేచి శాంతదగ్గరగా వెళ్లి "మళ్లీ ఒకసారి ఆలోచించావా!" అన్నాడు.

ఈ యేకవచనప్రయోగం వినటం యిదే మొదటిసారేమో—ఆమెకు రిమ్మెత్తింది.

"అక్కర్లేదు. వెళ్లొచ్చు!" అంది.

"మళ్లీ మళ్లీ ఆలోచించ మంటున్నా"

"వెళ్లిపోవాలి కామోసు...!" రెండోవేపు తల త్రిప్పి లేచింది.

"వెళ్లమని నే చెప్పలేదూ అనను. తప్పులు తెలిసి చెయ్యం. అందుకోసమే మళ్లీమళ్లీ ఆలోచించమంటున్నా"అంటూ వెళిపోయి కుర్చీమీద చారబడ్డాడు.

మూడోరోజురాత్రి దగ్గరగానే వచ్చి "మనసులో పెట్టుకోక యేదైనా అవాలని వుంటే అనొచ్చు".

శాంత యేమీ మాటాడలేదు. సుందరం మెల్లగా జుత్తు పీక్కుంటూ యేదో గొణుక్కుంటూ వెళ్లి కుర్చీ మీద కూలబడ్డాడు.

౨

రోజుకు రోజూ సుందరం చాలా గంభీరంగానే వుంటున్నాడు. శాంతకు పట్టుదల మరీ హెచ్చయింది. వీళ్లయిరువురి ప్రవర్తన కనిపెట్టిన వరదమ్మ యేదోఅనుమానాన్ని మనసులో పెట్టుకున్నా కూతుర్ని యేమీ అడగలేదు. ఒక్కొక్కసారి తనగొప్పతనం భర్త తెలుసుకోటానికి యీవిషయం పనికొస్తుందేమో నని అనుకున్నా, ఆయనతో చెప్పటానికి సాహసించలేకపోయింది. సుందరం యిప్పుడు అల్లుడైనందుకు యేమాత్రమైనా మారుతాడనీ, ఆమెఅడుగులకు మడుగులొత్తుతాడనీ ఆశించింది! అలాంటి దేమీ లేకపోవటం, పైపెచ్చు ఆమెచేసే పనులకు యెదురు తిరగటం కూడ జరుగుతోంది. అన్ని విషయాలలోనూ భర్త అల్లుడినే సమర్థించటంతో వెర్రెత్తింది.

వేసవికాలం. ఆదివారంనాడు తెల్లవారేసరికి డాక్టరుగారు విశాఖపట్నంనుంచి తిరిగి వచ్చారు. స్నానం, ధ్యానం అయ్యాక వాలుకుర్చీమీద కూర్చొని కూతురు వేపు చూసి "సుందరాన్ని, మీ అమ్మనూ పిలుచుకరామ్మా" అన్నారు.

శాంత క్రిందకు పోయి కొంతసేపు గదిలో కూర్చొని తరవాత అమ్మదగ్గరకు వెళ్లి "నాన్నగారు, అయననూ రమ్మంటున్నారే" అంది. వరదమ్మకూడ అల్లుడితో మాటాడదేమో 'పిలవలేకపోయావా!' అంది. శాంత ముఖంత్రిప్పటం చూసి వరదమ్మ వంటమనిషితో "సుందరమ్మా! సుందరం ఆగదిలో వున్నాడు, బాబుగారు పిలుస్తున్నారని చెప్పు!" అంటూ కూతురుతో కలిసివెళ్లింది.

ఏంచెప్తారో అని మేడమీదకు ముందుగా వచ్చిన భార్యా, కూతుర్ల వేపు చూసి యేమీ మాటాడలేదు. సుందరం రాగానే "రా బాబూ, కూర్చో, రా"

అన్నారు. అంతవరకూ నిల్చున్న ఆత్మీయుల మనస్సులు చిప్పుక్కుమన్నాయ్. తొడలమీద చేతులు ఆన్చి ప్రశాంతంగా కూర్చొని డాక్టరుగారి వేపు చూస్తున్నాడు సుందరం.

"ఈవృత్తిగాన్ని విడిచిపెట్టవలసి వస్తుందిరా బాబూ!"

సుందరం మాటాడలేదు. ముఖంలోమాత్రం గంభీరచిహ్నాలబదులుసంశయం కొట్టుకలాడింది.

"ఆనాడు బదిలీమీద డిస్పెన్సరీకి వచ్చేటప్పుడు ఒక పెద్దమనిషితో మాటాడుతుండటం నీకు జ్ఞాపకం వుందనుకుంటాను. నిన్ను చూడగానే అప్పటికే రాధమ్మ పెళ్లివిషయం చికాకుపడివున్నానేమో నీమీద ఆశ కలిగింది. ఆ పెద్దమనిషి నాస్నేహితుడు. విశాఖపట్నంలో పెద్దపేరున్న గవర్నమెంటుడాక్టరు. నే కోరిన కోరికకు యీ సంవత్సరం యింకొకరికి మాట యిచ్చాను; వచ్చే సంవత్సరం తప్పకుండా అన్నాడు. మొన్న ఆయన వుత్తరం వ్రాస్తేనే వెళ్ళాను..."

డాక్టరుగారు ఆపారు. తలెత్తి వింటున్న సుందరం తల దించేశాడు.

డాక్టరుగారు మళ్లీ ప్రారంభించారు. ఈసారి భార్యవేపు చూపు పారేస్తూ "నాపేరుప్రతిష్ఠలు నిలబెట్టేవాడు ఒకడు దొరికాడని ఆశపుట్టింది యిన్నాళ్లకి." మళ్ళీ సుందరంవేపు మోము త్రిప్పి "నిత్యావాలానే పెరిగావ్. ఒకరిదగ్గరకు పోయి చెయ్యి చాపటం నాలా నీకూ పేదరికంలోకూడ చేతనయ్యింది కాదు! మాఅమ్మలా మీఅమ్మ చెయ్యిచాపింది. కొడుకులు లేకపోయినా నా కేవిచారం లేదు. నివ్వేదో ఆడాక్టరుపరీక్ష పాసయివచ్చాక నేను కాస్తవిశ్రాంతి తీసుకోవచ్చు."

ఈమాటలు అనేటప్పుడు తల్లీకూతుళ్లు ముఖాలు దించుకున్నా సుందరంమాత్రం తలెత్తే వున్నాడు. డాక్టరుగారి గొంతుక చాలా అభిమానంతో నిండుకపోయింది. ప్రతిమాటా హృదయంనుంచి వస్తుంటే సుందరం కళ్లల్లో వూరే నీటిప్రవాహాన్ని ఆపేప్రయత్నంలో వుండి యేదో అందామనుకున్నా అనలేకపోయాడు.

డాక్టరుగారు నవ్వుముఖంతో లేచారు. భార్యతో పరిహాసాలకికూడాయిదే సమయంలావుంది. "పెద్దమ్మాయ్ పెళ్లప్పుడూ యేడ్చావ్! చిన్నమ్మాయ్ పెళ్లప్పుడూ యేడ్చావ్! నీకష్టాలకి యెవరే అయ్యారు? పెద్దవాడు నిన్నుమూడునెలలు సేవచేసి బ్రతికించాడు. ఈ చిన్నవాడు నీవుబ్రతికినంతకాలం నెత్తినపెట్టుకొని పోషిస్తాడు!"

కూతురువేపు చూస్తూ "మీపెద్దక్క నామాట వింది. మొగుణ్ని పెద్ద యింజనీరు చేసుకుంది. నివ్వూ నామాట విన్నావ్. నీమొగుణ్ణి పెద్ద డాక్టరు చేసుకుంటున్నావ్..." అంటూనే సుందరం దగ్గరగా వచ్చి కూర్చున్నవాడి తల నిమిరి "మన సుందరంది చల్లని చెయ్యి—చల్లని చూపేనమ్మా!!"

ఈమాటలతోపాటు పొందే ఆనందం, చూపే అభిమానం ద్విగుణీకృతం కావటంతో కాంత అక్కడనుంచి మెల్లగా జారిపోయింది.

డాక్టరుగారు మళ్ళీ కుర్చీమీద కూలబడి భార్యవేపు చూస్తూ "నా కెప్పుడూ ఒక్కటింతే వుండేది. నామీగతా అల్లుళ్లంతా పెద్ద హోదాలలో వుండి యీ చిన్నవాడే సుమాస్తాగా వుండటం! వాళ్లూ నివ్వూ కలిసి యింతనుంచివాడిమీద విరుచుకపడ్డారు. చివరకు మిగిలిం దేమిటి? ఎవరు యెంత విరుచుకపడ్డా, లేతసుండైనా సహించాడు. కష్టపడేవాడే చివరకు సుఖపడటం లోకంపోకడ. ఇప్పుడైనా అల్లుడితో మాటాడతావా?"

ఈమాటిప్రశ్నతో సుందరం చెయ్యి మడుకుల మీదనుంచి జారిపోయింది! వరసమ్మ ప్రక్కకు తిరిగి కళ్లు నులుపుకుంటూ ఒక మెట్టు దిగేసరికి చివరిమెట్టు మీద నిల్చొని చెవులు రిక్కించి వింటున్న కాంత అగపడింది.

౯

అల్లుడు మామలు కలసి విశాఖపట్నం వెళ్లారు. కేంపుపలసిన యేర్పాటులన్నీ చేసుకొని తిరిగి వచ్చే

టప్పుడు సుందరం వరసమ్మకోసం, వంటమనిషికోసం చీరలు తెచ్చాడు. వచ్చినరోజు సాయంత్రమే కాంత సినీమాకు వెళ్లే ప్రయత్నంలో వుంది. గదిలో అలంకరించుకొనేటప్పుడు టేబిలుమీద సంపెంగపూలను చూసింది. సింహాచలంసంపెంగలేమో ఘుమఘుమలాడుతున్నాయ్. తలలో పెట్టుకోవాలని వుబలాటం వచ్చినా చాలాసేపటివరకు ముట్టుకోడానికి మనసొప్పింది కాదు. చివరకు యెలాగో ఒక పువ్వు తీసి జడలో పెట్టుకోబోతుండగా అప్పుడే గదిలోనికి వచ్చిన సుందరం "పూజకోసం తెచ్చేపువ్వులు..." అర్ధోక్తిలో ఆపేశాడు. కాంత చటుక్కున తలలో పెట్టుతున్న పువ్వును క్రిందపారేసింది. పారవేసిన పువ్వును చేత పట్టుకొని నిలుచున్నాడు. కాంత రొప్పుకుంటూ అక్కడనుంచి వెళ్లిపోయింది!

ఆవేళరాత్రి చాలాసేపటివరకూ పుస్తకం చదువుకుంటూ కూర్చున్నాడు. కాంతరాలేదు. మేలుకువచ్చాక మున తెలివివచ్చేసరికి లైటువేసి చూశాడు. కాంత గదిలో లేదు.

మూడోరోజు వుదయం స్నానంచేసి మేడమీద పుస్తకం పట్టుకు కూర్చున్నాడు. ఒకభాగం పూర్తిచేసి తలెత్తేసరికి డాబామీద కాంత అగపడింది. జుత్తు ఆరేసుకుంటోంది. ముఖంనిండా యిదివరలా పసుపు రాసుకునివుందేమో తళుకుతళుకుమని మెరుస్తోంది. కాటుకకళ్లలోని మెరుపును ఒకసారి దీక్షగా చూశాడు. ఈవేళ గులాబిరంగు సిల్కుచీర, పల్చని నీలిరంగుజాకెట్ వేసుకొని వుంది. చాలసేపటికి గాని మనసు మళ్లించుకోలేకపోయాడు. కాంతగదిలోనికి వచ్చింది. సుందరాన్ని చూసి మళ్లీ డాబామీదకు వెళ్లిపోయింది. రెండుచేతులూ డాబాపిట్టగోడకు ఆన్చి పడమటివేపు చూస్తోంది.

సుందరం మనసు అదుపులో వుంచుకోలేక పుస్తకం పట్టుకొనే డాబామీదకు వెళ్లి రెండోచివర నిల్చున్నాడు. అప్పుడప్పుడూ ఆమెవేపు చూపు పారేస్తూ చివరకు "ఒకవిషయం చెప్పాలని వుం" దన్నాడు.

"వినాలని లే" దంటూ కాంత గబగబా మెట్లు దిగి పోయింది.

శేషవుదయం సుందరం ప్రయాణం అవగా యీవాళ సాయంత్రమే అన్నీ సర్దుకొని స్నానం చేసి షికారుకని బయలుదేరాడు. పంచెకట్టి, బెంగాలీ షర్టుపై పల్చని పాటినీలుజరీకండువా కప్పుకొని షికారుకు పోదామని మెట్లు దిగుతుండగా రాధ అప్పుడే రావటం చూశాడు. "ఏంవదినా! ఇదేనా రావటం!" అని పలుకరించాడు.

"అవునుబాబూ ....షికారుకా మామ!"... అంటూనే ఆగింది.

ఈ బాబూ అని అలవాటున్నట్లు సంబోధించే చొరవ అట్టే పరిచయంలేని వదిన తీసుకోవటంతో "అవును" అన్నాడు—ఆలోచనగా నవ్వుతూ.

"ఒంటరిగా..."

"పక్కని తోడుతీసుక వెళ్లమంటారా!" నిష్కాపట్యంగానే ప్రశ్నించాడు. ఈప్రశ్న వేసే సమయానికి కాంతా, వరసమ్మ అక్కడకు వచ్చినా రాధ చూడలేకపోయింది.

కాస్త గింజుకుంటున్న వదినవేపు చూస్తూ—

"ఏంవదినా, మనుషులకిలాటి తక్కలే విశ్వాసమైనవి కావూ!"

రాధ తల దించింది. మనసులో వికారాన్ని దాచిపెట్టి వచ్చింది. కాని మరది అనుకోనివిధంగా చొరవచేసుకొనిమాటాడటంతో ముఖంవాడిపోయింది. కాని స్పృహ తెచ్చుకొని వాడినవ్వుతో "నిజంచెప్పారు బాబూ!" అంది.

అంతవరకు యెలాగో అక్కడ నిలుచున్న కాంత చెంగుచెంగున గదిలోనికి పోయింది. "మాటాడండి, వస్తాను" అంటూనే వెళ్లిపోయాడు సుందరం.

ఈవెళ్లేవిధం, చిన్నకూతురు గదిలోనికి వెళ్లిపోయేటప్పుడు అల్లుడు చూపించే వైఖరి వరసమ్మకు తెగులు పుట్టించింది!

కూతురును గదిలోనికి తీసుకపోతూ "ఎంత గతి లేక చేసుకున్నా..." సగంలో మాట మింగుతుంది.

"ఏమైంది దేంటికి!"

"ఇంకేం కావాలె! చిన్నదానితో మాటాడ తాడా యేమన్నా నా! నామీదకూడ విరుచుకపడతాడు! ఏమయినా అంటే మీనాన్నగారికి నేనే చెడ్డదాన్నమ్మా" అంటూ చీరకొంగుతో కళ్లు ఒత్తుకుంది.

రాధ తల్లి వేసే ప్రశ్నలకు, కబుర్లకు మౌనాన్నే ప్రదర్శించింది. శాంత వచ్చి "కబురులేకుండా వచ్చేశావేమక్కా?" అంది. ఈ ప్రశ్నకు జవాబు రాకపోవటంతో నరసమ్మ అందుకుంది: "మనయింటికి రాటానికి కబురుండాలమ్మా! అయినా తప్పు మనది. ఒకనాడైనా రా నాయనా అని అల్లుణ్ని పిలిచారా యేమన్నా నా?"

"పెద్దబావ పిలుస్తే వస్తున్నాడే!"

"బావుందే! నివ్వెలాగైనా మాటాడతావ్— యింట్లో పెట్టుకొని"

అక్క యిలా చెప్పిపోవటంతో శాంత అక్కడ నిల్చోలేదు. రాధ చాలాసేపటివరకు తల్లి చెప్పే మాటలను తల దించి విన్నది. చీకటి పడింది. లేచి చెల్లెలిగదిలోనికి వెళ్ళి లైటు వెలిగించి చూసేసరికి శాంత కుర్చీమీద కూర్చొని తల చేతులమీద ఆన్చివుంది. ప్రక్కనే నిల్చొని "చెల్లీ" అంది. శాంత మాటాడలేదు.

"ఏడుస్తున్నావే!" అంది మీద చెయ్యివేస్తూ. "అబ్బే" అంటూ శాంత తలెత్తింది. కాని ముఖం అక్క వేపు త్రిప్పలేదు. రాధ మెల్లగా కిటికీదగ్గరకు వెళ్ళి నిల్చొని తోటలో వెన్నెలలో చెట్లు మెల్లగా తల లూపటం చూసింది...అలా నిల్చొనే "నివ్వెందు కేడవాలే?" అంది.

ఈ ప్రశ్నలో మిళితమయియున్న భావాన్ని అర్థంచేసుకున్న శాంత లేచి అక్కదగ్గరకు వెళ్లి భుజంమీద మెల్లగా చెయ్యివేసింది! రాధ కొయ్యబొమ్మలా అలానే నిల్చొని వుంది. శాంత ముందుకు వంగి చూసేసరికి అక్కముఖం వల్లబడి వుంది. కళ్లలో నీరు నిండుకొని వున్నాయ్.

"అక్కా" అంది ఆతృతతో. రాధ మాటాడలేదు.

"ఏడుస్తున్నా వేమే?"

"ఏమీ లేదు" చాలాసేపటికి యీమాట లని కంటి రెప్పలను ఆడించింది.

"ఆనాడూ అలానే చేశా వక్కా!" అంది శాంత దిగజారిన స్వరంతో.

"ఏం చెప్ప మంటావే?...బూడిదైపోయినా... ఆపది ఆచారిని వెళిపోతోంటే బూడిద రొంసుకుంటట! ...ఇదేనా వాళ్ల వంశమర్యాద!"

ఆగిఆగి అంటున్నా ముంచుకొస్తున్న యేడుపును అడ్డుకూ యేదో ఆవేశంతో అక్క వెళిపోయింది.

శాంత అలానే నిల్చుండిపోయింది. కిటికీదగ్గర నిల్చున్నదేమో తోటవేపు చూస్తోంది. కొంతసేపయ్యాక సుందరం మెల్లగా తల దించుకుంటూ రావటం చూసింది. వాకిట ఆగాడు. జేబు ఒకసారి తడుముకొని ఒక అడుగు వేసి ప్రక్కకు చూశాడు.

"ఏం వదినా...!"

"ఏంపోయింది బాబూ, వెతుక్కుంటున్నట్టున్నారు?"

"అబ్బే యేమీ లేదు..."

అంటూనే యిద్దరూ గదిలోనికి వచ్చేసరికి డాక్టరుగారు వెనకనే వచ్చారు. రాధను శాంత అనుకున్నారేమో "చిన్నమ్మాయ్" అని పిలిచారు. ఈ గొంతుక వినగానే రాధశరీరం ఒక్కసారి గగుర్పాటు చెందింది. ముఖం చూపించటానికి యెక్కడలేని భయం వేసింది. నాన్న గదిలోనికే వచ్చి రాధవేపు చూసి "నివ్వెంతసేపై వచ్చావమ్మా?...అల్లుడు కూడా వచ్చాడా? ఈవారంలో జిల్లాలో పీలు చూచుకొని నేనే వద్దా మనుకుంటున్నా".

ఈ చివరి వాక్యంతో రాధ మొదటిప్రశ్నలను మరచిపోయింది. నాన్నను తూలనాడిన భర్తయింటికి ఆ జన్మలో నాన్న వస్తారని ఆమె అనుకోలేదు! వదిన తడబడుతుండటం గ్రహించిన సుందరం అన్నాడు:

"సాయంత్రమే వచ్చారు. నేను వెళిపోతున్నాగా

—చూసిపోదా మని. ఆయన కేదో పనుండి రాలేకపోయాడు!"

మరది యీపర్ది చెప్పటంతో తలమీద నున్న యేదో పెద్ద భారం దిగిపోయిం దనిపించింది. కాని నిప్తులోనే, 'చూసిపోదా మని...' మరదిఅన్న యీ మాటలు మళ్ళీ మనసులో దొర్లుకపోగా మామూలు పరిస్థితికే వచ్చింది!

"నీ వ్వెళ్లేటప్పుడు నేనూ వస్తానమ్మా..."

నాన్న యీమాటలు అనేటప్పుడు చేతిలో గాజులు వూడజారుకోవా లన్నంత చిరా కెత్తిందామెకు. నాన్న మరదివేపు మాటలు మళ్లించటంతో అక్కడినుంచి కదలిపోటానికి అదునుదొరికింది.

"చాలా సీరియస్ కేసు. ఆవూర్లో రేపటివరకు వుండవలసివస్తుందేమో! నేను తిరిగివచ్చేసరికి బహుశః వెళిపోతా వనుకుంటాను..." అంటూనే డాక్టరుగారు అల్లుడిభుజంమీద చేయి వేసి మేడమీదకు తీసుకు పోయారు.

భోజనాలు పూర్తయాయ్. డాక్టరుగారు చాలాసేపయింది జట్కామీద వెళిపోయారు. సుందరం గదిలో కుర్చీలో కూలబడి యింటివాసాలవేపు చూస్తూ ఆలోచిస్తున్నాడు. కాంత వచ్చిరావటంతోనే మంచం మీద వాలబడింది. వదినతో మాటాడాలని మనసు పుట్టడంచేత లేచి ప్రక్కగదిలోనికి వెళ్లబోతోంటే ఆమె యెదురైంది.

"రా వదినా" అన్నాడు గదిలోనికి మళ్లీ వెళిపోతూ.

రాధ వచ్చింది. "కూర్చోండి" అంటూ కుర్చీ చూపించాడు. రాధ కుర్చీమీద కూర్చోలేదు. నేల మీద కూర్చోబోతోంటే "అదేంటి వదినా—శ్రీమంతులయింట్లో పుట్టి కటిక నేలమీద కూర్చుంటారు?"

"ఎక్కడ కూర్చుంటే యేం రామంబాబూ!" అంది.

సుందరం యీసంబోధనతో మొగం వేలవేశాడు. ఈ క్రొత్తపే రేమిటి వదినా అని అడుగుదా మనుకుంటే రాధ చప్పున "అయ్యో! మాచిన్నమరది రామంపేరు వచ్చేసింది..."

"ఆయనను 'బాబూ' అని పిలుస్తా రను కుంటాను"

'హాఁ'—తల దించుకొని వున్న రాధ అంది. వదినను నవ్వించా లనే ప్రయత్నంలో వున్న సుందరం వేపు తలెత్తి చూసి పొడినవ్వు నవ్వుతూ "అయితే బాబూ, మానాన్నలా మీరూ రెండుచేతులతో గడిస్తా రన్నమాటే!"

"అలా అని యెందు కనుకోవాలి వదినా! మనం అనుకున్నట్లు జరిగితే యిం కేం కావాలి? నిజం చెప్తాను—నే నెప్పుడైనా డాక్టరు నవుతా నని అనుకున్నానా?"

"ఎవరుమాత్రం అనుకున్నారు? అయినా ఆవేళ రాత్రి నాన్న మీతో ఆడిన మాటలు జ్ఞాపకానికి తెచ్చుకుంటే యెందు కాశ్చర్యపడాలి?"

"ఏంమాటలు? మీ రెప్పుడు విన్నారు?... ఏదో గుట్టు లాగుదా మని చూస్తున్నారేమో!"

"విన్నాను బాబూ! నాగురించికూడ చెప్పారుగా"

"అంతరాత్రిమీద మీ రెలా విన్నారు వదినా?"

"చెప్పనా?"

"చెప్పండి చూద్దాం..."

"ఒక డాక్టరుకు యిచ్చి నన్నే యింట్లో వుంచుకోవా లని వుండేదట—కాని నేమంతా కాకుండా చేశామని—అయినా చిన్నమ్మాయి వుందిగా? అన్నారు. దీనినిబట్టి నే నేం అనుకోవాలి?"

"కాని మీ రనుకున్నట్లు నేను అనుకోలేదు వదినా! చిన్నమ్మాయిమీద ఆశ పెట్టుకున్నా రంటే దానినిబట్టి నే నేం అనుకుంటాను? ఆయనచిన్నల్లుడు డాక్టరు కావాలి. ఆ అవకాశం యీజన్మలో వుంటుం దని అనుకోలేదు. మొన్నటివరకు మీనాన్న

గారు నన్నింట్లో యెందుకు తెచ్చిపెట్టారో చెప్ప లేదు. అంచేత నేను ఒకరిమీదైనా లేని అసహ్యాన్ని తెప్పించుకోవలసివచ్చింది—"

ఈమాటలు ఆగిఆగి అంటూనే శాంతవేపు చూస్తున్నాడు. శాంత మంచంమీద యిటూఅటూ వుండివుండి కొర్లుతోంది! బహుశః ఆమె ఒకనాడు మేడమీదకు వెళ్ళి అడెగా లనుకున్న ప్రశ్నకు సమాధానం దొరికిందేమో!

నోరు ఆవలించి వింటున్న వదినతో మళ్ళీ అన్నాడు: "మీ రన్నట్లు రెండు చేతులతో గడిస్తానే అనుకోండి—కాని గడించే డబ్బు యేం చెయ్యాలి?"

"ఇదేమిటి బాబూ! ఇంత ధర్మసందేహం!"

"అబ్బే! అబ్బే! డబ్బు ఖర్చుపెట్టడంసంగతి కాదు!"

కాస్త గాబరాపడుతున్న మరదివేపు దీక్షగా చూసింది. ఆయనముఖం శాంతివేపు తిరిగివుండటంతో అటు తిరిగింది. శాంత పరుపుమీద చేతితో తల పట్టుకొని వుంది.

"బాబూ! ఒకమాట అంటాను. కోపగించుకోరు కదూ!" రాధ మరదివేపు చూస్తూనే అంది.

"కోపం యెందుకు? కోపమే వుండివుంటే యీఇంటి అల్లుణ్ణే కాకపోయివుందును!"

ఈవిసురు బాణంలా, నిద్ర నభినయిస్తున్న భార్య మనసుకు గ్రుచ్చుకోవటంతో ఆమె లేచి కిటికీదగ్గరకు కుర్చీలాక్కొని కూర్చుంది. సుందరం ఆమెవేపు చూడటానికి వీలుపడకుండా మధ్యను మంచం అడ్డువుంది.

"ఈప్రణయకలహ మెందుకు బాబూ?"

"రాయబారం వచ్చారా వదినా?" అన్నాడు చిన్న నవ్వు నవ్వుతూ.

"నాకు చెల్లదా బాబూ? పెళ్ళికి రాకపోయినా ......"

"రాకపోయినా వచ్చినవాళ్ళకంటే హెచ్చు చేశారు. అప్పుడు మీరు రాసిన వుత్తరం మరచిపోకానా వదినా?"

శాంత యీమాటలు వినగానే గతుక్కుమంది. ఆమెకు వ్రాసినవుత్తరంసంగతికూడ అక్కకు యెత్తుకుందేమో అనుకుంది. కాని రాధ అంది—"అందులో యేం వుంది బాబూ? మీరు చూపిన అభిమానానికి అమాత్ర మయినా..."

"మీ నోటంటే యీమాట వినటం...!"

"అభిమానం కాదూ! పెళ్ళినాడు అంత కష్ట పడ్డారు. అంతకన్నా యెప్పటికైనా మరచిపోని విషయం మీరు చెయ్యలేదా?"

"ఏమిటి వదినా? ఈయింట్లో యెవరూ సరిగ్గా మాటాడరే—అలాంటిది నన్ను పైకెత్తేస్తున్నారు."

"మనస్ఫూర్తిగా అక్షతలు జల్లింది-ముఖంనిండా ముత్తైదువులచేత బొట్టుపెట్టించారు. నేను గర్వించేటట్లు పళ్ళెరాన్ని భోర్లింపజేశాక—ఎలా మరచిపో మంటారు బాబూ?"

సుందరం జబా బియ్యటానికి మాటలకోసం తడుముకొని చివరకు "అదంతా మీ నాన్న చేశారు"

"కారకులు మీరేగా—దానిమాట కేం—మీరు శేవు వెళిపోతున్నారు—ఆలోచించండి బాబూ!"

సుందరం మౌనంగా కూర్చున్నాడు. గదిలో చాలా నిశ్శబ్దంగా వుంది. ఉండివుండి వీచే చల్లగాలి ఆయన ఆలోచనలకు కొత్త జీవం పోస్తోంది—

"నన్నేం ఆలోచించమంటారు?"

రాధ యీ ప్రశ్నకు జబా బీయలేదు. కొంతసే పయ్యాక సుందరం అభిమానపూరితకంఠస్వరంతో "అభిమానానికి ఒక హద్దంటూ వుంది. హద్దు మీరి అభిమానాన్ని జూపించేవారిని లోకం అర్థంచేసుకో లేదు. వాళ్ళని లోకువచేస్తుంది!" కాస్సేపు ఆగి మళ్ళీ అన్నాడు—"మీరు మనస్ఫూర్తిగా అడిగారు కాబట్టి యీమాటలైనా అన్నాను. నేను ఆలోచించవలసింది యేమీ లేదు"

రాధ బ్రతుకంతా యీమాటల్లోనే యిమిడిపోయింది! తప్పులేని తను తొందరపడి యిప్పుడు యింత ఆలోచనలో యెందుకుపడాలి? అసలు కోరికలు ఫలించా

యని హద్దుమీరిన అభిమానాన్ని చూపించబట్టి ఆయన లోకువచేశాడు. లోకంపోకడ మరది చెప్పటంతో తల బరువెక్కి యెక్కడున్నదీ మరచిపోయింది...

"రేపు తెల్లారేసరికి ప్రయాణం! నేను యిల్లు కదిలేటప్పుడు, పోనీ, అభిమానంతో సాగనంపడానికి మీరైనా వచ్చారు!"

ఈమాటలతో ఆమె తలెత్తి చూసింది. సుందరం కళ్లు యేదో బాధతో మండుకపోతున్నట్లగపడ్డాయ్. ఆయన ముఖం ప్రక్కకు త్రిప్పేసరికి లీలగా కనపడే మరదికళ్లల్లో నీరు చూసి లేచిపోయింది. "వస్తాను బాబూ" అంటూనే వెళిపోతోంటే "విడదలచుకొనే దని కసరకుండా మీరైనా విన్నారు" అన్నాడు.

సుందరం యెవరికి వినపడాలనుకున్నాడో వాళ్ళకు స్పష్టంగానే వినపడింది.

సుందరం వాలుకుర్చీమీదే నిద్రపోయాడు. ఒకసారి తెలివివచ్చేసరికి కాంత యింకా కిటికీదగ్గరే కూర్చొనివుంది. పరుపు వేసుకొని పడుకున్నాడు.

వేకువజామున తెలివి వచ్చేసరికి కాంత మేల్కొనే వుంది. సుందరం స్నానం పూర్తిచేసి బట్టలు వేసుకున్నాడు. కాంత కుర్చీమీద చెదరిపోయిన జుత్తుతో కూర్చొని కిటికీ ఊచలగుండా తోటలోనికి చూస్తోంది.

సుందరం ఆమెదగ్గరగా వచ్చి నిలుచున్నాడు. తెల్లవారే సమయంలో వీచే మందమారుతం చెదిరే ముంగురులను చెదరిస్తున్నట్లుగా ఆమెమనసు చెదరసాగింది. భర్తవేపు చూడాలనుకుంది; కాని కంటిరెప్పలు బరువెక్కిపోయాయ్. ఆమె ఆశించినట్లు ఆచల్లనిచేయి తాకటంగాని, అచల్లని పిలుపు వినటంగాని జరగలేదు. సుందరం మళ్లీ వెనకకు వెళ్లాడు. ముందురోజు సాయంత్రం వేసుకున్న బంగాళీషర్టుజేబులో నుంచి యేదో తీస్తుండటం చూసింది!

దగ్గరగా వచ్చాడు. ఆమెయెదురుగా కిటికీదగ్గర బంగారుగాజులజత పెట్టాడు. ప్రక్కకు తప్పుకొని చేతులు కట్టుకొని నిల్చున్నాడు! మెల్లమెల్లగా ఒక్కొక్కమాటా తొణికేస్తున్నాడు...

"నిన్న పీటిని అమ్మలేకపోయాను. ఈ వేళ కొన్న వూరికే మళ్లీ తీసుకవెళ్లి యింకో స్త్రీచేతికి తొడిగించి చరిత్రహీనుణ్ని కాదలచుకోలేదు. ఆవూరు నుంచి తెచ్చిన సంపెంగపువ్వు యెలా విసిరేశావో-అలా విసిరేస్తే విసిరేయవచ్చు—వెళ్తున్నా." తిరిగి వెళిపోతూనే "ఇకనైనా విసవిసలాడకుండా హాయిగా బ్రతుకు!!"

ఈమాటలు అన్నాక సుందరం మళ్లీ గదిలోనికి రాలేదు. బెడ్డింగు పెట్టి గదిలోనుంచి వెళిపోతున్నప్పుడు కూడ ఆమె అటువేపు చూడలేకపోయింది. కాస్సేపటికి అక్కగొంతుక వినపడినా అలా శిలప్రతిమలా నిల్చొని వుండిపోయింది.

సుందరాన్ని సాగనంపుతూ "అక్కడకు వెళ్లాక నేనే వుత్తరం వ్రాస్తాను బాబూ" అంది రాధ. ముందుకు పోయేవాడు చటుక్కున ఆగి, వదిన వేపు చూశాడు. ఆమె కళ్లెత్తేసరికి యింకా సుందరం ఆమె వేపే చూస్తున్నాడు.

"సంతోషం వదినా!" అంటూ యెదురుగ్గా వున్న జట్కాదగ్గరకు పోయాడు. రాధ ముందుకు మూడే అడుగులు వేసి ఆగిపోయింది.

కిటికీగజాలు గట్టిగా పట్టుకొని చూస్తున్న కాంత ఆ చల్లనిచూపుకోసం తహతహలాడింది. ఆమెకళ్లల్లో దురుసుపడ్డది మరుని భావాల బాధ కాదు—ఏదో తెలుసుకోలేని బాధతో మండిపోతున్న మనసుకు కళ్లకు జట్కా మెల్లగా పోతున్నట్లు అగపడటంతో కాళ్లు ఒక్కసారి వణికాయ్. కిటికీమీద గాజులజతను గట్టిగా పట్టుకొని కుర్చీమీద కన్నీటితో కూలబడింది.

---

# మధురస్మృతి

●

శ్రీ కే. అన్నమరాజశర్మ

ఎన్ని యుగాలనుండి వహియించితి నీ ప్రణయైకదీక్ష, యిం
కెన్నిదినమ్ము లీవ్యథ దపించుచు బాష్పకణమ్ము లూర్తు నో
అన్నులమిన్న! నీకయి శతాధికజన్మలనైన దాల్తు, నా
ఖిన్నత దెల్ప నీవిరహగీతిక బాడితి నాత్మసాక్షిగన్.

నీలవలీకపోలముల నిర్జరదుర్లభమాధురీఝరుల్
కాలువగట్టు, తావకముఖద్విజరాజమునం బ్రసన్నతల్
జాలులువారు, మంజులవిశాలవిలోలవిలోచనమ్ములన్
శ్రీలు జనించు! బల్కుటకు సిగ్గులుగా బ్రణయప్రసంగముల్.

దూరమునుండి సంస్మరణ దోచెడి నీదు ముఖేందుహాసముల్
భూరితమోంతరాళమున మున్గిన నా కమృతప్రరోచు లే
తీరున విప్రయోగజలధిం దరియింతు వివిక్తతన్? భవ
చ్చారువపుస్సుగంధములు సౌరసమీరములై స్ఫురించెడిన్.

చూపులకు జూపు లర్థవిస్ఫురణ గూర్ప-నిరువురకు మధ్య నితరు లూహింపరాని
రమ్యలజ్జామనోరమప్రకృతి దోచె; - మధురతమములు ప్రణయసంస్మరణ లెపుడు.

కాల మెందాక నీడ్చు నాకాయ మంత దాక, నీప్రేమమూర్తి నేత్రముల దోచు;
అస్ఖలితమైన యీ రహోధ్యానమందు-పవలు రేలకు భేద మేర్పడదు లలన!

స్వప్నసదృశ మీ దృశ్యప్రపంచయాత్ర-అనుచు వేదాంతి యెవడో మిథ్యగ వచించె,
అనునిమేషప్రభూతదుఃఖానుభూతి-నాకు సత్యంబ! యీయాతనాజగమ్ము.

కర్మదోషంబె న న్నీయగాధజలధి-గూలద్రోసె నాశాలతల్ తూలిపడగ
అక్క లూడ్చిన విహగమ్ము రీతి నెందొ-చీకటుల బుత్తు జీవితశేష మింక.

పడతీ! తెల్పగరాని యీ ప్రణయసంబంధమ్ము లీరీతి న
గ్గడవన్ రాని వియోగశైవలిని దుఃఖస్నాతునిం జేసె, నే
ర్పడు నే మంచి యుపాధి జీవిక కిలన్ బ్రాక్కర్మచేగాక! కా
రడవిం గాచిన వెన్నెలల్ బ్రతుకు లిష్టావాప్తి జేకూరమిన్.

---

# విశ్వరూపము

శ్రీ కే. వెం. నృ. అప్పారావు

ఈ విశాలభూస్థలి నొక యిసుకరేణు
వగుదు నేగాక నా కేల వగపుఁ జెంద;
విశ్వమంతయుఁ గదలించు విపులశక్తి
అణఁగియుండఁగ లేదె నా యణుతయందె!

తుంగభంగాళిసంకులతోయరాశి
నెగురు నొక శీకరంబనే యగుదుఁగాక
అబ్ధితాస్థితి నఖిలధరాండ మెపుడు
అలల పొత్తులలోఁ బ్రోచు వలఁతి నేన!

ఆ యనంతమహావినీలాంబరమున
మెఱయు చెమ్కీలలో నొక్క మిణుకు నేను
గాని నా నిజరూపంబు గాంచునపుడు
కోటిసూర్యులు నాకు మిణ్గురులె చూవె!

ఆకుబైటను బ్రియుతో విహారకలనఁ
గూడి చరియించు యువతిముంగురుల నల్లఁ
గదిపి యేఁగడు చిఱుగాలి కరడు నేనె
తఱిని గడఁగి ప్రభంజనత్వంబు దాల్తు!

హీనకంఠస్వరంబున మానవులను
దేవురింపఁగ నా కేల దీనతమెయి
ఆత్మశక్తిని బరికింప నఖిలభువికి
విశ్వసంగీతమున్ వినుపింతు నేన!

అణువుకంటెను నణువునై యణఁగిమణఁగి
యుంటి నైనను నన్నిటికంటె మించి
వెలయుగాను నేనె యనుచును దెలివిగలుగ
విశ్వరూపంబు నాలోన వేగఁ దోఁచె.

---

# అర్ధంగాని మార్పు

[కథానిక]

●

శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ

తగూలు రాకటానికి వీల్లేదు, 'ఇంటా - బయటా' కూడా. ఎందువల్లనంటే, యింటి కెదురుగ్గా ప్లీడరు గారు, ప్రక్కింటి వాటాలో పోలీసాయన. ఇవన్నీ ఆలోచించే యిల్లు మారటం జరిగింది. ఇదివరకు మే మున్న యింట్లో హోరాహోరిని అస్తమానం మొగుడు పెళ్లాలమధ్య కీచులాటలు జరుగుతూండేవి.

ఏమీ లేదు. ఆయన అవునన్న దానిక 'కాదు' అంటుంది. ఆవిడ కాదన్న దాన్ని, ఒకప్పుడు గాకపోతే ఒకప్పుడన్నా, మొగముండావాడు కాబట్టి అవుననవలసి వచ్చేది ఆయన.

దాన్తో ఆయింట్లో కొంపలంటుకుపోయేవి. భోజనాలదగ్గర - పనివేళా రెట్టిస్తూ.

'నేనడిగింది నువ్వేశావు కా'వంటాడు అతను.

'నేను వేసింది మీరు తిన'రంటుం దామె.

'నేనడిగింది నువ్వెందుకు వెయ్యవే భామా!' అని తలకాయాడిస్తాడు ఆ పెద్దమనిషి.

ఆ చిన్నమనిషి-'నేను వేసింది ఏం మీరెందుకు తినరండీ?' అని నడ్డిమీద చెయ్యి ఆన్చి అంటుంది.

'నారుచి నాది - నీరుచి నీది.' అంటాడతను.

'మీరుచి నాకు తెలీదా?' అని వెక్కిరిస్తుంది.

అతను కంచం కదపడు. ముద్ద కలిపి నోటి కెత్తడు. కాస్సేపు కంచంలో నిండుకుని వున్నటువంటి భక్ష్యాలను పర్యావలోకన చేసి చూపుకు వేలాడిస్తూ-'ఈపచ్చడి నీ కిష్టమనుకుంటాను.' అంటే ఆమె 'మీ కీపచ్చడిమొహం తెలుస్తేగా - తినకుండా వంక లెన్నితే ఎట్లా?' అని నోటి మెటికలు విరుస్తుంది.

'నాకిష్టమైంది నీ వెప్పుడైనా చేశావుగనుకనా' ఈ ప్రశ్న కావిడదగ్గర సీలువేసిన అన్సరు సిద్ధంగా వుంటుంది. తడుముకోకుండా - 'మొన్న వంకాయ బజ్జీపచ్చడంతా కాజేసిం దెవరో?' అంటే - 'ఎలక - లిట్టెలక' అంటూ అతను అన్న దానికి 'సిగ్గు లేకపోతేసరి మొహానికి. చేయించుకుని తిని నువ్వేం చేశావని అడగటానికి? ఇంకా యిటువంటి విశ్వాసఘాతపు కూతలు కుయ్యటానికి?' అని ఎదురెట్టిస్తుంది.

దీన్తో నిప్పు రాజుకుంటుంది తిన్నగా. వంకాల మీదకు పేరుపేరు వరుసనా అక్షతలు జల్లటంతో యుద్ధకాండ ప్రారంభమయ్యేది.

'త్వం శుంఠ.' అంటే 'త్వం శుంఠ' వరకూ సంగరం హంగుగా సాగేది.

పర్యవసానం—ఆయింతి గొంతుక బొంగురెత్తేలా వంశక్రమానుసరించి తిట్లు చెరగడం, చెరగ్గా చెరగ్గా ఆ మగప్రాణికి వేడిపుట్టి ప్రాణం విసిగి నెయ్యికేసుకోవటం, అర్ధరాత్రప్పుడు ప్రక్కవాటాలో కాపుర మున్న మర్యాదస్థులకు సుద్దులు వినిపించడం, అపిమ్మట సన్నటిమూలుగు, కొంచెంసేపటికి చెప్పులజోళ్ల చప్పుడు, తరువాత తలుపు ఘడీల్మంటూండగా అరమణీలలామ ముద్దులకు సుద్దులకు తప్ప 'సుద్దుల కింతులోర్తు రా! కృపారహితాత్మక' అని తిట్టుకుంటూండగా పొరుగువాళ్లకు 'రాకానిశా రాజశ్రీసఖమైన మోమున బటాగ్రం బొత్తి యొత్తి యూరాజీవానన యేడ్చె' నిన్నరాత్రి అని తెల్లవారాక చెప్పుకోవలసివచ్చేది.

ఇవన్నీ పడలేక యిల్లు మార్చేశాను. ఇంకో భయమేమిటంటే సహవాసదోషంవల్ల మేము కూడా కొద్దో గొప్పో తగూలాడుకోవటానికి అలవాటు పడ్డా మనే చెప్పాలి.

ఈ అనర్థాలన్నీ యింటిపోరువు మంచిది కాక పోవటంమూలాన. ఇప్పు డాభయం లేదు. ఐనా అను మానం పీకుతూనేవుంది.

ఓమూడురోజులవరకు అక్కడ సామానిక్కడ, యిక్కడ సామా నక్కడ సర్దటంతో జరిగి పోయింది కాని ఎందులోనూ మధ్య కొంకరి కొక్కు చిన్న పేచీ గాని, వాగ్వాదంగాని వచ్చివుండలే దని సంతోషిస్తూనే వున్నా.

ఈ తగూలు తంపులు లేకుండా ఏ మొగుడూ ఏ పెళ్ళాంతోనూ కాపురం చేసివుండడు. ఐతే ఒక ప్పుడు చెయ్యటాని కవకాశ ముంది. అందులో ఒకరు మూగీ, రెండవవాళ్లు చెముడూ అయినప్పుడు. ఐతే నవ్యులు, ప్రాచ్యులూ కూడా ప్రణయంయొక్క క్లైమాక్సు కలహంలో వుందని వప్పుకోవటంవలన—సుమతీ శతక కారుడుకూడా 'తలయంటిన నాటినిద్ర, ప్రణయకలహం నాటిరాత్రి' అంటూ శుక్రవాళ్లకు నీతులు చెప్పటంలో వప్పుకోవటం వలన - లేకేమంటే ఆటలాడి ఆటలాడి అలిసిన తరువాత ఆ ఆకలికి గడ్డిపెట్టినా పర మాన్న మనుకొన్నట్లుగా మనుష్యులు ఆలితో కల హించి ఏకత్కలహాంతమందు మొహంవాచినట్లు గడిపి ఆ అనుభవాన్ని గొప్పదిగా పోల్చి చెప్పుకున్నా రేమో అని.

ఐతే నామట్టుకి నాకు పుస్తకాలు, అడ్డమైన వాళ్ల అభిప్రాయాలు ఆధారంగా చేసుకోవలసిన అవు సరంలేదు. ఒకప్పుడు దుర్గే నాకు పదిమంది మేనకలు, పావుడజను శూర్పణఖల పెట్టు అనిపిస్తుంది.

దుర్గతో చాలామాట్లు కలహించాను. దుర్గ నాతో కలహించింది. ఐనప్పటికీ ఏది ప్రణయకలహమో ఏది మామూలు కలహమో, ఏది ప్రళయకలహమో తెలు సుకోవటానికి నామట్టుకు నాకు దుర్గమంగానే వుంది, అప్పటికీ యిప్పటికీ.

ఈలోపుగా ఒక రికార్డు తయారుచేశాను. అందులోవరుసగా తేదీవారీని తగూలను చిట్టాలో కెక్కి స్తూవచ్చాను. ఐనప్పటికీ ఏది ప్రణయకలహ మనాలో ఆదైనం తెలిసిరాలేదు. ఈ లోపుగా యిల్లుమారాం.

౨

దొడ్లో జామిచెట్టు. ఆ పక్కన పుత్రంగా నుయ్యి. నూతిలో కొబ్బరిబొండాల్ని మించిన రుచి గల ధార. స్నానాలగది. ప్రత్యేకంగా వంటకు భోజ నాలకు పెద్దగది. నూతిదగ్గరంతా గచ్చుమయం; రవ్వంత యిసకకూడా కాలి కంటదు. విద్యుద్దీపాలు. అంతగా కావలిస్తే ఓరెండు బిందెల నీళ్లు తెచ్చుకోవచ్చు త్రాగ టానికి. వీధిలో ఎదురుగుండా పంపు.

ఈ యిల్లు చూడగానే దుర్గమొహం గంపంతై కూర్చుంది.

దొడ్లో వంటిల్లు గాకుండా వరసాగ్గా మూడు గదులు - గదికి మూడు కిటికీలు, ఒక అలమారచొప్పున వుండగా యిన్నిహంగుల్తో ముప్ఫైరూపాయల అద్దెకు యింత యిల్లు వస్తూండగా దుర్గ సుఖపడటంలో ఆశ్చర్య మేమిటి? సుఖపడగలదని నేను నమ్మాను. ఏ మొగుడు ఏ పెళ్లాన్ని ఇంతకన్నా సుఖపెట్టగలడు? ఈగర్వంనాలో క్రొత్తగా ప్రవేశించింది—దాంపత్యమంటే భార్యా భర్త లొకరొన్నొకరు ఎంతవీలైతే అంతగా సుఖపెట్టు కోవటమనే తాత్పర్యంతో. ఆయింట్లోంచి సామాను కదిల్చి యిక్కడకు తేటం - ఆసర్దనంతా సణిగి యిల్లు మామూలుధోరణికి రావటానికి వారంరోజులు తీసుకుంది.

ఇంట్లో వున్నంతసేపూ ఆవిడగారు తనుచేసే ప్రతిపనికీ నాసలహా తీసుకుంటూనే వుంటుంది.

ఒకమాటు-'పొయ్యి ఎక్కడ పెయ్యమంటా'రని అడగవచ్చింది.

ఏదో చెప్పి పంపాను.

'నాకు కుర్చీపీట ఎక్కితే కళ్లు తిరుగుతాయి. కాస్త వుట్టి కొట్టిపెట్ట మంది. తను మేకూ రాయీ అందిస్తే వెళ్లి ఆ వుట్టి కాస్తా కొట్టాను. అంతలోనే నేను తలకు మాని రాసుకుంటూ వుండగా వచ్చి - 'కొంచెం బొగ్గులబస్తా సాయంపట్టండి - నేనొక్క త్తినీ మొయ్యలేను' అంది.

నేను చెయ్యనంటే 'యిదంతా ఎవరికోసం? ఈ సంసారం నా ఒక్కర్తిదేనా' అంటుందని వెళ్లి వొళ్ళంతా మసిచేసుకున్నాను.

స్నానం పూర్తయ్యేసరికి నాలుగు సబ్బు బిళ్లలు బట్వాడాఅయి, యింకా ఏదన్నా మిగిలివుంటే రుండుకుడ్డ వంటిపెట్టుకు పోయింది ఆకాస్తా. ఆ వాసన నాచేత యింకా దండెం బట్టలారేసుకుందుకనీ, గోడని రాములవారి పటమనీ, మధ్యగదిలో రాసక్రీడ, జలవిహా

రం, మన పెళ్ళిఫోటో అంటూ ఓవరసని పనులన్నీ పురమాయించింది.

కొమ్ములు దిరిగిన మగరాయుళ్ళ చేత పట్టిచాకిరీ చేయించుకోవాలంటే అది ఒక్క ఆడదాని హాస వీక్షణకటాక్షాదులవల్లనే అవుతుంది.

తను తల దువ్వుకోలేదు. శుభ్రమైన చీర గట్టుకోలేదు. అస్తమానూ ఏదో పని అక్కడిదిక్కడ యిక్కడి దక్కడ సర్దుతూనే వుంది.

ముందర వంటిల్లు, సామానుగది, తరువాత పడగ్గది, ఆఖర్న నాగది సర్దుతానని ఓ ప్రణాళిక సిద్ధపరిచింది.

నేనన్నిటికీ ఒప్పుకోవటంచేత ఏ పేచీ రాలేదు. పూచీ వుంటే పేచీ వస్తుందిగనుక. చెప్పినది శిరసావహించటమే కాని సాహంతరంగా నేను ఆవిడవ్యవహారాల్లో జొరబడలేదు. ఎందువల్లనంటే 'క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్'—ఎట్నుంచి ఎటు తిరుగుతుందో! సుకుమారమైన మనస్సులాయె! అని వూరుకున్నా.

3

ఒక వేదాంతి యీపాట చేర్చాడు.

'ఏది ప్రళయం ఏది ప్రణయం?
ఏది సరసం?
ఏదివిరసం?
ఏది రాగం? ఏది క్రోధం?'

తరువాత నేను మొదటిచరణం మార్చి వ్రాసుకున్నాను. 'ఏది కలహం? ఏది ప్రణయం?' అని. ఈపుస్తకంలోనే మొదట్నుంచీ (అంటే కాపురం మొదట్నుంచి) తగూ నంబరు వన్, టూ, త్రీ- అంటూ వివరాల్తోసహా కలహాలు రికార్డు చేశాను.

ఇది నా కాన్ఫిడెన్షల్ రికార్డు. దుర్గ కివన్నీ తెలిస్తే? పుస్తకం విరిచి నేను లేనప్పుడు పొయ్యిలో కుక్కేస్తుంది. మళ్లీ అదో పెద్ద తగూ క్రింద మారచ్చు. ఆవివరాలన్నీ రికార్డు చెయ్యటానికి వీల్లేకుండాపోతే పురాతనప్రణయ శిథిలశాఖకు పరిశోధన కష్టమవుతుంది. ఇప్పుడు పురాతత్వవస్తుపరిశోధనశాఖలకుమల్లేనే భవిష్యత్తులో పురాతనప్రణయతత్వపరిశోధనశాఖ ఏర్పడవచ్చు. అప్పటికి రికార్డంతా శాసనాలమాదిరి వుపయోగపడొచ్చు. ఈపురాతనప్రణయతత్వపరిశోధనకు పాళీభాష తెలిసిన పండితులక్కర్లేదు. వాత్స్యాయనుడి కామసూత్రాలు, కామరూపవిద్యలు అభ్యసించిన వాళ్లు దొరక్కపోయినప్పటికీ పదిపదిహేను పెద్ద పత్రికలు తుణ్ణంగా లోపలిఅడ్వర్టయిజ్‌మెంట్లతోసహా వల్లెవేసి అప్పచెప్ప గలిగినవారుంటే చాలు.

ఆఉద్దేశంతోనే తగూలన్నీ అనలైజు చేసుకుంటూ మనస్తత్వశాస్త్రసిద్ధాంతాలప్రకారం వ్రాసుకొచ్చాను.

నేనింత గొప్పపని చేస్తున్నానని చెప్పినా మాదుర్గ నమ్మదు. చెప్పకపోవటమే మంచిదిగాని ఒకవేళ తెలిస్తే నానాగొడవా చేస్తుంది. ఈ యిల్లు మారటం సందర్భంలో ఆపుస్తకం పోతుం దన్న భయంతో భద్రంగా సంరక్షించుకుంటూ వచ్చాను. ఎంత జాగ్రత్తగా రక్షించుకుంటూవచ్చావంటే యిప్పుడు నే నాపుస్తకం ఎక్కడ జాగ్రత్తచేశానో మర్చిపోయేటంతగా. ఆపుస్తకంకనపించకపోయేసరికి నాగుండెల్లో రాయిపడినట్లయింది. పుస్తకం పోతుందేమో అన్న విచారంకన్నా దుర్గ చూస్తుందేమోరా భగవంతుడా అన్న విచార మెక్కువైంది.

దుర్గ చాలా నెమ్మదస్తురాలు. మంచిపనితనమే గాకుండా, మెళుకువ, చెపితేసుళువుగా గ్రహించుకోగల తెలివి అన్నీ వున్నాయి. కేవలం భర్తఅనేగాకుండా ఒక చదువుకున్నవాడు మరొక చదువుకున్నవాణ్ణి గౌరవించినట్లుగా గౌరవించేది నన్ను.

మేం వచ్చిన వారంరోజులకు దుర్గకు [illegible]రుగా రమ్యాత్రయి ఇందిరతో బాగా పరిచయమైంది. నేనాఫీసుకెళ్లినప్పుడు దుర్గ ఇందిరతో కాలక్షేపం చేసుకునేది. ఒకరోజున నేను సాయంత్రం కాఫీకని వచ్చినప్పుడు 'యివ్వాళ వాళ్ల యిందిరతో మీటింగు కెళ్తానండీ.' అంది.

'సరే వెళ్లు' మన్నాను.

ఇది జరిగినతరువాత మూడురోజులకు తను కూడా స్త్రీసమాజంలో మెంబరయినట్లు చెప్పింది. మూడునెల్ల అనంతరం నన్ను కూడా మీటింగుకు రమ్మని పిలిచింది.

'నేను మరి ఆడదాన్ని కానుగా?' అన్నా.

'అయ్యో! ఈ మీటింగుకి మగవాళ్లు రావచ్చుగా' అంది.

'ఐనా నువ్వు పిలవడమేమిటి? ఎవళ్ళు మొగుళ్ళను వాళ్లే పిల్చుకుంటే-అదెక్కడి పిలుపు. నువ్వు పిలిస్తే నేను రాను.' అని తేల్చాను.

దుర్గ చాలాసేపు ఆలోచించి--

'అవును, నిజమే సుమండీ మీరన్నది.' అని వాళ్ళ యిందరను పిల్చుకొచ్చింది వెళ్లి.

ఆఅమ్మాయి 'మీరు తప్పకుండా రావాలండీ' అంది గట్టిగా.

'అయ్యో! ఎందుకు రాను. తప్పకుండా వస్తాను.' అన్నా.

ఆవాళ మధ్యాహ్నం యింటికి రావద్దనీ,తిన్నగా ఆఫీసు వదలగానే స్త్రీసమాజభవనానికి రావలసిం దనీ చెప్పి-'ఒస్తారుగదూ! వస్తానని ఒట్టువెయ్యండి.' అంది.

'అక్కడికి వచ్చి నీ పేరు చెబితే సరిపోతుంది గదూ'అన్నా.

'పోండి. మీ కంతా వేళాకోళం.' అంది దుర్గ.

'ఐతే, యింత యిదిగా రమ్మంటున్నావు, ఇవ్వాళ విశేష మేమిటి?' అన్నా.

'సమితి స్థాపించినరోజు. రాత్రికి నాటకం కూడా వుంటుంది.' అంది మెల్లగా. 'అహా!' అని తల వూచాను.

౪

ఆఫీసు వదలగానే స్త్రీసమాజాని కెళ్లాను.

నాకుమల్లే ఆహ్వానింపబడ్డ మిత్రులు కొంద రక్కడ తచ్చాడుతూవున్నారు.

తరువాత తెలిసింది—'టికెట్లు' వున్నాయనీ, అవి కొన్నవాళ్లకే లోపలికి ప్రవేశం లభ్యమనిన్నీ.

'అరె! నా కీ సంగతి చెప్పింది కాదే దుర్గ. మరిచిపోయుంటుంది' అనుకున్నా.

చాలామంది ఆడపిల్లలు ముత్తైదువులు ముసలమ్మల్తోసహా లోపలికి జొరబడ్తున్నారు. ఈబయట మా కీ అఘోరిం పేమిటా అనుకుని కొంతసేపు నిదానించి 'అన్నా! మనకు తెలిసిన ఆడపిల్ల వుంటే ఎంత బాగుండిపోను' అని ప్రతివాడూ అనుకోసాగాడు.

నేను చూస్తూ వుండగా ఓ చిన్నకారు వచ్చి ఆగింది. ఆ కారులోంచి ముగ్గురు యువతులు చేతుల్లో సంచీల్తో దిగారు. వాళ్లని లోనికి తీసుకుపోవడానికి ఓ వాలంటీరు వచ్చింది. నే నాఅమ్మాయిని సమీపించి 'ఫలాని దుర్గ అన్న ఆవిడకు కొంచెం కబురు చేస్తావా?' అన్నా.

'ఎవరు? దుర్గా...ఎట్లాగుంటుందో కొంచెం చెప్పండి.' అంది వాలంటీరు.

అన్నా! నాభార్యను నేను వర్ణించవలసిన పరిస్థితి ఏర్పడిందిగదా అనుకుని—

'పొట్టిగా— చామనచాయరంగు. మొన్ననే కొత్తగా చేరింది.' అన్నా.

'అబ్బే—అది కాదండీ. ఏ చీర కట్టుకుందో, ఎట్లా జడ వేసుకుందో కొంచెం గుర్తుచెబితే చాలు' ఆ వాలంటీరు తొందరపడుతూ—

'పోనీ, కళ్లజోడుందా ఆమెకు?' అంది.

'అయ్యో, సోడాబుడ్డికూడాలేదే' అన్నాను చివరికి. ఆ కారులోంచి దిగిన ముగ్గురు యువతులూ చురచుర చూశారు నావంక.

ఆ వాలంటీరు 'ఉండండి వస్తా' నని వాళ్లని లోపలకు తీసుకెళ్లింది.

ఇంతకీ కర్మం! నే నారోజు దుర్గ ఏచీర కట్టుకుందో, ఏరవిక తొడిగిందో చూడవన్నా చూడలేను. ఇంతలో ఆ అమ్మాయి వచ్చి 'ఏదుర్గ? ప్లీడరుగారమ్మాయి చేర్పించింది - ఆమేనా?' అని నన్ను మళ్లీ అడిగింది.

'అవునవును.'

నాప్రాణం లేచివచ్చినట్లయింది యిట్లా అడిగే సరికి.

'ఆమెను మీ రిప్పుడు కలుసుకోవటానికి వీల్లేదే'

'ఏమన్నా అంత నేను కలుసుకోవటానికి వీల్లేని పరిస్థితుల్లో వుందా?' అన్నా సందేహిస్తూ.

'అయ్యో! గ్రీన్ రూములో వున్నారామె' అంది వాలంటీరు. అని, కొంచెంసే పాగి -

'మీ కామెతో పనా?' అంది.

'అవును' అన్నా.

ఆ వాలంటీరు నవ్వి - 'మీరు గ్రీన్ రూములోకి వెళ్లటానికి వీల్లేదు. అక్కడ ఆడవాళ్లు వేషాలేసుకుంటున్నారు. ఐనా మీరు లోపలికి వచ్చి కూర్చోండి. నాటకం ఐపోగానే ఆమెతో మాట్లాడొచ్చు.'

నేను ఆ వాలంటీరు వెనకాతలే వెళ్లి స్టేజి కెదు

రుగ్గా వున్న కుర్చీలో కూర్చున్నాను. ఆ వాలంటీరు మళ్లీ వచ్చి - 'మీ పేరు?' అంది.

'ఇదేమిటి చెప్మా - వెళ్లిపొమ్మనదుగదా' అను కుంటూ చెప్పాను.

ఒక రసీదు పుస్తకంలో నా పేరు వ్రాస్తూ 'మీరు విరాళ మెంత వెయ్యదల్చుకున్నారో చెప్పండి దయ చేసి.' అంది వాలంటీరు. 'అదికూడా నువ్వే వ్రాయి!' అన్నాను పొల్లుమండి.

ఆ వాలంటీరు నవ్వి- 'నా అంతట నేను రాలేదు. దుర్గ వెళ్లమన్నారు. ఆతరువాత మీ యిష్టం' అంది.

'డబ్బు ఆవిడ యివ్వాలా? నేనే యివ్వాలా?'

'మీ పేరు మీదే వ్రాయమన్నారు చీటీ'

ఆ వాలంటీరు చేతిలో ఐదురూపాయ లుంచి రసీదు పుచ్చుకున్నాను.

నాకు దుర్గమీద చాలా కోపమొచ్చింది. నన్ను ఆహ్వానించి యిక్కడకు వస్తే నా అతీ గతీ చూడ లేదు. తీరా నాఅంతట నేను లోపలకువచ్చికూర్చుంటే తగుదునమ్మా అని ఐదురూపాయలు వదిల్చింది తను- యీ డబ్బు కరువుదినాల్లో.

తనేమో నాటకంలో వేషం వెయ్యటానికి వెళ్లింది. ఎవర్నడిగింది?

ఈలోపం వకటి దుర్గలో ఖణీగా కనుపిస్తూవుంది. తను చేసే ప్రతిపనికీ నా ఆమోదం వుండాలా, అక్కర్లేదా? మీటింగులకూ పుస్తకాలు చదువులో డానికి వెళ్లమన్నాను గాని నాటకాల్లో వేషా లెయ్యడానికీ, తన యిష్ట మొచ్చినట్లు గెంతటానికి చేరమన్నానా స్త్రీ సమాజంలో.

వాలంటీరుని పిలిచి దుర్గ నడిగి తాళాలు తెచ్చిపెట్టమని కోరాను.

వాలంటీరు తిరిగివచ్చి 'మిమ్మల్ని వెళ్లవద్దంటు న్నారు. ఇప్పుడే అరగంటలో కార్యక్రమం ప్రారంభ మవుతుంది.'

'తాళం చెవులమాటో...' అన్నా.

'ఇవ్వ లేదు.' అని వాలంటీరు వెళ్లిపోయింది.

నేను లేచి చరచరా నడిచి యివతలి కొచ్చే స్తుండగా గేటుదగ్గర వాలంటీరు-

'వెళ్లిపోతున్నారేం' అంది.

'విరాళ మివ్వడం అయిందిగా.' అన్నా కోపంతో. ఆ వాలంటీరు వెంటనే లోపలకు పరు గెత్తింది. రసీదు నలిపి నేలకేసి కొట్టాను.

※

తిన్నగా పార్కులోకి పోయి బల్లమీద కూర్చుని ఎప్పుడు మీటింగవుతుందా, ఎప్పుడు దుర్గ వస్తుందా అని నిముషాలు లెక్కపెట్టసాగాను. రేడియో నోరు పడిపోయినతరువాత ఆపార్కులో యిక అట్టే సేపు కూర్చో బుద్ధివెయ్యలేదు.

ఎదురుగుండా వున్న హోటల్లోకి పోయి కాఫీ నోట్లో పోసుకుని సిగరెట్టు కాలుస్తూ పదకొండింటి వరకూ గడిపాను.

ఈలోగా నాకనేకమంది దేవుళ్లు, కవులు, మహాభక్తులు, దేశనాయకులు కన్పించి 'జాగ్రత్త! ఆడవాళ్లను నమ్మకూడదుసుమా!' అని నన్ను హెచ్చరించినట్లైంది.

'అంగన నమ్మరాదు తన
  యంకెకు రాని మహాబలాఢ్యు వే
భంగుల మాయలొడ్డి చెరు
  పం దలపెట్టు వివేకియైన పా
రంగధరుణ్ పదంబులు క
  రంబులు గోయగజేసె తొల్లి చి
త్రాంగి యనేకమల్ నడువ
  రాని కుయుక్తులు పన్ని భాస్కరా!'

ఏమైనా, చెప్పటానికి వీల్లేనటువంటికుయుక్తులో సుయుక్తులో పన్ని తాము పట్టిన కుందేటికి మూడే కాళ్లనిపించుకోవటంలో ఆడవాళ్లదే అగ్రతాంబూలం. ఎట్లాగైనా యిహనుంచి కొంచెం జాగ్రత్తగా వుండా లనీ, ఆడవాళ్లమాట కాతరీచేయకుండా వుండాలనీ తీర్మానించుకున్నాను. శివోకు యోగి అయ్యాడుగాని వేమన ఆడవాళ్లతో ఎంత విసిగిపోకపోతే—'మాట వినని యాలు మగనికి మరగాలు' అని వాపోతాడా?

ఆకలి 'రంయ్ రంయ్' మంటోంది కడుపులో. తరువాత, యిల్లాలు తాళం చెవులివ్వటానికి,ఆగ్రహించి నిలువ నీడ లేకుండా చేసింది. మూడోది నిద్ర ముంచు కొస్తోంది. లేచి, చీకట్లో యింటిదారి పట్టాను. నేను వీథిమలుపులో కొచ్చేసరికి దుర్గ ఒక్కత్తే చరచర నడచి వెళ్తోంది. ఆవిడ గర్గే! ఎందువల్లనంటే ఆచీర నేను కొన్నది. ఆ కొనటంలో ఒక చిన్న రద్ధాంతం జరిగింది.

పుట్టిన రోజుకి తనకు ఆనందకలరు కోయంబత్తూరుచీర కావా లంది.

'ఇంకా పుట్టినరోజేమిటి నీకూ - నాకూ-' అన్నా. ఎందువల్లనంటే అప్పుడు నెలాఖరు. డబ్బుకి అప్పు చెయ్యటం యిష్టం లేదు.

'ఏం ? ఎందుకు చేసుకోకూడదూ ?'

'బీదవాళ్లకు పుట్టినరోజు లేమిటి ? '

చాలాఆశ్చర్యపడి-'మనం బీదవాళ్లమా?' అంది.

'ఎందుకు కాము ? చక్రవర్తుల మనుకొంటున్నావా ?'

'అట్లాగా-' అని వూరుకుంది. అప్పుడు నేను కూడా నోరు మూసుకొని పడివుంటే సరిపోయేది. అట్లా వూరుకోక- ఒక చిన్న వుపన్యాసాన్ని దంచాను.

గొంతు సవరించుకుని—'చూడు దుర్గా! ఇప్పుడు మన దేశంలో, అంటే యీ అఖండభారతావనిలో తిన తిండి, కట్ట గుడ్డ, వుండ యిల్లు లేక ప్రాణికోటి అల్లాడిపోతూవుంటే, తుపానులు చెలరేగి పాడిపంటలు, పశువులు, దొడ్లు, యిళ్లు, వాకిళ్లు హరోహరి! రామార్పణ మయిపోతూవుంటే యింకా పుట్టినరోజు లనీ, కోయంబత్తూరుచీరలనీ వినోదాలకు విలాసాలకు ఖర్చు పెట్టమనటానికి నీకు నోరెలా వచ్చింది?'

దుర్గకు చాలా కోపము, రోషము వచ్చింది. ఐతే చేతిగాని కోపం, రోషం క్రియగా మారటానికి బదులు స్త్రీలలో వుడుకుమోతుతనంగా మారటం జరుగుతుంది.

నేను మాట్లాడకుండా చూస్తూ వూరుకున్నాను. ఆమర్నాడు యిక రేపు దుర్గ పుట్టినరోజనగా ఒక చిన్న పాతికరూపాయల మనియార్డరు హఠాత్తుగా వచ్చిపడింది. ఇదివరకో స్నేహితుడు నాదగ్గర తీసుకున్న చేబదులు బాపతది.

ఇప్పుడు ఏ చీరైతే అలంకరించుకుని దుర్గ విసవిసా నడచిపోతోందో ఆ ఆనందకలరు కోయంబత్తూరు చీర నేనప్పుడా డబ్బుతో కొన్నాను.

నేను నడుస్తూ యిప్పుడు చేరాను. దుర్గ నేను వెనకాల వస్తున్నానని తెలుసుకున్నదో లేదో గాని వెనక్కు తిరిగి చూడలేదు. నేను రెండు పెద్ద అంగలు వేసి రెండు చేతుల్తో గట్టిగా వెనకనుంచి పట్టుకుని వూపిరి సలపనివ్వకుండా-

'తాళం చెవి లెందు కిచ్చావు గాదు?'

దుర్గ తెలతెలబోతూ 'అయ్యో ! నేను నేను - మీ దుర్గను కాను' అని బాధాకరంగా తోసింది. తన్ను గట్టిగా కౌగలించుకున్న పట్టు విడిపించుకుని దూరంగా నుంచుంది. నేనుచాలా తెల్లబోయి సిగ్గుతో తల వంచుకున్నాను.

ఆఅమ్మాయి ప్లీడరుగారి ఇందిర. 'పొరబాటు. మీరు కట్టుకున్న చీర దుర్గకు కూడా వుంది. అందువల్ల ఆమె అనుకుని...' ఆమెముఖంకేసి చూశాను- ఏమన్నా అనుకుందేమోఅని.

'నేనివ్వాళ కట్టుకున్నది మీ దుర్గచీరే'.

గన్నేరుమొక్కలవెనక దూరాన్న కొండమీద చందమామ చుక్కమ్మలతో సరాగా లాడుతున్నాడు.

'ఐతే దుర్గ మీతో రావటం లేదా?'

'ఊహూ. ముందరే వెళ్లిపోయింది.'

తరువాత నే నేం అడగలేదు. ఇందిర గబగబ యింట్లోకి పారిపోయింది. నేను ఒంటరిగా రోడ్డుమీద పగలబడి నవ్వుకున్నాను.

ఎంత తమాషా జరిగింది. అచ్చంగా దుర్గే అనుకున్నానుసుమా ఆ చీర కట్టుకుంటే. తరువాత యీ సంగతి దుర్గతో చెప్పదుకదా ఆపిల్ల అనిపించింది.

తప్పకుండా చెబుతుంది. ఎందువల్లనంటే వాళ్లిద్దరూ ప్రాణస్నేహితులు. ప్రాణస్నేహితులమధ్య రహస్యాలు మడిగట్టుకూర్చోవు.

అసలు నేను స్త్రీసమాజంనుంచి కోపంతో బయటికొచ్చెయ్యడంసంగతికూడా ఇందిరకు తెలిసే వుంటుంది.

ఇప్పుడు నేనే ముందుగా దుర్గతో యీసంగతి చెప్పివేస్తే—కాని అది శక్యమనిపించుకోదు. తనకు జడిసి చెప్పేస్తున్నా ననుకుంటుంది కొంపదీసి. ఐనా రేపు యిందిర ఎట్లానూ దుర్గచీర దుర్గ కివ్వటానికి వస్తుంది. ఐనా వీళ్ల కిదేం పొయ్యేకాలం? ఎవరిబట్టలు వాళ్లు కట్టుకోక—యీ మార్చుకోవడా లేమిటి?

ఇట్లా ఒక మాటుగాదు, లక్షమాట్లు జరిగితే గట్టిగా బుద్ధి వస్తుంది.

౬

'వాఘుల్ నేరము ల్పైయు, పేరలుక జెందిన యట్టి కాంత లుచితవ్యాపారము ల్నెరుకే?'

అన్నారు ముక్కు తిమ్మన్నగారు.

నాకుమట్టుకు వళ్లు మండుతూనే వుంటుంది. కైక దశరథుణ్ని నిరసించినప్పుడూ, సత్యభామ జలజాతాసన వాసవాది సురపూజాభాజనంబైన తనయ్యలతాంతాయుధు

కన్నతండ్రి శిర మచ్చో వామపాదంబునం దొలగం ద్రోసె అన్నప్పుడూ.

ఐనా కృష్ణరాయలను—అంత మహాపురుషుణ్ని దేవేరి చూసో చూడకో కాలితో తన్నిందయ్యె—తం లే ఆయనగారి కోపం రావటం సహజం కామా? అంతమాత్రానికి ముక్కుతిమ్మన్నగారు పారిజాతాపహరణం వ్రాసెయ్యాలా! వ్రాసి ఆడవాళ్లకు కోపంవస్తే అవతలవాడు మగడయ్యేడీ మరోడయ్యేడీ, ప్రహరణాలు తప్పవని బాజాగ్గా 'ఉచితవ్యాపారము లెన్నరుర్తకే?' అని సమర్థించాలా?

ఆముక్క ఆధారం చేసుకుని ఎంతమంది కొంతెలు ఎడా పెడా మొగుళ్లను వాయించి, ఇదేమిటంటే ప్రతిఅడదీ—

'వాథు ల్నెరము ల్నెఖ-' అంటూ చదవటమా? బాగు బాగు!

ఇట్లా ఆలోచిస్తూ పడుకున్నా. చాలాసేపటి వరకూ నిద్రపట్టలేదు. ఇందిర వచ్చి దుర్గతో చెప్పినట్టూ- 'తాళంచెవులమాట యిక ఎత్తరుగదా! ఎత్తవని వొట్టు వెయ్యండి!' అంటూ దుర్గ చెయ్యెత్తి మీదిమీది కొస్తున్నట్టూగా ఫీలయ్యాను.

తెల్లవారి మెల్లగా ప్రక్కమీదకు పాడుచు వొస్తూన్న సూర్యకాంతి చురచురమనిపించేదాకా లేవలేదు. బద్ధకంగా యిటూ అటూ దొర్లాను.

దుర్గ చెంబులూ తప్పాలాలూ చప్పుడు చేస్తోంది. పాలవాడు వచ్చి పాలుకలిపిన నీళ్లు పోసిపోవటం - దుర్గ డబ్బులో నీళ్లుకలిపి యివ్వటానికి వీల్లేదని విచారించటం అన్నీ వింటూనేవున్నా. ఆఖరికి - బ్రహ్మం గారి శిష్యులు-

'చెప్పలేదం టనకపొయ్యేరు-
జనులార గురుని...'

అంటూ గుమ్మంఎదుట గొంతు చించుకుని అరుస్తూండగా అవులించి వొళ్లు విరుచుకుని జేబులోంచి కానీ తీసి వాళ్ల మొహాన పారెయ్యగా వాళ్లు మాయమయ్యారు.

మరోపావుగంటకల్లా ఉల్లిపాయ పెసరట్లవాసన గుప్పుని కొట్టింది వంటింట్లోంచి. నేను లేవలేదు. సాధారణంగా నేను వంటయింటిలో కూర్చుని పెసరట్లు వెయ్యటం, దుర్గ కాఫీకలపటం అనాదిగా వస్తూవుండేటటువంటి ఆచారం.

ఈవాళ సనాతనత్వానికి కొంచెంఅగౌరవం జరిగింది.

కాఫీ త్రాగకుండా సిగరెట్టుకూడా కాల్చను. అటువంటి నిష్ఠ నాది. ఇవాళ కాఫీ త్రాగకుండానే సిగరెట్టు ముట్టించి నిన్నటి పేపరు తిరగేస్తున్నా.

ఎందుకో బట్టలవంకీన అప్రయత్నంగా వ్రేలాడేసి వున్న ఆనందకలరుకో ముంబయ్తూరుచీరవంక చూడటం జరిగింది.

చూడగానే వులిక్కిపడ్డాను. నేను నిద్రనుంచి లేవకుండానే ఇందిర వచ్చి దుర్గతో మాట్లాడి వెళ్లింది కాబోలు. కింకర్తవ్యతావిమూఢత్వ మావేశించి అట్లా ఉత్తరగోగ్రహణంలో తిక్కనగారు చెప్పినట్లు-

'వెలవెలబారుచు వెగడొందు బెదవుల
తడియారవెంతయు తల్లడిల్లు'
అన్నట్లుగా వుంది నాపరిస్థితి.

మానవులు కొన్ని పనులు పగలు, కొన్ని పనులు రాత్రిళ్లు తప్ప చెయ్యరు. దొంగతనాలు, వ్యభిచారము, హత్యలు రాత్రిళ్లు జరిగినంత వీలుగా పగటిపూట జరుగవు. వెలుగుకి కెంత విలువో చీకటికీ అంతే విలువ. చీటికీ మాటికీ గిల్లికజ్జా లాడుకునే దంపతులు సైతం చీకటిపడగానే ఒకటైపోతారు-ద్వేషాన్ని వైషమ్యాన్ని దిగమ్రింగి.

అట్లాగే చీకట్లో అలిమీద ఆగ్రహించినవాడి ఆగ్రహం ప్రణయానికి బారెడు మేరలో వుంటుంది.

కాకపోతే ఇందిరను చూసి దుర్గ అనుకోవట మేమిటి? కోపావేశంవల్ల గాకపోతే—ఆనందకలర్ చీర వంకీన గాలి రెపరెపలాడుతూ వయ్యారంగా ఎగుర్తోంది.

దుర్గ పెసరట్లు జతను నాబల్లమీద వుంచి వెళ్లిపోబోయింది.

'కోపమా?' అన్నా—చెయ్యిపట్టుకుని. నన్ను విడిపించుకుంటూ—

'ఉండండి. మంచినీళ్లు తేవద్దూ!' అని లోపలికి వెళ్లిపోయింది.

ఈలోగా మాడిన వుల్లిపాయ తొక్కలను ఏరుకుని నోటిలో పడవేసుకుంటూ—

'తెలిసేవుంటుంది. తెలియకుండా ఎందుకుంటుంది?' అని నాలో నేను గొణుక్కున్నా.

మంచినీళ్ల గ్లాసు వచ్చి పెసరట్లపక్కన నుంచుంది. ఈమాటు దుర్గ అమృతహస్తాన్ని ముట్టుకోకుండా—

'రాత్రి నాటకం ఎట్లా వుంది?' అన్నా.

'మీ రలిగి వెళ్లిపోయారుగా—'

'వెళ్ళటం తప్పా—'

దుర్గ తిలకాయ కిటికీవైపుకు తిప్పుకుని గాలితో మాట్లాడినట్లు—

'నలుగుర్లో నాకు చిన్నతనం కాలా—మీరు చాలా మంచివారనీ, బాగా చదువుకున్నారనీ వాళ్లు అనుకుంటూవుం టేవారు.'

'వాళ్లంటే...'

'మా కార్యదర్శిని- యింకా నన్నెరిగిన కొందరు సభ్యులు.'

'ఇప్పు డేమొచ్చింది?'

'మీరు చాలా కోపిష్ఠి అని, నామీద అలగటం వలన తెల్లమైంది.'

'ఐదురూపాయలు వదుల్చుకున్నా మీ స్త్రీ సమాజం నాకు వంక పెట్టకతప్పిందికా దన్నమాట.'

'ఆ విరాళ మివ్వమని నేను కబురంపలేదు. ఇందిర నాఎదుటనే అట్లా చెప్పి వసూలుచెయ్యమని పంపింది.'

'ఎట్లా...ఆపిల్ల కేమధికారం?' అందుకనే తగిన శాస్తి జరిగింది రాత్రని మనస్సులో గుప్తంగా ఆనందించాను.

దుర్గ మాట్లాడకుండా కాఫీ తెచ్చి గ్లాసులోకి పోస్తూ—

'రాత్రి మీరు అన్నం తినలేదు. కోపమే గదూ!'

నేను నవ్వాను. ఆరోజుకి దుర్గ ఆనందకలరుచీర విషయం ఎత్తలేదు. ఇందిర చెప్పిందా లేదా అన్న అనుమానం అల్లానే వుండిపోయింది.

౭

మళ్లీ ఒకరోజు ఆఫీసునుంచి వస్తూండగా ప్లీడరుగారమ్మాయీ, దుర్గా ఎక్కడ్నుంచో కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నారు.

బహుశా ఏదో పేరంటమైయుంటుంది. ఆనాడు కూడా దుర్గచీర ఇందిర కట్టుకుంది.

ఇంకోమాటు ఆడవాళ్లంతా సినిమాకు బయలుదేరారు. నేను హాల్లో దుర్గను కలుసుకున్నాను. అప్పుడు తెల్లపట్టుచీర కట్టుకుని మెళ్లో ఐదారు పేటల చంద్రహారపు గొలుసు వేసుకొని కులుకుతూవుండగా—కొంచెం విసుగ్గా,

'ఇవన్నీ ఎక్కడివి నాన్నా.'

'వాళ్ల ఇందిరవే—నన్ను కట్టుకోమని బలవంతపెట్టి ప్రాణం తీసేసింది.'

'హుఁ!' అని మూలిగాను. 'ఏమిటి నష్టం మీకు?' అంది.

'చీకట్లో నిన్ను వాళ్ల ఇందిర అని ఎవళ్లయినా పొరపాటుపడితే...'

'ఛీ! పొండి—మీరు మరీనూ—' నా వాదాన్ని త్రోసివేసింది నవ్వుతూ. నేను డైలమాలో పడిపోయాను.

తరువాత నే ననేకమాట్లు ప్రయత్నించాను- ఒకళ్ల బట్టలు ఒకళ్లు కట్టుకోవటం, ఒకళ్ల నగ లొకరు ధరించటం మ నిపించా లని.

ఇందిర దుర్గతో ఆవాల్టి సంగతి గనుక చెప్పి వున్నట్లయితే యింత గతజలసేతుబంధన మయేదికాదు.

నా కే వుపాయమూ తోచలేదు.

దుర్గ, ఇందిర యథాప్రకారంగా అన్యోన్యం ఒకళ్ళ వస్తువు లొకరు మార్చుకుంటూ తిరుగుతున్నారు. నేను ఆలోచించి ఒకరోజు సాయంత్రం పిలిచి చల్లగా చెప్పాను.

'దుర్గా! ఇల్లు మార్చేస్తున్నాను.' అని.

'నేను యిక్కడి దక్కడ అక్కడ దిక్కడ సర్దలేను. ఐనా యిప్పు డేం వచ్చిందని? ఇదివరకంటే తగాలు తంపులు ఉన్నాయని! ఇప్పుడు ఇక్కడ అట్లాంటి వేమీ లేవుగా.'

'ఐనా మనం సామాన్యసంసారులం. ముప్పై రూపాయల అద్దె భరించగలమా? పద్దెనిమిది రూపాయల వాటా ఖాళీ అయింది.'

దుర్గ మొత్తానికి అయిష్టంగానే వుంది—ప్లీడరుగారి, పోలీసువారి పొరుగు విడిచిపెట్టి వెళ్లటానికి. మొత్తానికి పద్దెనిమిది రూపాయల వాటాలో ప్రవేశించక తప్పిందికాదు.

—

# నవ్యాంధ్రచిత్రకళ: శ్రీ దామెర్ల బదరీనారాయణరావుగారి కృషి

●

శ్రీ పిలకా లక్ష్మీనరసింహమూర్తి

నవ్యాంధ్రచిత్రకళారంగము నందనవనమువలె నవ చిత్రకళాభ్యాసము చెన్నపురిలలితకళాశాలలో దేవీ
నవోన్మిషితమైనది. అందులో ఎందరు ఆంధ్ర ప్రసాదురాయచౌదరి గారి చరణసన్నిధిని జరిగింది.

చిత్రకారులు! అది ఎన్ని చిత్రరచనా సంప్రదాయముల కలయిక! కళాపిపాస ఆంధ్రులకు ఉగ్రహాలతో రంగరించిపోసినది.

నేటి తెనుగు చిత్రకళలో దామెర్ల బదరీనారాయణరావుగారి కృషి ప్రత్యేకత కలది. ఎంతో పటుత్వమైనది. ఈయన ఆంధ్రవైష్ణవుడు.

వీరి పూర్తి పేరు చాలామందికి తెలియదు. అనేకులు ఈయనను 'బదరి' అని పిలుస్తారు. బదరి మద్రాసుకు సమీపంలో ఉన్న సైదాపేటలో ౧-౪-౧౯౧౮ వ సంవత్సరములో జన్మించారు. బాల్యము బీహారు రాష్ట్రములో పూసా అనే గ్రామంలో గడచింది.



. . . పిట్టలవర్తకుడు

(దీని అసలుచిత్రాన్ని అమెరికాలోని ఒకానొక కళాభిమాని ఆప్యాయంగా తనతో తీసుకొని వెళ్లాడు.)

చిత్రకళ నేర్చుకునే రోజులలోనే గురుదేవులకు ప్రేమాస్పదుడైనాడు. శిల్ప విద్య కూడా గురుపాదుల సన్నిధినే బాగా అలవరుచుకున్నదిట్ట.

బదరి లలితకళాశాలలో విద్య పూర్తిచేసుకుని ఢిల్లీ చేరుకున్నారు. బీహారులో భూకంపము సంభవించుటవల్ల అప్పటి ప్రభుత్వవ్యవసాయ శాఖ ఢిల్లీలో ఉంటూ ఉండేది. అందులో ప్రవేశించి చిత్రకారుడుగా పని చేస్తూఉండేవారు.

౧౯౩౪ నాటికి ఈయన జీవితంలో ప్రవేశించి చిత్రకళలో స్వైరంతర్యకృషికి ఆరంభము చేశారు. అక్కడ ఉంటూ కలకత్తా లలితకళా పరిషత్తు ఆధ్వర్యంలో జరిగే చిత్ర

కళా ప్రదర్శనములలో తమ చిత్రములు ప్రదర్శిస్తూ ర్నవములకు పంపేవారు. ఆ రోజుల్లో పంజాబు
ఉండేవారు. దేశంలో జరిగే తదితర చిత్రకళా ప్రద లలితకళాపరిషత్తు గాజమాన్యములో జరిగిన చిత్రకళా



కృష్ణసుందరి
(1946 నాటి ఢిల్లీ ప్రదర్శనంలో ఉత్తమ చిత్రంగా ఎన్నికగన్నదిది.)

ప్రదర్శనములో ఈయన చిత్రించిన "అటకస్తువు" అనే చిత్రము ప్రభుత్వము ఏర్పరిచిన బహుమతి పొందినది. దానినే ఒక కళాపోషకుడు ఆప్యాయముగా కొనుక్కొన్నాడు. తరువాత భోపాల్ నవాబు వీరు చిత్రించిన "ఆలోచన" అనే చిత్రమును కొన్నారు. పైని చెప్పిన రెండు చిత్రములు బదరికళా కౌశలమును వేనోళ్ల చాటినవి.

ఇంకా ఈయన కొడైకెనాల్, లాహోరు, సిమ్లా, మైసూరు, ఢిల్లీ, హైదరాబాదు, మద్రాసు వంటి ప్రసిద్ధనగరాలలో జరిగే చిత్రకళాప్రదర్శనములలో ఏటేటా చిత్రాలు ప్రదర్శించేవారు. చాలాచోట్ల వీరి చిత్రములు ప్రసిద్ధవిమర్శకుల మన్ననలు పొందినవి. బదరి భారతదేశంలోనే కాకుండా కాబూల్, పారిస్, లండన్, అమెరికా, చైనా మొదలయిన దేశాలలో జరిగిన అంతర్జాతీయ చిత్రకళా ప్రదర్శనములలోనూ ప్రదర్శించారు. ఒక అంతర్జాతీయచిత్రకళా ప్రదర్శనములో ఈయన చిత్రించిన 'రాగ్ పాంకోళ్' అనే రేఖాచిత్రము ప్రథమ బహుమతి నందినది. దానినే లండన్‌లో రాయల్ ఎకాడమీ ప్రదర్శించి ఈ చిత్రకారుని గౌరవించినది. అదే తిరిగి ౧౯౪౭ సంవత్సరములో ఢిల్లీలో జరిగిన అంతర్జాతీయ చిత్రకళా ప్రదర్శనములో ప్రథమబహుమతి పొందినది. ౧౯౪౬లో ఢిల్లీలో ఈయన చిత్రించిన "గృహోన్ముఖులు" అన్న టెంపరా చిత్రము చాలామంది ప్రఖ్యాతకళావిమర్శకుల మన్ననలు పొందినది. ఆ చిత్రంవిషయమై స్టేట్స్‌మన్ పత్రికలో "ఈచిత్రం ఆంగ్లదేశంలో ప్రదర్శించిఉంటే ప్రఖ్యాతశిల్పి అయిన అగస్టస్ జాన్ చిత్రించాడని చెప్పి ఉందు"నని



ప్రకృతిలో సహకృతి
(1939 నాటి కొడైకెనాల్ కళాప్రదర్శనములో దీనికి ప్రథమబహుమతి వచ్చింది.)

ప్రశంసించాడు ఒక విమర్శకుడు. మరియొక ప్రదర్శనములో భారత ప్రభుత్వము వీరివి రెండు పెద్ద చిత్రాలు కొని ఒకటి జెకోస్లవేకియా భారత కార్యాలయంలోను, రెండవది అమెరికా భారత కార్యాలయంలోను ప్రదర్శించారు. అమెరికాకు వెళ్లినది 'వర్ణసమ్మేళనము' అన్న చిత్రము. ఈవిధముగా ఈయన చిత్రములు గణనకు వచ్చినవి ఇంకా చాలా ఉన్నవి.

ఈయన ఉత్తమశ్రేణికి చెందిన చిత్రకారుడు. రాయచౌదరిగారి చిత్రకళను అవగాహన చేసుకుంటే వారి శిష్యులచేతులు చేస్తూన్న కృషిలోని మార్పులు, వృద్ధి మనకు సుబోధకము కాగలవి. దేవీప్రసాదులు చిత్రకళలో స్వేచ్ఛాప్రియులు. ఆయన శిల్పంలో, చిత్రలేఖనములో అపారమైన కృషిచేసినారన్నది లోకవిదితము. దేవీప్రసాదుల కళలోని

స్వేచ్ఛాప్రియత్వము, నిరంతరాన్వేషణా నూతనపథగాములైన శిష్యులలోనూ కానవస్తుంది. ఆ విధముగా చూస్తే బదరి చౌదరిశిష్యకోటిలో ప్రథమశ్రేణిశిష్యులలోకి వస్తారు.

ఈయనకు ప్రాచ్యశిల్పచిత్రకళాదర్శము యెడల గౌరవము మెండు. మరోవిషయము ఏమిటి అంటే రాయచౌదరిగారి శిష్యులచిత్రములలో ఎంతో వైవిధ్యము కానవస్తుంది. ఈ వైవిధ్యము ఎల్లా వచ్చింది అంటే అది రాయచౌదరిగారిలోని రసజ్ఞత, యథార్థమైన కళను గుర్తించగల శక్తి, ధైర్యము, చిత్రము చూడగానే పసిపిల్లవానివలె అమాయకముగా ఆనందించగల గొప్ప హృదయము కారణము లని తోస్తుంది. దీనినే వివరించుతాను. శిల్పంలో, చిత్రలేఖనములో ప్రాచ్యప్రతీచీసంప్రదాయముల నన్నింటిని కూలంకషముగా నెరిగిన ఘనుడు రాయచౌదరి. శిల్పములోను, చిత్రలేఖనము లోను ఆయనది బలీయ



సంతబజారు (వర్ణసమ్మేళనము)
(ఢిల్లీలో జరిగిన 18-వ అఖిలభారతప్రదర్శనంలో ప్రథమబహుమతి సంపాదించింది. దరిమిలాను ప్రభుత్వంవారే దీనిని కొనివేశారు.)

మైన దృక్పథము. రచనాసంవిధానములో, భావమునకు సదృశమైన రూపకల్పనలో ప్రధానభావమునకు అనుగుణముగా ప్రకృతిసౌందర్యమును తీసుకోవడములోను, ఒక్క టేమిటి-చిత్రమునకు ఉపాంగములైన సర్వవిషయములలోనూ రాయచౌదరిగారి వ్యక్తిత్వం ఉంటుంది. కాని తాను కళలో యథార్థమని నమ్మిన ఆదర్శములనే శిష్యులుకూడా స్వీకరించవలెనని ఆయన శాసించరు. కనుకనే రాయచౌదరిగారు గొప్ప శిల్పి మాత్రమే కాదు. గొప్ప అధ్యాపకుడు కూడాను. ఈయన దక్షిణభారతయువచిత్రకారులకు అనేకులకు కరదీపికవంటివారు. ఈయన నీరసమైన పద్ధతులని తోసి వేసిన రచనామార్గములు తన శిష్యులు అవలంబించి చిత్రంలో చైతన్యము - నూతనత్వము సాధిస్తే చిరునవ్వుతో వెన్నుతట్టి సెబాస్ అని మెచ్చుకునేవారు.

అన్నిటికంటె విశేషము—రాయచౌదరిగారు ప్రతిపక్షుల చిత్రములలోని గుణగణములు మెచ్చుకో గలిగిన ధీరుడు. ఈ ధీరత్వము ఈయనశిష్యులలోనూ ఉంది. అది చిత్రకళలో బహుముఖములుగా వచ్చింది. ఆకారణముచేతనే రాయచౌదరిగారి శిష్యగణములో అంత వైవిధ్యము కానవస్తుంది. ఆయన శిష్యుని మనస్తత్వము చక్కగా ఎరిగి నిగూఢమైన కళాంకురమును ప్రోదిచేసి పెంచినవాడు.

అట్టి పరిపుష్టమైన వాతావరణములో బదరి చిత్రకళ నేర్చుకున్నారు. ఇదుపరి బదరి జీవితంలో ప్రవేశించి అనేకభావమధురులు చవిచూచి చిత్రరచన సాగించారు. ఈయనబొమ్మలు చూడగానే చిత్రకళలో ఈయన తన్మయుడు అని తోస్తుంది. ఈయన చిత్రములు లౌకిక ప్రపంచమును మరపింపజేస్తవి. అంత గాఢత ఉంది వీరి చిత్రాలలో. లోకము సందడులలో తాను భాగస్వామి అయి కళాతపస్సు చేస్తున్నవాడు.

నేడు భారతదేశంలో ప్రాచ్యశిల్పచిత్రకళాదర్శములను ఆదుకొన్న ఏకైకసంస్థ ఆలిండియా ఫైన్ ఆర్ట్సు అండ్ క్రాఫ్ట్సుసొసైటీ. ఆ సంస్థ సహాయకార్యదర్శులలో బదరి ఒకరుగా ఉండి చాలాకాలంనించి పనిచేస్తున్నారు. ఈ సంస్థలో ఉంటూ విరామము లేకుండా ఈయన చిత్రకళకు రెండువిధాల సేవ చేస్తున్నారు.

ఈయన ఆంధ్రచిత్రకారులలో వ్రేలుమడిచి లెక్కించవలసినవాడు. ఔత్తరాహుల ప్రేమాదరములకు పాత్రుడైనవాడు. చిత్రకళారంగములో అనన్యమైన కృషి చేస్తున్నారు. ఈయన మున్ముందు ఇంకా ఎంతో కృషిచేసి నవ్యాంధ్రచిత్రకళను పరిపుష్ట మొనర్చగలరని నా దృఢవిశ్వాసము. ఈ ఆంధ్రయువచిత్రకారునికి గొప్ప భావి ఉంది. సోదరాంధ్రులు వీరి ఉత్తమకళాఖండములను చిత్రకళాప్రదర్శనములలో తరుచు చూచి ఆనందించవలెనని నా కోరిక.

[ఈ వ్యాసములో ప్రచురించిన చిత్రాలు ఈయన కొన్ని త్రివర్ణ చిత్రాలకు నకళ్లు.]



# గరికవలస

వర్షాకాలం. ఈఇంటిమీది కాకి ఆఇంటిమీదికి వెళ్లలేదు. ముసురు. రెండురోజులై కొంచెము తెరిపియిస్తోంది. కోడి పందాలు; పొట్టేళ్ళపోట్లాటలు; పులితో కుస్తీలు; గరిడీసాములు మొదలైన విద్యలు జరగడం మొదలెట్టేయి. జోరులో పులిని వదలి కుస్తీపడుతూ ఉండే రోజులు. అందుచేత పులివేట ఎక్కువగా ఉండేది.

వర్షం వచ్చినదగ్గరనుంచి రాజుగారికి కొంచెం నుస్తీగా ఉంది. ఆరోజునే దర్బారు తీర్చిఉన్నారు. ఆయన పులి వేటలో నేర్పరి.

"మహాప్రభూ! నే నొక జ్యోతిష్కుణ్ని."

"ఇప్పుడు అవసరం లేదు. కందాలో భోంచేస్తూ ఉండండి."

"వైద్యరత్నంగారు శరీరానికి కేవలం మందులే కావాలంటారా?" అని రాజుగారు అడిగేరు.

"అవును. అందులోనూ వనమూలికలతో తయారుచేసే మందు గుణం—పిలిస్తే పలుకుతుంది. ప్రాణం పోతూన్నవారికి యివ్వగా బాగైనవా రున్నారు. సంజీవకరణి, సంధానకరణి అమోఘమైన వనమూలికలు."

"వుపవాసం వుంటే ఏమందూ అక్కరలే దంటారు."

"అది అలవాటు చేసుకుంటే అక్కరలేదు."

"పరిపాలన ఉపవాసంతో సాగుతుందా?"

"తమబోటివారికి కాదు. ఉపవాసము అంటూ, రేపుకూడా నిరాహారంగా ఉంటే మంచిది, ఎల్లుండినుంచి భోజనం చెయ్యవచ్చు. వర్షం తగ్గుతుందని పంచాంగంలో ఉంది" అన్నారు వైద్యరత్నంగారు.

"వర్షం తగ్గకపోతే ఉపవాసమేనా" అన్నారు రాజుగారు.

రత్నంగారు ఏదో చెప్పబోయేరు.

రాజుగారు వినిపించుకోక, సిద్ధాంతిగారితో—"ఏమండీ! నేను రేపు అన్నం తింటానా? లేదా?"

"పొడన్నము—పచ్చడి తింటారు ప్రభూ!"

కోపం వచ్చింది రాజుగారికి. "నిజం కాకపోతే మీకు శిక్ష—"

"శాస్త్రం అబద్ధం కాదు ప్రభూ!"

వంటవాణ్ని పిలిపించి తొమ్మిది పిండివంటలు చెయ్య మన్నారు.

తెల్లవారింది. కొంచెం వర్షంగా ఉంది. పశువులను పైని కట్టిఉండగా పెద్దపులి ఒకటి వచ్చి ఒక పశువును ఎత్తుకుపోయింది అని మిరపకాయలపాద్వారా ఫిర్యాదు వచ్చింది.

రాజుగారు బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నారు. గాలి సాగింది. రాజుగారికి పట్టుదల ఎక్కువైంది. ఇరవైమైళ్ళ దూరం అడవి. దారంతా వెతికిస్తూ అడవి చేరేరు. వర్షం ఎక్కువైంది. డప్పులు కొట్టించారు. పులి కనిపించింది. వెంబడించారు రాజుగారు. వర్షం జోరైంది. పులిని తరుముతూ ఉన్నారు రాజుగారు. ఎంతదూరం వెళ్ళిందీ తెలియలేదు. మనిషీ మనిషీ కనిపించడం లేదు. సర్దార్లను కేకేసేరు. అందలేదు. ఎచ్చగా పులి కనిపించింది. కొట్టేరు—మీదికి రాబోయింది దెబ్బ బాజాటయి. తప్పించుకొని మళ్ళా కొట్టారు. కింద పడ్డది. కనుచూపుమేర ఏమీ కనిపించలేదు. కొంతసేపు నడిచి ఆయాసంతో ఒక చెట్టుక్రింద కూర్చున్నారు. నిద్ర పట్టింది. కొంతసేపటికి తెలివొచ్చింది. వర్షం వెలిసింది. ఆకలి తీవ్రంగా ఉంది.

సూర్యబింబంకోసం చూచేరు. రాత్రికి యామముంది. లేచి కొంతసేపు నడిచేరు. దూరాన గుడిసెలు కనపడ్డాయి. ఆయాసంతో బయలుదేరేరు. గుడిసెలో దూరి—"అవ్వా! ఆకలి వేస్తోంది—వేటకు వచ్చేను. పులి చచ్చింది." అన్నారు.

"బతికేము—నీకడుపు చల్లగ—నీయిల్లు వెయ్యిళ్ళు మొదలై...." అంటూ, "మూడుగంటలైంది—పొద్దుట పది గంటలకి వండిన వంట—" అని చెప్పుతూ—"ఒట్టి అన్నము ఎలాగ పెట్టను" అనుకొని, "గరికె చిగుళ్లు ఒంటికి మేహ శాంతి అని వేదాల్లోకూడా చెప్పేరు అని మావారు పచ్చడిచేయించుకొని తినేవారుకదా" అని వెంటనే గరికచిగుళ్లు తెచ్చి పచ్చడి చేసిపెట్టింది.

రెండు కబళాలు తిన్నారు. హైరాణా తగ్గింది. సిద్ధాంతిగారి మాటలు జ్ఞాపకం వచ్చి పక్కున నవ్వుతున్నారు.

"ఎందుకు నవ్వుతున్నావు? పచ్చడి బాగులేదా? ఏమీ లేక గరికాలు తెచ్చి పచ్చడిచేసేను."

రాజుగారికి ఆశ్చర్యం, అభిమానం రెండూ కలిగేయి. అవ్వఆదరానికి మురిసిపోతున్నారు.

ఇంతట్లోకి రాజుగారి సేన వెతుక్కుంటూ వచ్చింది.

అవ్వ కొయ్య అయిపోయింది. అంతా బయలుదేరేరు దేవిడీకి. సిద్ధాంతిగారికి గొప్ప బహుమానం ఇచ్చి ఆస్థానవిద్వాంసులుగా నియమించేరు.

అవ్వకి ఒక మాన్యం యిచ్చేరు. దానికి "గరికవలస" అని పేరు పెట్టేరు. ఇప్పటికీ అదే వాడుక.

నిడుదవోలు సూర్యనారాయణ.

# నాగార్జునకొండ- తరువాత వెలిచిన అజంతాగుహాలు

●

శ్రీ ఆమంచర్ల గోపాలరావు

ఆంధ్రుల అదృష్టమోయేన, ఈమధ్య, అనగా ౧౯౨౬ వ సంవత్సరమున, నాగార్జునకొండ వద్ద ఒక మహా శిల్పనిధి కానవచ్చినది. ఈ నాగార్జున కొండ, ప్రస్తుతము గుంటూరుకు ఎనుబదిమైళ్ళ దూర మున పలనాడునందు ఉన్నది. ఇచట అయిదారు సంవత్సరములు కృషిచేయగా, తొమ్మిది స్తూపములు, చైత్యాలయములు, విహారములు, ఇతర సౌధములు పెద్ద ఘటములు, శిలావిగ్రహములు, అనేక దివ్యశిల్ప ములు, నాణెములు, అనేక పురాతనశాసనములు మొదలయినవి ఎన్నో బయలుపడినవి. ఇవన్నియు క్రీస్తుకు తర్వాత రెండు మూడు శతాబ్దములనాటికి చెందినవనియు, ఈ స్థలము అప్పుడు విజయపురి అను ఒక మహానగరమనియు, ఇచట ఆనాడు ఇక్ష్వాకు వంశజులయిన ఆంధ్రరాజులు అతివైభవమున ఏలుచుండి రనియు ఇచటి శాసనములవలన తెలియవచ్చినది. ఈ విజయపురిరాజులు ఆనాడు వైదికమతమును అనుస రించుచుండినప్పటికిని, రాణులుమాత్రము బౌద్ధమతాను చరులయి, బౌద్ధమతమునకు పోషకులయియుండిరి. నాటికిని నేటికిని భార్యాభర్తలు భిన్నమతానుసరు లయియుండ గలుగుట ఒక్క హిందూదేశమునందే పొసగగలదు. నాటి విజయపురిరాణులందు శాంతిసిరి, బోధిశ్రీ అను ఇద్దరు రాణుల పేర్లు సయితము అతి ప్రాముఖ్యముగా ఆ కట్ట డములందు కానవచ్చును. ఈ విజయపురి కనుగొన్న తర్వాత బౌద్ధమతాచార్యులయిన విఖ్యాత నాగార్జునుని స్థలము ఇదేననికూడ దృఢమయినది.

ఈ విజయపురి కొండలమధ్య సరిగా కృష్ణ యొడ్డున నున్నది. ఆనాడు రోమునగరవాస్తవ్యులు విజయ పురికి కృష్ణమీదుగా ఓడలపయిన వచ్చి వ్యాపారములు సల్పుచుండిరి. కృష్ణయొడ్డున ఆనాడు ఆంధ్రులు కట్టిన రేవు నేటికిని సంపూర్ణముగా శిథిలముకాక, ఆనాటి రూపము తెలియవచ్చురీతిన నిలిచియున్నది. ౨౫౦ అడు గుల పొడవు, ౫౦ అడుగుల నీటిమట్టమునకు అరడుగుల ఎత్తున, అతిపీలుగా దీనిని నిర్మించిరి. ఆనాడు ఆంధ్రులు నావపర్యటనయందు అతిధురంధరులు. నావలవిషయమందు ఆంధ్రుల ఆనాటి ప్రజ్ఞను ఈమెట్టు బాగుగా స్మృతికి తెచ్చును.

ఇచట కట్టడములు, ఎక్కువగా ఇటుకలతో నిర్మితములయి, సున్నపుపూతన అలంకృతములయినవి. ఈకట్టడములందు ముఖ్యముగ గమనింపవలసినవి చైత్యా లయములు. ఇచట ఆనాడు అనేకవిహారములను నిర్మిం చిరి. ప్రతిఒకవిహారఅవరణమందు ఒక చైత్యాలయము, ఒక స్తూపమును వారు నిర్మించిరి. ఈచైత్యాలయము లన్నియు ఇటుకకట్టడములు. ఈ చైత్యములందు ఒకటి మాత్రము పూర్ణచతురస్రనిర్మాణక్రమమున ఉన్నది. తక్కిన వన్నియు ఆరాధించు వస్తువు నుంచు వెనుక భాగమందుమాత్రము (*Near the Alter*) గుండ్ర ముగా వంపుతిరిగినవి. వెనకభాగమందు వర్తులా కారము అనేకపురాతనచైత్యగుహాలందు సయితము కానవచ్చును. ఈ చైత్యముల ద్వారములకు ముందు, శిలపయిన ఒక చంద్రశిల(**Moon Stone**)కానవచ్చును.

చంద్రశిల అనగా అర్ధచంద్రాకారమున మలిచిన రాయి. నాగార్జునకొండవద్ద దొరికిన చంద్రశిలలపైన శిల్పము లేమియు కానము. కాని ఒక్క చంద్రశిల పయిన మాత్రము అంచున గుఱ్ఱములు, వృషభములు, ఒక్క శ్రేణిన అలంకారయుతముగా మలిచియున్నవి. తరువాత ఈ చంద్రశిలలు, దివ్యముగా శిల్పముచే అలంకృతములైనవి, సింహళమందు అతివిరివిగా వినియోగించిరి. నాగార్జునకొండవద్ద చైత్యాలయములకు కిటికీలు కానము. అవసరమయిన వెలుతురుకొరకు ఒక చిన్న గవాక్షము ద్వారబంధముపయిన నిర్మించినట్లు తెలియుచున్నది. ఈ నిర్మాణక్రమము అనేక చైత్య గుహలను పోలినదని చెప్పవచ్చును. కాని నాగార్జున కొండచైత్యాలయములకు, గుహలందు, వట్టింటికి ఇరు వయిపులా ఏర్పడిన పార్శ్వభాగములు లేవు. ఈ చైత్యాలయములందుపయితము కప్పు వర్తులముయినది. ఈ వాస్తు రూపముకూడ అంతకుపూర్వము, తరువాతను నిర్మితము లయిన చైత్యగుహలందు కానవచ్చును. కాని ఇటుకకట్టడములందు ప్రథమమున ఈ వాస్తురూప మును ఏర్పరచినది విజయపురి అయిన నాగార్జునకొండ వద్దనే అని చెప్పవచ్చును. ఈ రూపమున పురాతన చైత్యకట్టడములు నేటి చేజెర్ల కపోతేశ్వరాల యము, నైజామునందు కలుబుర్గజిల్లాలో టేరుదేవాల యము మాత్రము నేడు కాననగును. ఈ రెండుదేవాల యములు ప్రథమమున బౌద్ధచైత్యములయినప్పటికిని నేడు వైదికముగ మారినవి. ఈ వాస్తురూపము వేసర అనియు, ఇది ఆంధ్రవాస్తుప్రత్యేకత అనియు గంగూలీ మొదలయిన పండితుల నిర్వచన.

ఇచట విహారములుపయితము ఇటుకలతోడనే నిర్మితములయినవి. ఈ విహారశాలలకు చెందిన స్తంభ ములు అనేకములు ఇచట దొరకినవి. ఆనాడు నిలిచిన రీతినే కొన్ని స్తంభములు నేడుకూడ నిలిచియున్నవి. ఈ స్తంభశిరస్సులమీద అడ్డముగా గాడులు ఏర్పడి ఉన్నవి. అందుచేత ఈ స్తంభములపయిన అడ్డకొయ్య వాసముల నేర్పరిచి, వాటిపయిన పూరి వసారాకప్పు లను ఆనాడు నిర్మించియుండవచ్చునని పండిత లాంగు

హరుస్టుగారు ఊహించిరి. వారి ఊహకు తగు రీతినే, ఈ స్తంభములు నేలయందు ఎక్కువ లోతుగా లేక, తేలికప్రచ్ఛాదనమునకే ఏర్పరచినరీతిన కానవచ్చును. ఈ స్తంభముల క్రమము మధ్యన అష్టకోణము, పీఠ మందు, శిరోభాగమందు చతురస్రము. చతురస్ర భాగములందు, నలువైపులా చిత్రపద్మములనో, లేక అలంకారయుతమయిన వర్తులపతకములనో మలిచిరి. రెండు స్తంభములమీద మాత్రము యవనరూపములు కానవచ్చును. వీటియందు ఒకటి యవనయోధుని రూపము. ఈ రూపము పరిపూర్ణదుకూలమయమయి, శిరస్త్రాణముతోసహా చేత భల్లమును ధరించిన యవన యోధుని ప్రతిబింబము. బహుశా ఆనాడు అనేకమంది యవనులు మన దేశపు రాజుల కొలువులలో చేరియుండ వచ్చును. అందుచేత మన శిల్పులు ఈ రూపములను పయితము అలంకారములందు చేర్చియుండవచ్చును. ఇదే రీతిన యవనయోధుల రూపములు అక్కడక్కడ అమరావతి, అజంతాలందు పయితము కానవచ్చును. రెండవ యవనచిత్రము గ్రీసుదేవాంతి డైనాసియస్ రూపమని పండిత లాంగుహరుస్టుగారి అభిప్రాయము. ఈరూపమునందు కటిపైభాగమున వసనధారణ లేదు. చిన్న గడ్డము కలిగి, చెవివద్ద ఒకకొమ్ము పట్టుకొని ఈ ముకుళలిరూపము నిలిచియున్నది. ఆనాడు అనేక రీతుల రాకపోకలు యవనదేశమునకు కలిగిన ఆంధ్రులు డైనాసియసును ఎరిగియుండుటలో ఏ ఆశ్చర్యము లేదు.

డైనాసియసుఖ్యాతి ఆనాటికి అతిప్రబలమయి ఉండియుండవలయును. అప్పటికి నాలుగయిదువందల సంవత్సరములకు పూర్వము, సకలలోకమును దిగ్విజయ మొనర్చి అలెగ్జాండరు చక్రవర్తి మహోద్యుతి డైనాసియ సును చూడ వెళ్లెనట. శాస్త్రపఠనయందు నిమగ్నుడయి ఉన్న డైనాసియసు తన్ను దర్శింపవచ్చిన మహాచక్ర వర్తిని గమనింపలేదు. కొంతతడవయిన వెనుక చక్రవర్తి తానే డైనాసియసును పలుకరించి తానెవరో తెలిపి, ఇచ్చవచ్చినదానిని కోరుకొనమనెను. వెలుతురుకు అడ్డము కాకుండ, కొలది తొలగిన చాలునని డైనాసియను పలికె, మరల శాస్త్రపఠనమందు నిమగ్నుడాయెను.

అలెగ్జాండరు చక్రవర్తి ఈ వాక్యమును విని, అతి విస్మయుడయి, తాను అలెగ్జాండరు కాకున్న, డైనాసి యసుగా ఉండగోరెనట. ఇట్టి పరమయతి అయిన డైనాసీయసు ఏ దేశమునకు చెందినను పూజనీయుడే. అతని దివ్యరూపము సర్వమహామందిరములను అలంకరించదగినది. డైనాసీయసు విదేశీయుడయినను, ఆంధ్రశిల్పులు అతని చిత్తశోభ నెరిగి, తమ విహారమును సంప్రదాయపరమయిన అతనిరూపముచే అలంకరించిరి.

ఇచట తొమ్మిది స్తూపములు కానవచ్చినవని ఇంతకుముందే చెప్పడమయినది. ఈ స్తూపములు రెండు విధములు. వట్టి ఇటుకకట్టడములు ఒకవిధము. రెండవ విధము అమరావతీస్తూపముచందమున, పలనాటి చలువరాతితో కప్పి అనేకశిల్పములచే అలంకృతమయినవి. ఆంధ్రస్తూపప్రత్యేకలక్షణమయిన ఆయక వేదికలు నలుదిక్కుల ఈ స్తూపములన్నియు కలిగియేయున్నవి. కొన్ని స్తూపములకు ఆయక స్తంభములుకూడ కలవు. ఇచట దొరకిన శిల్పములందు అమరావతికివలెనే ఈ స్తూపముల ప్రతులు కలవు. ఈ స్తూపప్రతులందు చాలు గింటిని పండిత లాంగుహారుస్టుగారు ఉదహరించిరి. ఇవన్నియు దాదాపు అమరావతీస్తూపమురీతినే నిర్మితములయినట్లు ఈ ప్రతులవలన తెలియుచున్నది. కాని ఈ స్తూపరూపములందు, అమరావతీఅలంకారబాహుళ్యము కాని, సొంపుకాని కానరాదు.- ఆపయిన ఈ స్తూపచిత్రములందు సంకలనవిశేషము కొంత బిగువుతప్పి, శిల్పమందు ఉత్తీర్ణత ప్రకటించు చిత్రములవలె అఖండములుగ కానరావు. అందుచేత అమరావతీస్తూపమందలి మహావాస్తుప్రదర్శనము ఈ స్తూపములందు లేదని విదితమగుచున్నది.

ఈ నాలుగు స్తూపప్రతులందును ఆయక వేదికముఖమందలి చిహ్నరూపములు సయితము చాలవరకు అమరావతీరూపములనే అనుసరించుచున్నవి. ఒకదానియందు వట్టి స్తూపచిహ్నము; రెండవదానియందు నిలిచి ప్రబోధిస్తున్న బుద్ధుడు; మూడవదానియందు ఏడుపడగల నాగసర్పము; నాలుగవదానియందు ఉపాసకులు పరివేష్టించి కొలుచుచుండగా ప్రబోధిస్తున్న బుద్ధుడు కానవగును. చివర రెండు స్తూపప్రతులందు మాత్రము ప్రాకారములు విదితమగుచున్నవి. కాని ఈ ప్రాకారముల రూపము అమరావతీప్రాకారముచందమునకాక కలపనిర్మాణక్రమమును అనుసరించుచుండును. ఇంతేగాక అమరావతీస్తూపపు ప్రతులందు కానరాని ఒక విశేషము ఈ ప్రతులందు కానవగును. ప్రాకారములోపల, స్తూపమునకు ఎదురుగా, ఇరువైపుల రెండు పెద్ద ధ్వజస్తంభములు నిర్మించినట్లు తెలియుచున్నది. ఒక స్తూపపు ధ్వజస్తంభములపైన ధర్మచక్రములు, రెండవదాని ధ్వజస్తంభములపైన సింహములు కానవచ్చుచున్నవి. సింహములు శాక్యసింహమయిన గౌతముని చిహ్నములని వేరుగా చెప్పనక్కరలేదు. చైత్యములకు ముందు ధ్వజస్తంభములను నిలుపు సంప్రదాయము అతిపురాతనమయినది. కార్లీ, కన్హారీ గుహాచైత్యముల ఎదురున సయితము ధ్వజస్తంభములు కలవు.

నాగార్జునకొండస్తూపపు పునాదులందు సయితము ఒక ప్రత్యేక ఆంధ్రవాస్తువిశేషము స్పష్టపడుచున్నది. ఉత్తరదేశమందు కానవచ్చిన ఇతరస్తూపములందు పునాదులు వట్టి వర్తులముననే నిర్మితములయినవి. కాని ఆంధ్రస్తూపపునాదులటులకాక, చిత్రపద్మములవలె పూర్ణచక్రరూపమున ఆకులు, కుండలతోసహా ఇటుకలతో నిర్మించిరి. ఆకులవలె ఏర్పడిన పునాది కుడ్యములమధ్య ఏర్పడిన గదులందు స్తూపమును ఉద్దేశించిన అస్థికలను భద్రపరిచిరి. భట్టిప్రోలు, ఘంటసాల స్తూపపు పునాదులందు సయితము ఈక్రమము కానవగును. కాని ఆ పునాదుల క్రమములందు ఒకింత భేదముమాత్రము కలదు.

నాగార్జునకొండవద్ద అస్థులున్న స్తూపపు పునాదులందు కేంద్రము గుండ్రనయి, చుట్టును మూడు శ్రేణులందు ఆకులరూపమున గోడలు నిర్మించి, ఈ శ్రేణులను సయితము ఇటుకకుడ్యములతో వేరుపరిచి గదుల నేర్పరచిరి. మరొక స్తూపపు పునాదులందు మధ్య ఘనచతురస్రమయి, చుట్టున ఒక శ్రేణియందే ఆకుల నేర్పరచిరి. కాని ఘంటసాలస్తూపపు

పునాదులందు, కేంద్రము ఘనచతురస్రమయి, చుట్టు మరొక పెద్ద చతురస్రము నేర్పరిచి, ఈపెద్దచతురస్రమును ఆరుగదులుగా విభజించి నిర్మించిరి. ఈ గదుల గోడలను పొడిగించి, మరల గదులను ఏర్పరచి, పెద్ద వర్తులమును చేసి, ఈ వర్తులముచుట్టు ఒకశ్రేణిన



(నాగార్జునకొండవద్ద ఒకస్తూపపు పునాదుల క్రమము. • అస్థులు భద్రపరచినస్థలము.)

వర్తులముగానే రేకులరీతిన గదు లమర్చిరి. ఈగదులన్నిటిచుట్టూ ఘనమయిన ఇటుకగోడను నిర్మించిరి. వీటన్నిటికి పయిన స్తూపనిర్మాణమును ఒనర్చిరి. భట్టిప్రోలుస్తూపపు పునాదుల చక్రమందు కేంద్రమున వర్తులము. దీనిచుట్టూ మూడు శ్రేణులందు గదులు వర్తులముగా ఏర్పడిఉన్నవి. మధ్యశ్రేణియందు మాత్రము నక్షత్రమురీతి కిరణము లున్నయట్లు కనుపించును. అందుచేత స్తూపపుపునాదులందు ఈ నిర్ణయనియమము ప్రత్యేకఆంధ్రలక్షణమయి, ఒక ప్రబల ఉద్దేశపూరితమయినది అనుట స్పష్టము. బహుశా ఈ ఆంధ్రపద్ధతి మంత్రసంబంధమయిన యంత్రచక్రములయి ఉండెవచ్చును. నిజముగా ఈ దివ్యస్తూపములు రూపుమాసినంత, ఆప్రదేశముల శోభ, సిరి, సంపదలు సయితము అదృశ్యమవుటకూడ ఒక వింత విశేషమనియే చెప్పవలయును.

నాగార్జునకొండశిల్పములన్నియు స్తూపములను అలంకరించినవే అయిఉన్నవి. ఇవన్నియు పూర్ణముగా అమరావతీశిల్పముల శైలి ననుసరించినవి. ఇంతేకాక ఇచట చిత్రితములయిన శిల్పవిషయములుసయితము అమరావతీశిల్ప అంశములే అయి, అదేరీతినరూపసంకలనములందు సయితము చిత్రితమయినవి. అందుచేత ఈ శిల్పచిత్రములన్నియు అమరావతీ శిల్పప్రతులనియే అనవలయును.

కాని నాగార్జున కొండశిల్పములందు అలంకార ఉద్దేశము కొంత ఎక్కువగా కనుపించును. ప్రతిచిత్రము ఒక చతురస్రచట్టమునందు ఇమిడ్చి, ఆ చట్టమునుసయితము అలంకారయుతముగా మలిచిరి. ఇంతేకాక ప్రతిచిత్రమునకు ఇరువైపుల అనేకశృంగారరీతుల సంచరించుచున్నటుల దంపతులు కానవచ్చెదరు. ఈ చిత్రములందు ప్రత్యేక ఆంధ్రవిలాసమయరతిభావగతి సూక్ష్మమున కొంత తప్పినది. అయినను శిల్పములు అతిలలితము లయి, చాల ఇంపుగాఉన్నవి. ఇంతేకాక ఈ శిల్పరచనలందు అమరావతీశిల్పముల బిగువు, వాడి కానరాదు. అ మ రా వ తీ శి ల్ప ము లందు అంతర్గతమయిన ఉద్వేగచలనగతి సయితము ఈ శిల్పములందు కొంత కొరతపడినయట్లు కనుపించును. అందుచేత ఈ నాగార్జునకొండశిల్పములు పట్టి అమరావతీశిల్పముల ఆభాసమేకాని, శిల్పుల నిజఅంతర్యమున ఉద్భవించిన దివ్యపుష్పములుమాత్రము కావు. అయినప్పటికిని హిందూదేశమందు ఈనాటివరకూ కానవచ్చిన అన్ని ఇతరప్రాచీనశిల్పముల కివి భిన్నఅయి ఆ శిల్పుల చాతుర్యము అతిఉత్తమశ్రేణికి చెందినదే అని చాటునవి అయిఉన్నవి. ఈనాడు మనకు దక్కిన ఈశిల్పసెన్నిధిని ప్రతి ఆంధ్రుడు చూచి ఆనందించవలయునని చెప్పనక్కరలేదు.

ఇదికాక, ఇచట అనేకప్రాచీన నాణెములు, పెద్ద మృత్తికాఘటములు, ఇతరవస్తువులు, కొన్ని విడి



(ఘంటసాల స్తూపపుపునాదుల క్రమము. నీడప్రదేశము ఇటుకలతో కట్టిన గోడలు.)

శిల్పఖండములుకూడ కాన్పించినవి. ఈ శిల్పఖండములందు ముఖ్యమయినవి ఒక మహాబుద్ధశిలావిగ్రహఖండము, రెండు బోధిసత్వశిరోరూపములు. ఈ శిరోరూపములు బహుశా నాగార్జునాచార్యులను ఉద్దేశిం



(భట్టిప్రోలు స్తూపపు పునాదుల క్రమము.)

చినవని పండితాభిప్రాయము. ఏది ఎట్లున్నను ఈ శిల్పములందు ప్రకటితమయిన చాతుర్యము అతిఉత్కృష్టము. ప్రకృతిని ప్రతిబింబించుచు, నిజఆంధ్ర శైలిని ఇవి రచనలయినవి.

అమరావతీశిల్పములు మన దేశమును వీడిన లోటు తీర్పరానిదయినను, ఆ శిల్పముల ప్రతులు నాగార్జునకొండవద్ద దొరకుట మనలను కొంత ఓదార్చునదయి, విషాదాంధకారమున ఒక తైలదీపపు జ్యోతివలె నిజముగా ఆనందప్రదమనియే చెప్పవలయును.

## తరువాత మలిచిన అజంతాగుహలు

ఇంకన్నియు తొమ్మిది గుహలు. ఈ గుహలన్నియు మూడవశతాబ్దము ఆఖరునుంచి అయిదవశతాబ్దము ఆరంభము వరకు మలిచి అలంకరించినవి. అనగా ఈ ద్వితీయ ఉద్వేగతరంగము దాదాపు నూరు నూటయేబదిసంవత్సరములు నిలిచినది. ఈ గుహల నిర్మాణము మొదలిడుకాలమునకు అమరావతి, నాగార్జున కొండశిల్పము లన్నియు చాలవరకు పూర్తిఅయినవి. ఈ గుహలను అలకించినంత స్వదేశముఖమును అలంకరించుటకు పరువెత్తిన ఆంధ్రశిల్పులు అంతకాలము మరచిన దివ్యఅజంతాల కార్యమును పూర్తిచేయుటకయి తిరిగి తరలివచ్చి, ఈ మహాకార్యమును కొనసాగించినట్లు తోచును. ఎందుకనగా, ఈ మహా ఉద్వేగతరంగమున రూపొందిన గుహలందలి శిల్పము చాలవరకు అమరావతీదివ్యశిల్పములను స్ఫురణకు తెచ్చునవై ఉన్నవి.

ఈ గుహలు మలుచునాటికి బౌద్ధమతమందు మహాయానము ఒక పూర్ణరూపము వహించినది. దేవాంశసంభూతుడయిన బుద్ధుడు పూజనీయుడను భావము స్థిరమయినది. దివ్యబుద్ధరూపసన్నిధిని అలంకరించు ఒక భావవిశేషము శిల్పిఅంతర్యమున అంకురించినది. ఈ భావమునకు తోడుగా ఆనాటికి శిల్పుల హస్తనైపుణ్యముసయితము పరిపూర్ణమయినది. అందుచేత ఇంతకు పూర్వము మలిచిన గుహలకును, ఈ ద్వితీయప్రచండఉద్వేగతరంగమున మలిచిన గుహలకును చాల భేదము కానవచ్చును. అయినప్పటికి, మహా

యానగతి అప్పటికప్పుడే ప్రస్ఫుటమయినందువలన, ఈ గతిని అనుసరించిన ఒక పద్ధతిసయితము ఈ గుహా శిల్పములను చాలవరకు ఆదరించినది.

ఈ గుహలందు ముఖ్యముగా కానవచ్చు విశేషము ఎక్కువ స్తంభములు. ఈ స్తంభములుసయితము శిల్పములచేతనో, లేక వర్ణచిత్రములచేతనో అతిగా అలంకృతములయియుండును. స్తంభశిరస్సులందు ఏర్పరచిన అలంకారరూపములుసయితము ప్రకృతికి అతీతము, లోకమున కానరాని, మతగ్రంథములందు వర్ణించిన దేవతా, యక్ష మొదలయిన రూపములు. ద్వారబంధములందుసయితము అలంకారభావము హెచ్చుగుటకూడ ఈ గుహలందు పరికించగలము. ఈరీతిన ఈ గుహలందు నిర్మితములయిన కొన్ని ద్వారబంధనములు అత్యద్భుతమయినవి కలవు. ఈ గుహలందు కానుపించు మరొక విశేషము ఎక్కువ బుద్ధస్వరూపములు. శిల్పుల అంతర్యమందు గౌతమబుద్ధుడు ఒక మహాదేవతాస్వరూపమయి దివ్యపీఠమును అలంకరించిన విషయము ఈ గుహలందు అతిస్పష్టము.

అజంతాలందు ద్వితీయ ఉద్వేగతరంగమున మలిచిన గుహలు ౬, ౭ కాక ౧౮ నుంచి ౨౦ వ గుహవరకు ఏడవ గుహయందు బుద్ధరూపశిల్పములు ఎక్కువగుట, బుద్ధుడు దేవతాస్వరూపమయి పూజార్హమగుట సయితము స్పష్టముగా కానవగును. ఈ గుహవాస్తువే అసలు ఛేదించినది. ఇది ఒక విహారము. అయినప్పటికి ఈ గుహయందు ఒక మహాశాల కానము. కాని ఉపగదులు చిన్నవి చాల కలవు. ఈ గుహముందు ఒక వరాండా కలదు. ఈ వరాండాముందుభాగమందు మధ్యన రెండు స్తంభములు కలవు. ఈ స్తంభములు ఈ వరాండాను రెండుభాగము లొనరించినరీతి కానవగును. ఈ స్తంభముల రూపము ఎలిఫెంటా స్తంభములను స్మృతికి తెచ్చును.

ఈ గుహాగర్భమున ఒక ఆదిత్యము కలదు. ఆదిత్యమునకుముందు ఒక పెద్ద గది కలదు. విహారములందలి శాలభాగమున ఈ గదిభావమే వేరుగా కన్పడును. విహారమునందు, పరివ్రాజకులు మహాశాలయందు కూడి ధర్మచర్చ లొనరించు భావము కన్పడును. కాని ఆదిత్యముముందున్న ఈగది ఆదిత్యమందలి మూర్తి పూజకొరకు కాచుకొనియుండుటకు వీలుగా కనుపడును. పూజభావము ఈ గదియందు స్ఫుటమయినది. అదేరీతిగా ఈ గదికుడ్యములన్నియు శ్రేణులపరముగా అనేక బుద్ధరూపములు మలిచిఉన్నవి. కొన్ని శ్రేణులందు ఐదు బుద్ధరూపములు కానవగును, కొన్నిటియందు ఏడు బుద్ధరూపములు కానవచ్చును. ఈ బుద్ధరూపము లన్నియు ప్రసిద్ధికెక్కిన కవ్హారీ కల్పనలు. అనగా నాగపురుషులు నిలిపిన పద్మము పయిన ఉన్న బుద్ధప్రతిమలు. ఒక్కొక్కప్పుడు కాడమధ్యనుంచి ఇరువయిపుల మొలచిన పద్మములందు మరిరెండు బుద్ధరూపములో, లేక వట్టి ఉపాసకులో కానవగుదురు. ఇచట మలిచిన బుద్ధరూపములకు వెనుక శీర్షచక్రము అతిస్పష్టముగా కానవచ్చును.

ఆదిత్యమందు ప్రధానబుద్ధవిగ్రహము పెద్దమకుటమును ధరించి, పద్మాసనమున వరముద్ర ధరించి ఉండును. ఈ శిల్పమునకు ఇరువయిపుల ఆరు బుద్ధమూర్తులు నిలిచినవి. పద్మాసనమున కూర్చొని చిన్న బుద్ధమూర్తులు ఆరు కానవచ్చును. ఈ మూర్తులన్నియు వరముద్ర ధరించియుండును. ప్రధానబుద్ధశిల్పమునకు ఇరువయిపుల ఇద్దరు చామరధారులు రక్షకులుగా నిలిచియుందురు. బుద్ధుని కిరీటమునకు వెనుక, కుడ్యము పైన ఇరువయిపులా మకరములు, పైన కోణములందు విద్యాధరులు, గంధర్వులు మొదలయిన రూపములు కానవచ్చును. ఈగుహయందు బుద్ధరూపము దేవతాస్వరూపము నందికొని లాంఛనయుక్తమయి వరదాయకమయినది.

ఆరవగుహకు రెండంతస్తులు కలవు. ముందు వరాండా పడిపోయినది. ఈగుహాకుడ్యములమీద సయితము బుద్ధరూపములు అతివిరివిగా మలిచి ఉన్నవి. గుహాగర్భమందలి ఆదిత్యమందు పెద్ద బుద్ధవిగ్రహము ధర్మచక్రముద్ర ధరించి కానవచ్చును. కొలదికాలముక్రిందనే ఎవరో నీలవర్ణము ఈవిగ్రహమునకంతటికి పూసి అలంకరించినట్లు కానవచ్చును.

ఈగుహాయందలి స్తంభములు పీఠభాగమున చతురస్రముయి, తర్వాత అష్టకోణముయి, మరల చతురస్రముయి, ఆపైన బోధికలు ఏర్పడియున్నవి. ఈ బోధికలయందు చిన్నగూళ్లు మలిచి, గూళ్లయందు బుద్ధరూపములను మలిచిరి. ఈగుహాయందు కల శిల్పములందు ఏనుగుల రూపములు తప్పక గమనించదగినవి. ఈ గజరూపములు అతిఉత్సాహపరములైనవి. అందున పులిని చంపుచున్న ఏనుగు ఒకటి తప్పక చూడవలసినది. అజంతాలందు అన్ని గుహలను మించి, ఎక్కువ బుద్ధరూపములు ఈగుహాయందు మలిచియున్నవి. అయినను దివ్యముగా మలిచిన ఈబుద్ధరూపములందు, ఆ శిల్పుల భావోద్రేకము, శ్రద్ధ ఎక్కువగా గోచరించి, పునరుక్తిదోషమును మరిచిపోదుము.

పదునాలుగవ గుహాయందు నిశ్చయముగా గమనింపదగిన విశేషము స్తంభములుమాత్రమే. ఈ స్తంభములందు ఆశ్యమే కుంభిరూపమున నిర్మితమయి అతి చిత్రముగా కన్పడును. శిల్పమందు నవ్యరూపశోధన తృష్ణ ప్రాచీనాంధ్రశిల్పులకు అపారము.

పదునయిదవ గుహయందు వసారా కొంత పడిపోయినది. ఇచటి స్తంభములందుపయితము గమనింపదగిన వాస్తువిశేషము ఒకటి కలదు.




ఈ స్తంభములకు పీఠభాగమున కుముద(*Torus*), పైన పట్టిక యేర్పడియున్నవి. కార్లీ స్తంభములందు పీఠభాగమునందు నాలుగుఫలకములు ఒకదానిపైన ఇంకొకటి ఉంచి, ఆపయిన, కుంభముదీతిన అధిష్ఠానము ఏర్పరిచిరి. కాని ఈ స్తంభములందు పీఠభాగమున కుముద, అధిష్ఠానభాగమందు పట్టిక ఏర్పడి, ప్రాచీన యవన స్తంభపీఠములను స్మృతికి తెచ్చును. ఈపట్టికపయిన అష్టకోణకాశ్యము కలదు, ఈ అష్టకోణ కంబము కొంతదనుక పదునారుకోణములయి, తర్వాత ముప్పదిరెండుపత్రములు ధరించును. ఈగుహాద్వారబంధమును శిల్పము ఏమియు అలంకరింపలేదు. కాని ఈ ద్వారబంధమున కిరువయిపుల కుడ్యముఖమున మలిచిన అను స్తంభములు (*Pilasters*) శిల్పులచే అలంకృతములయినవి.

ఈ గుహాలోపలి స్తంభములు పయితము గమనింపదగినవి. ఈ స్తంభములకు పీఠము చతురస్రము. పీఠముపైన ఆశ్యము మూడుభాగములుగా కనుపించును. ఈ ఆశ్యమునకు మధ్యభాగము పదునారుపత్రములుగాను, ఇరువయిపుల అష్టకోణములుగాను మలిచిఉన్నది. ఆశ్యముపయిన శిరస్సు పీఠమువలెనే చతురస్రము. గుహాగర్భమున ఆదిత్యమందు, సింహాసనముపయిన ఉపవిష్టుడయిన ఘనబుద్ధరూపము కలదు. అది త్యమునకు ముందు ఒక చిన్న గది కలదు. ఈగదికప్పుపయిన వర్ణచిత్రములు పూర్తిగా శిథిలము కాలేదు.

అజంతాలందు పదునారవ గుహ మహాప్రఖ్యాతి గడించిన విహారము. అజంతాలందలి సర్వవిహారములను ఇది శోభను మించినది. బహుశా క్రీస్తుతర్వాత నాలుగవ శతాబ్దఅంతమున ఈ గుహ మలిచి ఉండవచ్చును. ఇదేకాలముననే ౧౯ వ గుహకూడ నిర్మితమయినది. ఇది ఒక చైత్యము. అజంతాలందు సర్వచైత్యములను ఈ ౧౯ వ గుహ శోభను మించినది. ౧౬ వ గుహ వసారాయందలి వర్ణచిత్రములన్నియు శిథిలములయిపోయినవి. ఈ గుహఅంతర్భాగమున శాల చాల పెద్దది. ఈ మహాశాలకుడ్యములపయిన మలిచిన శిల్పములన్నియు ౧౭, ౨౧, ౧-వ గుహలందు వర్ణచిత్రములుగ కానవచ్చును. ౧౭-వ గుహ ప్రథమమున మలిచిన అజంతాగుహలందు ఒకటి. అందుచేత ౧౬ వ

గుహానిర్మాతలు కొన్ని పాతకల్పనలను మరింత సొంపుగా ఈ గుహయందు మలిచిరి. ౨౧, ౧-వ గుహలు ౧౬-వ గుహ అయినతర్వాత రెండుశతాబ్దములు గడచిన వెనుక నిర్మితమయినవి. అందుచేత ఈ గుహాశిల్పములు ఆ గుహాశిల్పులను అపరిమితముగ ఆకర్షించినవి. అందు చేత వర్ణములతో ఆ దివ్యశిల్పములశోభను ప్రదర్శించుటకయి ఆ కల్పనలను మరల చిత్రించిరి.

౧౬ వ గుహాఅంతర్భాగమున అతిప్రఖ్యాత మైన వర్ణచిత్రములు అనేకములు కలవు. అందు ముఖ్యమయినది మరణావస్థయందున్న రాజమారి చిత్రము. ఈ దివ్యచిత్రమునుగూర్చిన పండిత గ్రిఫిత్ గారి వాక్యములనుమాత్రము ఇచట ఉదాహరించుచున్నాను. "ఈ మహాకల్పన శిల్పి ఉద్దేశించిన కథాంశమును స్పష్టముగా తెల్పుచు, కరుణారసపూరితమయి, యావచ్ఛిల్పచరిత్రయందును అద్వితీయమయినది. ఫ్లారెన్సుకళాకర్తలు సయితము రూపురేఖల రచనలందు ఇంతకన్న ఎక్కువ నిపుణతను ప్రకటింపలేరు. వెనీసు చిత్రకారుల వర్ణికాభంగిమ ఈ చిత్రపు వర్ణికాభంగిమను మించలేదు. భావప్రకటనయందు ఈ చిత్రము వీరందరి చిత్రములను మించినది."

ఈ గుహయందు శాలవెనుకభాగమున గమనింప వలసిన చిత్రములందు అతిముఖ్యమయినవి ఏనుగులు, చక్రవర్తులు కలిగి కదలుచున్న జనవాహిని యొకటి, రాజమారులకు గౌతమబుద్ధుడు ప్రబోధ మొనర్చుట, అసిత మహర్షి పసిపాపడైన గౌతముని ఎత్తుకొనియుండుట, రాజమారుడయిన సిద్ధార్థుడు విల్లంబును ఎక్కుపెట్టుట మొదలయినవి. ఈ చిత్రములన్నియు చాలభాగము శిథిలములయినవి.

పదునేడవ గుహసయితము ఒక విహారము. ఈ గుహ దాదాపు పదునారవగుహవలెనే ఉండును. ఈ గుహ ఆరవశతాబ్దమందు నిర్మితమయినదని కొందరు పండితుల అభిప్రాయము. కాని గుహాశిల్పముల శైలిగతుల ననుసరించి ఈ గుహ అయిదవశతాబ్దఅంతమునకో, లేక ఆరవ శతాబ్దప్రారంభమునకో అయియుండవచ్చునని తోచును.

ఈ దివ్యగుహ జోడియాకు గుహ, అనగా రాశి చక్రపు గుహ అని ప్రసిద్ధికెక్కినది. ఎందుకనగా ఈగుహయందు ఒక చిత్రపద్మము కలదు. ఈపద్మమును పదునారుభాగములు ఒనర్చి, ప్రతిభాగమును ఒక వర్ణచిత్రముచే నింపిరి. ఈ చిత్రపద్మమును చూచిన ప్రథమపాశ్చాత్యపండితులు ఇది ఒక రాశిచక్రమును విపులముచేయు చిత్రమని ఊహించిరి. కాని తర్వాత కొంతకాలమునకు ఇది ద్వాదశనిదానముల తత్వచిత్రమని పండితులు గుర్తించిరి.

ఈ గుహాముఖమందు అంగణమందు సయితము అనేకశిల్పములు కలవు. ఈగుహయందు ఉపగదులు పదునారు. అంతర్భాగమున శాలవెనుక క్రిమిరాజాసనమగుపి అనేకవర్ణచిత్రములు కనుపించును. ఈచిత్రములందు మహాప్రఖ్యాతి వహించినది ఆకాశగమనగంధర్వ చిత్రము. పండిత బర్గెసుగారు ఈ వర్ణచిత్రములందలి శిల్పము ఇటలీదేశమున, ౧౩,౧౪ వ శతాబ్దములందు ఉత్తమశిల్పుల వర్ణచిత్రములందలి శిల్పమునకు సమానమయినదని నుడివిరి. ఈ గుహయందు అతిప్రఖ్యాతి వహించిన మరి ఒక చిత్రము సింహళఅవదానచిత్రము. బర్గెసు మొదలయిన పాశ్చాత్యపండితులు ప్రథమమున ఈచిత్రము సింహళముపైన విజయుడు చేసిన దండయాత్రచిత్రమని ఊహించిరి. కాని పండితయాజదాని గారు ఈ చిత్రనిజస్వరూపమును తెలిపిరి.

ఈ గుహయందు కల చిత్రము లనేకములు ప్రశస్తమయినవి. అందున ముఖ్యమయినది—పరిషీయాదేశస్థుడు కానవచ్చు, అనేకచక్రవర్తులు కలిసిన చిత్రమొకటి. ఇదిగాక, అనేకరీతుల దంపతులు, అలంకరించుకొనుచున్న రాజమారి, కిన్నెరులు, విశ్వంతర జాతకము ఈ గుహయందు ప్రసిద్ధికెక్కిన చిత్రములు.

పదునెనిమిదవ గుహయందు పరికింపదగిన విశేషమేమియు లేదు. ౧౯ వ గుహసయితము అతిప్రఖ్యాతమయినది. ఇది ఒక చైత్యము. క్రమమున ఈగుహ ౯, ౧౦-వ గుహలను పోలినది. కాని కొన్ని స్వల్ప విశేషములందుమాత్రము భేదించినది. ఈ గుహానిర్మాణ కాలమునకు తొమ్మిది, పదవ గుహలు నిర్మితమయి

దాదాపు ఏడు శతాబ్దములు గడిచినవి. ఈ పంతొమ్మిదవగుహాయందు నిర్మితమయిన స్తంభములు చాల అలంకారమయమయినవి. పీఠము చతురస్రము. పీఠముపయిన పట్టిక (*Fillet*) అష్టకోణము. ఈ పట్టిక ఒక అడుగు వెడల్పున ఉన్నది. ఈ పట్టికపయిన ఆశ్యము వర్తులము. ఆశ్యముపయిన మరిరెండు పట్టికలు కలవు. ఈ పట్టికలపయిన అలంకారయుత రేఖాశిల్పము కలదు. ఈ రెండుపట్టికలమధ్యభాగము కొన్ని స్తంభములందు వర్తులముగాను, కొన్నిటియందు అష్టకోణముగాను ఏర్పడిఉన్నది. ఈ పట్టికల పైన రెండు వైపుల చిన్న పట్టికలు కలిగిన కుముద (*Torus*) కలదు. ఈ పట్టికలపైన ఆకులతో కూడిన లతాచిత్రము అతి ఇంపుగా మలిచిఉన్నది. దీనికి పయిన చతురస్రఫాలకము కలదు. ఈ ఫాలకముపయిన అడ్డముగా ఒక బోధిక ఏర్పడిఉన్నది. బోధికకు ఇరు వయిపుల బుద్ధప్రతిమలు మలిచిఉన్నవి. బుద్ధప్రతిమకు రెండుపార్శ్వముల, ఏనుగులనో, లేక శార్దూలములనో ఆ శిల్పులు మలిచిరి.

ఈ చైత్యగుహాయందు ఆదిత్యమున కల స్తూపము తక్కిన చైత్యమందలి స్తూపములవలె కాక, అనేకరూపముల సంకలనమయినది. ఈ స్తూపము అతివిఖ్యాతమయినది. ఈ స్తూపమునకు మధ్యన ఒక బుద్ధప్రతిమ కలదు. ఈ స్తూపమునకు చూడామణిపైన ఉన్న మూడు చిత్రములు రాతిన మలిచినవే. చూడామణి అనగా స్తూపశిరోభాగమున అమర్చిన అస్థుల పేటిక, ఫలకములరూపము.

ఈగుహాయందు అనేకవర్ణచిత్రములు కలవు. ఇవి ఎక్కువ శిథిలములు కాక నేటికి ప్రకాశమానముగనే నిలిచి ఉన్నవి. నిజముగా ఈ గుహ అతిశోభాయమానమయినది.

పూర్ణశిలాక్రమమున నిర్మాణమయిన ప్రథమ చైత్యగుహ ఇదే అనవలెను. కార్లీగుహాయందు మొదలిడిన కలపక్రమమునుంచి శిలాక్రమమునకు మార్పు ఈగుహాయందు పరిపూర్ణమయినదని చెప్పవచ్చును. ఈగుహానాటికి, అనగా క్రీస్తుకు దాదాపు ౨౫౦ సంవత్సరముల కాలమునకు ఆంధ్రశిల్పులు వాస్తువునందు శిలాక్రమమును పూర్తిగ సాధించిరి. వాస్తువునందు శిలా




క్రమమును ప్రదర్శించుటయందు ఈ గుహను మించినది ఎల్లోరాయందు విశ్వకర్మగుహ అనియే చెప్పవలయును. ఈ ౧౯ వ గుహయందు లోపలి వాసములు, దూలములు సర్వము శిలయందే మలిచి ఉన్నవి. ఏడు శతాబ్దములకు పూర్వము ౧౦ వ గుహయందు మొదలిడిన శిలావాస్తుపరీక్ష, ఆంధ్రశిల్పులు, అజంతాలందే ఈగుహన పూర్ణమొనర్చిరి. ఈగుహకు ముందుభాగమున, ఏడుమవయిపున ప్రఖ్యాతివహించిన నాగరాజును, అతని భార్యను మలిచిన దివ్యశిల్పము కలదు. ఈశిల్పము యొక్క శైలి సంపూర్ణఆంధ్రశైలియే కాని వేరు కాదు. కుడివయిపున ధనభాండమును పట్టుకొనియున్న కుబేరశిల్పముపయితము కలదు.

ఇరువదవ గుహ ఒక చిన్న విహారము. ఈగుహయందు వసారామూలములు సయితము రాతియందే మలిచిఉన్నవి. ఈగుహాయందలి వర్ణచిత్రములన్నియు మాసిపోయినవి.

ఈ తొమ్మిదిగుహాలందు రూపకల్పనలందు శిల్పుల స్వేచ్ఛావిహారము అతిస్పష్టము. అనేక హాస్యరసచిత్రములు ఇంపైనవి ఈగుహాలందు కానవచ్చును. కాని ముఖ్యముగ గమనింపవలసిన విశేషమేమన, చిత్రకళ అంతకుముందు ఎన్నడు ఎరుగని ప్రాముఖ్యత నంది, కరుణరసము ఈగుహాల చిత్రములందు విదితమగుచున్నది. ఆనాటికి బౌద్ధమతమందు మహాయానము ఒక నిశ్చిత

రూపము నందికొన్నది. ఈ మహాయానగతి ననుసరించి కరుణాసిద్ధాంతముసయితము పూర్ణస్వరూపము నంది కొనినది. కాని ఈసిద్ధాంతమునం దింకను దౌర్బల్యము పొడసూపలేదు. బుద్ధుడు, బోధిసత్వుడు నిర్వాణప్రదాతలేకాని, సర్వఇతర అఖిలావవరప్రదాతలు కాలేదు. ఈ గుహాలను నిర్మించి, అలంకరించిన శిల్పుల ఆంతర్యములు సయితము ఇట్టి స్వచ్ఛభావముల చేతనే నిబిడీకృతమయి, సహజపుష్టిని, స్వచ్ఛతను ఇంకను కోలుపోలేదు. కరుణరసము తగిన కల్పనలందే విదితమయినది. ఈ చిత్రములందు కళాకర్తల ఆంతర్యముల దౌర్బల్యము ఏమాత్రము గోచరించదు. కాని తర్వాత కొంతకాలమునకు వెలసిన బౌద్ధకళయందు ఆంతర్యదౌర్బల్యము అతిస్పష్టమయినది. ఆంధ్రశిల్పమందు సయితము ఈ ఆంతర్యదౌర్బల్యము స్పష్టము.

మిగిలిన పన్నెండు గుహాలు పైన గుహాలు మలిచిన ఒక శతాబ్దము గడచిన తర్వాత మలిచినవి. కరుణ సిద్ధాంతము ప్రబలి, ఆంతర్యము నీరసించినట్లు ఆ శిల్పములందు స్పష్టము. నిజముగా ఆ గుహాలందలి కళాభావము నీరసించిన ఆంధ్రరీతియే.

(సశేషము)



# సర్వస్వం

[కథానిక]

శ్రీ వేలూరి సహజానందం

ఆఫీసుపనంతా ముగించుకొని బయలుదేరేటప్పటికి బాగా చీకటిపడ్డది. అత నివ్వాళ ఇంటి కెంత తొందరగా వెళ్లా లనుకొన్నాడో అంత ఆలస్యం అయింది. కింద గుమాస్తాలకు పని అప్పచెప్పి, కాగితాలపై వాలుగింటి కళ్లా సంతకాలు చేసి, త్వరగా ఆఫీసు నుంచి బైటపడా లనుకున్నాడు. కాని ఆఫీసులో తొందరపనులన్నీ ఇవ్వాళే తయారయినై. ఎలాగై తేం బైటపడి కారులో బయలుదేరాడు. దార్లో ఏదో పెద్ద కొట్లోకి వెళ్లివచ్చి, కారు జోరుచేశాడు.

చుట్టూ ఆవరిస్తున్న అంధకారంలో శ్రీధరునికళ్ల ముందు ఉమ దీపరేఖలా ఉంది. దీపంచుట్టూ తిరిగే మిడతలాగా, ఉమయొక్క మనోహర ఉజ్జ్వలరూపం చుట్టూ అతని పరిభ్రమణ ఎప్పటికప్పుడు కొత్తే. కాపురానికి వచ్చి మూడేళ్లయినా, ఉమ అత నికెప్పుడూ ఒక కొత్త స్త్రీవలెనే ఆకర్షిస్తూవుంటుంది. ఈ సమ్మోహనపారవశ్యంలో నే అత నివ్వాళ ఎంతో ఉద్రేకంతో ఇంటికి వచ్చాడు.

స్నేహితురాండ్రతో ఉమ ఏదో చర్చిస్తోంది. చర్చలు తీవ్రంగా జరుగుతున్నయ్. శ్రీధరుడు బట్టలు మార్చుకొని, సావడిలోకి వచ్చాడు. కాని ఇంకా చర్చలు అంతూ పొంతూ లేకుండా సాగిపోతున్నయ్. ఒకటి రెండుసార్లు ఉమగదిముందు తచ్చర్లాడాడు. అయినా సంభాషణలు తగ్గలేదు. తన గదిలోకి వెళ్లి, కొనితెచ్చిన 'పాకెట్టు'ను తీసి, అలమరలో దాచాడు. ఉమతో కలసి హాయిగా 'బీచి'కి వెళ్లిరావా లనుకుని వచ్చాడు.

కాని ఉమ ఎప్పటిలాగానే తన ధ్యాసలో తాను మునిగివుంది. దారిలో అతను ఊహిస్తూనే ఉన్నాడు. తా నింటికి వచ్చేటప్పటికి ఏదో పుస్తకంతో తన్మయురాలై ఉంటుం దని. ఆ తన్మయత నాపి తాను షికారుకు తీసుకుపోగల ననుకున్నాడు. కాని ఇప్పుడు చుట్టూవున్న స్నేహితురాండ్ర పద్మవ్యూహాన్ని ఛేదించుకొని, ఉమహృదయాన్ని చేరటం అసాధ్యం అని అతనికి తెలుసు.

ఉమపై తీవ్రమైన క్రోధద్వేషాలు కలిగినయ్. ఒక్కొక్కప్పుడు తిన్నెలా ఆకర్షణతో పరవశం చేస్తుందో, మరొక్కొక్కప్పుడు అంతకంటె ఎక్కువగా తనలో విద్వేషాన్ని రగుల్కొల్పుతూ వుంటుంది ఉమ.

అత నీ సంతోష క్రోధాలతోనూ, ప్రేమద్వేషాలతోనూ తప్తహృదయుడై ఆక్రోశిస్తూ ఉంటాడు. తా నింటికి వచ్చేటప్పటికి, ఒక్కొక్కప్పుడు మౌనంగా కూర్చొని ఏదో పుస్తకం చదువుకూ ఉంటుంది, లేదా డాబాపైకి వెళ్లి శూన్యాకాశంలోకి రెప్పలు వాల్చకుండా చూస్తూ కూర్చుంటుంది. ఆమెమౌనం, ఆ కళ్లలోంచి తనను దాటి దిగంచలాలవరకు ప్రసరించే ఆమె చూపు చూసినప్పుడు అతని అంతర్యంలో ద్వేషాగ్రహాలు విజృంభించేవి. ఒక్కొక్కప్పుడు తా నింటికి వచ్చేటప్పటికి ఏవో సభలని, సమావేశాలని వెళ్తూవుండేది. ఆమెకు ఎదుటగా నిలబడ్డా, పక్కన కూర్చున్నా, తనకు ఆమెకు మధ్య యోజనాలదూరం ఉన్నట్టుండేది. ఆమెను తను బలవంతంగా పలకరించినా, ఆమెమాటలు హృదయస్పందిం లేక కేవలం ధ్వనిమాత్రంగా తోచేవి తనకు.

ఏమహాప్రవాహంయొక్క సుదూరతీరంపైనో ఆమె నిలబడగా, తా నీవలి ఒడ్డునుంచి హీనస్వరంతో ఆమెను పిలుస్తున్నట్టుండేది. తన సాన్నిధ్యం, తన

మాటలు ఆమెముందు నిశ్చలమైన సరోవరంలో ఎవరో అవ్యక్తంగా మట్టిపెళ్లలు విసిరి, నీటి శాంతిని చెదర గొట్టినట్టుండేది. ఇది అతనికి దుర్భరం. ఆమె రూప సౌందర్యాలకు ఆశను వివశుడై, ఆమెకై చేతులు చాస్తాడు. కాని తిన కఠినమై, తన బాహువుల్లో ఉన్న ఉమ తనకు యోజనాల దూరంలో ఉన్నట్లుండేది. ఆమెరూపం, సౌందర్యం తనవికాని, ఆమె తనది కాన ట్టుండేది. ఇది అతనికి దుస్సహం.

సర్వస్వమూ అయిన తనను శూన్యంగా ఎంచి, తన దృష్టి కతీతమైన ఏవో సీమల్లోకి ఆమె తిరుగా డితే, అతని హృదయం కుమిలిపోయేది.

ఇవ్వాళకూడా ఆమె ఎప్పటిలాగానే తన ధ్యాసలోనే తానుంది. అతని రాకకు గాని, అతని చూపులకు గాని ఆమె చలించలేదు. సంఘసమస్య లను తమ జీవన్మరణసమస్యలుగా ఎంచి తర్కిస్తున్న ఆ వాదగ్రస్తురాండ్రకు ఈ పురుషుని ప్రచ్ఛన్నవేదన తెలియదు.

౨

స్నేహితురాండ్రు చర్చలు ముగించి, ఇళ్లకు వెళ్లగానే ఉమ చావడిలోనూ, భర్త గదిలోనూ అటూ ఇటూ చూసింది. "బాబుగారు బైటికి వెళ్లిపోయారు" అని పనిమనిషి చెప్పింది. కాసేపటికి ఉమ డాబా మీదకు వెళ్లి, అనంతమైన శూన్యంలోకి చూస్తూ కూర్చుంది. చర్చలతో వ్యథితమైన మనస్సు కాశూ న్యంలో ఏదో శాంతి! ఆచీకటిలో ఏదో తృప్తి. పగలల్లా నడిచిన బాటసారి నదిఒడ్డున సొమ్మసిలి పరున్నట్టు ఉమ శూన్యంలోంచి వీస్తున్న చల్లని గాలికి సేదదీర్చు కొంటోంది. జీవుల సంక్షోభ, సంఘదైన్యం కల్గించిన నిస్పృహతో ఆమెహృదయం సంక్షుభితమైంది.

మళ్లీ ఈ ప్రశాంత ఏకాంతంలో ఆమెమనస్సు వైరాగ్యంలోంచి మేల్కొంది. అంతరాత్మ కన్ను తెరవనంతవరకు, కళ్లు మూసుకొని కాలం వెనక పడి పోవచ్చు. కాని అంతరాత్మ జాగృతమయాక? అను క్షణమూ సంఘర్షణ. అనుక్షణమూ విచారణ. దారి ద్ర్యమే తనకు తల్లి తండ్రులిచ్చిన కట్నమైనా, తండ్రి చెప్పించిన చదువే తనకు పెన్నిధి. భర్త చేస్తున్న పెద్ద ఉద్యోగంగాని, భర్త ఐశ్వర్యంగాని...వీటికన్న కూడ తండ్రి చెప్పించిన చదువు, ఆయనప్రబోధం... వీటినే ఆమె జీవితసర్వస్వంగా చూసుకుంటోంది. ఈ మూడేళ్లనుంచి ఎంతసేపూ పుస్తకపఠన, స్నేహితు రాండ్రతో విషయగోష్ఠి—ఇవే ఆమె కానందం. మధ్యమధ్య భర్తముఖంలో ఏదో అసంతృప్తి, ఏదో అశాంతి గోచరమై ఆమెకు విచారం కలిగేది. తానే విధంగా అతన్ని కష్టపెట్టోందీ ఆమెకు తెలియదు. ప్రేమానురాగాల్లో అతను సర్వదా పరవశమవుతూనే ఉంటాడు. కాని అప్పుడప్పుడు తనకు తెలియనిబాధతో నిర్జీవుడై ఉంటాడు. ఇంతవరకూ అతను తన్ను అడ్డగించలేదు. అడ్డువస్తాడనే భయమూ లేదు. కాని దాంపత్యంలోలాగా తన సంకల్పాల్లో, తన అంతర్జీవి తంలోకూడా భర్త సహధర్మచరుడుగా ఉంటే, తన జీవితం ఎంత ధన్యమయేది! భార్యాత్వముతో తప్ప తన వ్యక్తిత్వముతో భర్తకు సంబంధం లేదు. కాని రోజులు గడుస్తున్నకొద్దీ, ఆమెకు ఈ ఏకాంతం భార మౌతోంది. ప్రపంచముయొక్క కీకారణ్యమందు దారి చూసుకొని ముందుకుపోయే శక్తిసాహసాలు ఒంట రిగా నున్న తనలో క్షీణిస్తున్నాయ్. జీవితంయొక్క ఈ పవిత్ర, అంతర్వేదికఃద్దకూడా భర్త తనతో పాణి బంధం చేస్తే? జీవితం సార్థకమయేది. పుట్టింటికి వెళ్ళినప్పుడు తల్లి అనేది "ఎందుకే నీకీ పుస్తకాలు ఆలో చనలు! నలుగురిలాగా చక్కగా ఎదో ఇల్లూ, వాకిలీ భర్తనూ చూసుకొని సుఖంగా ఉండక" అని. నలుగురి లాగా! నలుగురూ సుఖంగానే ఉన్నారా? వాళ్ల అంతర్జీవితాలు ఎవరికి తెలుసు? ఎన్ని సంకల్పాలు వారి కన్నీళ్లలో నిప్పుల మాడుతున్నాయో! తానుమోసిన వెలు గుల ప్రమిదెలనిండా నింపి, ఇంటింటికీవెళ్ళి జీవి, జీవి యొక్క అంతరాత్మకు అందిచ్చి వస్తే! ఆ నిర్జీవ ముఖాల్లో తేజస్సు ఉదయించదూ? వ్యక్తి, దాంపత్య జీవితాలనుగురించి విచారణ చేస్తూ కూర్చుంది ఉమ.

౩

తీవ్రమైన అశాంతితో ఇల్లు విడిచి విహారానికని బయలుదేరాడు. కాని జనసముద్రంలో పడి అఉన్మత్త తరంగాల మధ్య తేలియాడుతూ వుండగా, అతని మనస్సు మళ్లీ విడిచిపెట్టివచ్చిన పంజరంకోసం పరి

తపించింది. జనపారవశ్యతకు అతడూ పులకరించి, ఉమస్పర్శకోసం ఉద్రిక్తుడయాడు. కలిగినవిద్వేషానికి ఛీత్కరించుకున్నాడు. తనకు తెలుసు–ఉమకు పుస్తకాలు, విషయాలు, చర్చలు, సభలు చాలా సంతోషం అని. చదువు, చర్చలు ముగిశాక, ఉమ తనవద్దకు ఎంతో సంతోషంతో వచ్చి కూర్చుంటుంది. ఆముఖంలో, కళ్లలో ప్రతిఫలించే ప్రేమప్రసన్నతకు హర్షంతో నిండి, తాను ఆమె కౌగిలిలో తన ఈతాత్కాలిక విద్వేషాలను మరచిపోయేవాడు. ఈసారీ తాను మళ్లీ ఇంటికి తిరిగివెళ్ళేప్పటికి, ఉమ ఉషస్సులా ఉంటుంది. తన హృదయం అంధకారం పోయి వెలుగుతో నిండుతుంది. గృహోన్ముఖుడయాడు. కారు యజమాని అభీష్టాన్ని తెలుసుకొని జోరుగా దూసుకుపోతోంది.

ఇంట్లో అడుగుపెట్టి లైటు వేశాడు. ఇల్లాలు డాబాపైన ఉందని పనిమనిషి చెప్పింది. అతని అలికిడి విని ఉమ కిందకు వచ్చింది. ఆమెముఖం సంతోషంతో చంద్రబింబంలా ఉంది. అతను వెళ్లినప్పుడున్న ఆలోచనాతీవ్రతపోయి ఇప్పుడు కలకలలాడుతూందోది. ఉమ ప్రసన్నముఖం, ఆనందం చూడగానే అతనివిద్వేషాని కతనే లజ్జచెందాడు. అతనికి తెలుసు – ఆమె డాబాపై కూర్చొని, శూన్యంలో బయలుదేరి అజ్ఞాత పుణ్యతీర్థాలు, అదృశ్య ఉద్యానవనాలు చూసి చూసి ఆ మహదానందంతో నేలమీదికి తిరిగివచ్చి ఉంటుందని. ఆమె ఆ ఉల్లాసమే ఇప్పుడతన్ని మరింత పెనవైచి లాగుతూంది.

భోజనాలయాక ఉభయులూ డాబామీదికి వెళ్లారు. మెట్లమీద మధ్యలో ఆగి కిందకు దిగి వచ్చాడు. మళ్లీ పైకి వెళ్లి డాబాగదిలో అడుగు పెట్టాడు. అప్పుడే వెలిగినదీపకాంతిలో ఆమె వెన్నెల్లో మల్లెపువ్వులా ఉంది. "ఇదిగో... సిల్కు చీర... తెచ్చాను." అని 'పాకెట్టు' పైకాగితం చింపాడు. అతని ముఖం పసిపిల్లవానిముఖంలా ఉంది. సంభ్రమంతో ఆమెపెదవులు కదలినయ్. కళ్లు తళుక్కుమన్నయ్.

"ఎన్ని కొంటారు?...ఎందుకింత డబ్బుపోసి... పదిమందికి కొత్త చీరెలు వచ్చేవి." అంది.

తమ ఇద్దరిమధ్యన ఛాయామాత్రంగా నుంచున్న లోకదైన్యం చూసి అతను ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

"పదిమందిసంగతి మన కెందుకు? నీకీ చీర చాలా బాగా ఉంటుంది." అని అతను మెల్లగా గదిలోంచి వెళ్లి, బైట పక్కలో పరున్నాడు.

మబ్బుల్లోంచి అప్పుడే రెప్పలు తెరుస్తున్నాడు చందమామ. గదిద్వారంలోంచి అర్ధచంద్రుని నిశీథంలోకి అడుగుపెట్టింది ఉమ. అతనానందంతో గర్వంతో చూశాడు. ఆమె వచ్చి అతని నుదుటిపై చెయ్యి ఆన్చింది. పిల్లవాని చిలిపివేళ్లు తగిలి వీణాతంత్రులు 'జంయ్'మని మోగినట్లు, అతని నరాలన్నీ ఆ స్పర్శకు జలదరించి, రహోవాంఛలతో హోరెత్తినయ్. తలంటిపోసుకున్న జుట్టు ముడి విడి ఆమె పిరుదులదాకా పడ్డది. పొడుగాటి, పుష్కలమైన ఆ నల్లని జుట్టు గాలిలో రేగుతోంది. ఈ రూపం, ఈ సౌందర్యం, ఈ స్పర్శ...అతని కప్పటికప్పుడే ఏదో కొత్త. ఈ వెలుగుచీకటుల దాగుడుమూతలకు ఆమె హృదయం ఎలా స్పందిస్తోందో! ఆమెకేసి మంత్రముగ్ధుడై చూస్తున్నాడు. కనులకైపు తగ్గి చూడగానే, ఆమె కనులు మూసుకొని నిద్రపోతోంది.

అంగాంగమూ జాగృతమైన అతనికి ఆ నిశ్చల ప్రశాంతనిద్రితముఖాన్ని చూడగానే తీరని వ్యథ కలిగింది. ఈ సుషుప్తరాశి సౌందర్యం, సమ్మోహనం అతన్ని పరవశం చేస్తున్నయ్. నిద్రపోతున్న ఆమెను చూస్తున్నకొద్దీ అతనికి వ్యాకులం హెచ్చింది. దుర్విధి అమృతంలో విషం చిందించింది. మళ్లీ దుఃఖ క్రోధాలతో కుమిలిపోయాడు. భగ్నహృదయంలో ద్వేషం మళ్లీ పడగెత్తింది. ఎంత అమాయకంగా నిద్రపోతోంది! ఎంత గాఢంగా! తనగుండెలో కార్చిచ్చు రగిల్చి ఈ అంతర్ధానం, ఈ అంతర్దాహం చూస్తూ. ఈమెలో ఎంత క్రౌర్యం? ఎంత హింసాపిపాస? కొలదికాలంక్రితం చల్లారిన వనుకున్న ద్వేషజ్వాలలు భగ్గున మండి క్షీణుడిని అపాదమస్తకం దహించివేస్తున్నయ్. తన్నిలా హింసించి, హతం చేస్తున్నందువలన ఆమెకు కలిగే ఆనంద మేమిటి? పరాభవంతో కళ్లలో నిప్పు రగిలింది. అప్పు డామె అతని కళ్లను చూసిఉంటే, అవి విషపాత్రలనుకునేది. ఒరలోంచి దూసిన కత్తుల్లా అతని కళ్లలోంచి చూపులు చురుక్కున దూసుకుపోతున్నాయ్.

దెబ్బతిన్న తాచుల్లా ఉన్న అతని చేతులు ఆమె నడుమును తాకినయ్. యంత్రబద్ధంగా ఆమె అతనివైపు తిరిగింది. అతనామెను హృదయానికి హత్తుకున్నాడు. ఆమెజుట్టుపై అతని చెయ్యిపడగానే, అతనిలో వాంఛ ఉప్పొంగింది. కాని ఆమె కాస్పర్శ అజ్ఞాతం. ఆమెకు నిద్రాభంగం కాలేదు. ఆమెకలలు చెదిరిపోలేదు. శరీరం అతని బాహువుల్లో ఉంది. కాని ఆమె లేదు.

ఇదే అతనికి దుస్సహం. ఇద్దరి మధ్య, బాహువుల మధ్య మళ్లీ యోజనాల దూరం. ఏదో మహాప్రవాహం యొక్క ఆవలితీరంపై ఆమె... ఈవలితీరంపై తాను... తమఇద్దరిమధ్య ప్రవాహం...ఆమె రూపసౌందర్యాలు.

ఆమెపై అతనికి క్రోధద్వేషాలు హెచ్చుతున్నయ్. ఆమెపుస్తకాలు...స్నేహితులు...చర్చలు...సభలు...సమావేశాలు...ఒక్కసారిగా శూలాలై అతని హృదయంలో గుచ్చుకుపోయినయ్. మనస్సులో విపరీతమైన ఆలోచనలు చెలరేగుతున్నయ్. కొంతసేపటికి అతనికి మగతనిద్ర పట్టింది. క్రమంగా స్పృహ తప్పింది. అతని కతను తెలియదు. బహిశ్చైతన్యంపై నల్లతెరలు దిగినయ్...ఇంక తెరలవెనుక కల్లోలం...

...గదిలో పక్కలోంచి ఉమ మెల్లగా లేచి, అటూ ఇటూ చూసి, తలుపులు తీసింది. అతను కళ్లు తెరవలేదు. మెల్లగా మెట్లు దిగి కిందికి వెళ్తోంది... ఆమె. ఉమపదధ్వని అతనికి వినబడుతూనే ఉంది. వీధితలుపులు తీసిన చప్పుడయింది. మెల్లగా లేచి గదిలోంచి వెళ్లి పిట్టగోడచాటున పొంచి చూస్తున్నాడు శ్రీధరుడు. వీధిలో ఆమె తొందరతొందరగా వెళ్తోంది. శ్రీధరుడు గబగబ మెట్లు దిగి వీధిలోకి వెళ్లాడు. పరుగెత్తి ఒక్కుమ్మడిన ఆమెపై బడి హత్యచేయాలనుకున్నాడు. కాని ఆమెసంకల్పం సంపూర్ణంగా తెలుసుకోవాలనే కుతూహలం అతన్ని అవరోధించింది. వెనకాలే దూరంగా వెళ్లాడు. స్టేషన్‌రోడ్డుపై ఆమె కాలుపెట్టగానే అతనిసంకల్పం తీవ్రమయింది. తన్ను విడిచి వెళ్లిపోతోంది ఉమ...ఎక్కడికో? ఎందుకో? వెళ్ళిపోవటం నిశ్చయం...గబగబా ఉద్రేకంతో నడిచాడు. సమీపించాడు...అడుగుల అలికిడి అయి, వెనక్కు తిరిగి తనను చూడగానే ఉమ క్షణమాత్రం నిశ్చేష్టురాలయింది.

“వెళ్లటానికి వీల్లేదు...పద ఇంటికి” అన్నాడు.

నిశ్చలంగా జవాబుచెప్పింది- “ఈ అధ్యాయం ముగిసింది. నేను తిరిగిరాను.”

ఆమెముఖం గంభీరమైంది. నిర్భయంగా ముందు కడుగులు వేసింది.

“నీకు ప్రాణాలు దక్కవు” అన్నాడు.

“వాటిపై నా కాశలు లేవు” అంది ఉమ.

శ్రీధరుడు వెనక నడవటమేగాని కర్తవ్యం చేయలేకపోతున్నాడు. అతనిలో శక్తి క్షీణిస్తోంది. ఉమ అతనికి దూరమవుతోంది...దూరంగా రైలుకూత వినబడుతోంది. గబగబా నడిచాడు...గుండెలో రొప్పు హెచ్చింది. పరుగెత్తాడు. ప్లాటుఫారంమీదికి రైలు వచ్చింది...గంట కొట్టారు...ఆమె ఏదో పెట్టెలో ఎక్కబోతోంది. నాలుగంగలు వేశాడు. ఇంకో గంట కొట్టారు. ఆమె ఎక్కబోతోంది. పక్కనుంచి బలవంతంగా తోశాడు. ఒక్కున కింద పట్టాల్లోకి జారిపోయింది...రైలుచక్రాలు కదిలిపోయినయ్.

* * “ *

శ్రీధరుని రెండుచేతులూగట్టిగా పట్టుకుని, “ఇదేమిటి? నాగొంతుక పిసుకుతున్నారు?” అని తన యావచ్ఛక్తితో అతని చేతులను విదల్చింది ఉమ. అతడు ఉలిక్కిపడి లేచి కంగారుగా చూశాడు. ఆమెకళ్లల్లో ప్రాణాలు లేవు. ముఖమంతా భయంతో గాండ్రిల్లుతోంది. అతని భయంకర నేత్రాల్లోకి చూసి, “నన్ను చంపుతున్నారు ... మీరు చంపుతున్నారు” అని అరిచింది. అతను కళవళపడ్డాడు...క్షణంక్రితం నెత్తురు మడుగుగా చూసిన ఉమ సజీవంగా తనను ప్రతిఘటిస్తోంది. అతని కేమీ బోధపడలేదు. ఏది నిజం ? రైలు చక్రాలా ? లేక హత్యచేయబోయిన తన చేతులా ? అతనికి చైతన్యం నశించింది.

“ఉమా! ఏదో పీడకల...ఏదో దయ్యం... ఛీ...ఛీ.. భయంలేదు...” అని లేచి కూర్చున్న ఉమ తలను తన గుండెలోకి తీసుకున్నాడు శ్రీధరుడు. కాస్సేపటికి భయకంపం తగ్గి, అతని గుండెపు తన తలను గట్టిగా అన్చుకొని, “ఇంకెప్పుడూ మనం ఇక్కడ పడుకోవద్దు” అంది. అతని ముఖంలో ప్రేమను, ఆతురతను చూసి, స్థైర్యం చెందింది.

“నా అదృష్టం. మీరు కాబట్టి ఆ దయ్యాన్ని తోసివేయగలిగారు. లేకపోతే ఈపాటికి నెత్తురుగక్కుదును” అని అతని రెండుచేతులను తన గుండెమీద అన్చుకుంది ఉమ.

ఆమెతలను నిమురుతూ, “పీడకల...మరిచిపో... మన నేదయ్యమూ వేరు చెయ్యలేదు.” అన్నాడు శ్రీధరుడు.

కొంతసేపటికి ఆమెకు మెల్లగా నిద్రపట్టింది, కాని అతనికి పట్టలేదు. స్వప్నజాగరణల తీవ్రసంఘర్షణలతో సొమ్మసిల్లాడు. అతని అభయం తీసుకొని ఆమె నిశ్చింతగా నిద్రపోతోంది; కాని అతనికి శాంతి లేదు. సుఖం లేదు. నిద్ర లేదు.

ఏదో భయంకర నాటకం ఆడుతున్న రంగస్థలంలో ఉన్నాడతను. తెరలను తొలగించు...భయానకం. తీపిమాటలవెనుక రక్తదాహంతో తపించే తేనె పూసిన కత్తు లెన్ని? ప్రసన్నత చూపే నేత్రాల్లో కలుగులందు దాగిన వల్లకాటు లెన్ని? ప్రతివాడూ ఒక రంగస్థలం...నేపథ్యంలోనే నిజనాటకం!

## ౪

తన అంతర్యంయొక్క అవ్యక్త, రహస్య అభిప్రాయానికి శ్రీధరుడు దుఃఖించాడు. అతని కళ్ళముందు రైలుచక్రాలు...వాటిలో చిక్కుకొన్న ఉమ...నెత్తురు-చిమ్మిన తన కళ్ళు పోవట్లేదు. ఉమ తన చేతులను గట్టిగా విదల్చకపోతే, తాను హంతకు డయ్యేవాడు—తనకు తెలియకుండా. తనను చూసి తానే భయపడ్డాడు. తన ద్వేషం ఇలా మహావిషసర్పమై బుసలుకొట్టుతోందని అతనూహించలేదు. రాత్రి అన్నా, నిద్రఅన్నా విపరీతభయం కలిగింది. ఉమను కింద పడుకోమని, తాను మైగదిలో పడుకుంటున్నాడు. ఇలా విడిగా పరున్నా, అతని వ్యాకులం తగ్గలేదు. మధ్యమధ్య నిద్రలో లేచి, గంటలకొద్దీ మేల్కొనివుంటున్నాడు. పడుకున్నా, ఉమ పుస్తకాల అలమరలు...స్నేహితులు...చర్చలు...సభలు...అభయంకరమైన హత్యాదృశ్యం కళ్ళముందు పదేపదే గోచరిస్తున్నాయ్. తన అంతర్యం ఉమ తెలుసుకుంటే? తనలో రగులుతున్న చిచ్చు ఆమె చూడగలిగితే? ఆమె తన గోష్ఠిని మరచి, తననే సర్వస్వంగా ఎంచుకుంటే? తనకీ అసంతృప్తి, ఈ ద్వేషం ఉండవు.

భర్తలో కనబడుతున్న మార్పు ఉమ కర్థం కాలేదు. అతని ఆదరాభిమానాల్లో లోటు లేదు. కాని ముఖంలో అంతర్వ్యాకులంయొక్క విషాదచ్ఛాయలు స్పష్టంగా కనబడుతున్నాయ్.

నిద్రపట్టక మెల్లగా డాబామీదకు వెళ్ళింది. నిశ్శబ్దంగా వచ్చిన ఆమెను చూడగానే అతను ఉలిక్కిపడ్డాడు. శ్రీధరుడు నిద్రపోవటం లేదు. దీపం వెలుగుతూనే ఉంది. అంత నెంత ప్రయత్నించినా, తన్ను తా సంబాళించుకోలేకపోయాడు. ముఖం కళావిహీనమై, కళ్ళు నిరాశభావంతో ఉన్నాయ్.

"ఇక్కడ...ఇలా...ఒంటరిగా నిద్రలేకుండా" అంది ఉమ.

శ్రీధరుడు మాట్లాడలేదు.

"క్షమించండి...నే నేమైనా కష్టం కలిగిస్తే" అని అన్నది మళ్ళీ ఉమ.

ప్రయాసతో - "ఛా......క్షమించటాని కేముంది! నువ్వు కష్టం కలిగించట మేమిటి? ఏమీ లేదు" అన్నాడు.

"కాదు. నన్నిలా బాధించవద్దు." అంది ఉమ.

కాసేపయాక అతను ఉమచేతులను తన చేతుల్లోకి తీసుకొని, "ఉమా" అన్నాడు.

ఆమె అతనికళ్ళలోకి చూసింది.

"ఉమా! నే నెప్పుడింటికి వచ్చినా, ఇంట్లో వున్నా, ఎప్పుడూ ఏదో పుస్తకాల్లో మునిగి ఉంటావు...స్నేహితులతో చర్చిస్తూ ఉంటావు. సభలూ...సమావేశాలూ...డాబాపైకి వస్తే ఆకాశంలోకి చీకట్లో, వెన్నెల్లో మౌనంగా గంటలకొద్దీ చూస్తూ కూర్చుంటావు...సముద్రానికి వస్తే ఆ అలల అటుపోట్లు వింటూ నిన్ను నువ్వు మరచిపోతావు. నువ్వు నాకు సర్వస్వం...ఉమా...కాని...కాని...నేను నీకు సర్వస్వం కానా?" అన్నాడు శ్రీధరుడు.

ఆమె నిర్ఘాంతపోయి, నిశ్చేష్టురాలైంది. కళ్లు తక్కన దీపా లారినట్టున్నాయ్. దీర్ఘనిశ్వాసాలతో ఆమెగుండె బరువెక్కింది. విన్న ప్రతిమాటా బాణంలా గుచ్చుకపోయింది అంతరాత్మలో. తన తలను అతని హృదయానికి అన్చుకుంది. ఆమె తప్తాశ్రువులకు అతని హృదయతాపం ఒకింత చల్లారింది.

## ౫

"ఏం...అమ్మగారు...పుస్తకాలు_ఇక్కడనుంచి తీసేస్తున్నారేం?" అని అడిగింది పనిమనిషి.

ఉమ జవాబివ్వలేదు. ఒక్కొక్క పుస్తకం తీసి మూలగదికి పంపుతుంటే, ఆమెకళ్లలో కలుగు

తున్న కలవరం పనిమనిషి చూస్తూనే ఉంది. కాని ఈ అశ్రుగాథ దానికి తెలియదు. యజమానురాలు చదువుకొన్నదని, అందమైనదని గర్వపడేది. కాని ఈనాడు పుస్తకాలు కొట్టుగదికి చేరుకుంటున్నయ్. హఠాత్తుగా కళ్లు గిర్రున తిరిగి, ఉమముఖం ముడి పెక్కినట్టుంది.

ఉమ అస్వస్థత స్నేహితురాండ్రకూ అర్థం కాలేదు. తమకు ఎంతో చేయూతగా ఉంటున్న ఉమ ఇలా దారిపక్కన ఎందుకు నిలబడి, కూలబడి పోయిందో వాళ్లకూ బోధపడలేదు. క్రమేపీ వారి రాకపోకలు తగ్గిపోయినయ్.

సభలూ, సమావేశాల్లో ఉమ కన్పించట్లేదు.

మూలగదిలో తాళాల బీరువాల్లో పుస్తకాలు యావజ్జీవఖైదీల్లా ఉన్నయ్.

అప్పుడప్పుడు మధ్యాహ్నం ఉమ మూలగది తలుపు తీసి, బీర్వాల దగ్గర కుర్చీలో కూలబడిపోయేది. పనిమనిషి వచ్చి, "అమ్మా...ఈ ఉక్కలో...... చీకట్లో...ఏమిటి......నేను పుస్తకాలు తెస్తాను... పదండి...పాపడిలోకి" అనేది. కాని మెల్లగా లేచి గదితలుపులు తాళంవేసి, వెళ్ళి మంచంలో పడుకునేది గోడకున్న భర్తఫోటోకేసి చూస్తూ.

భర్త ఇంట్లో ఉన్నంతసేపూ...అతనితో కబుర్లు, ముచ్చటలు...నవ్వులు...ఆఫీసునుంచి తిరిగి ఇంటికి రాగానే చక్కగా అలంకరించుకుని స్వాగతమిచ్చేది ఉమ. ఉభయులూ కలసి బీచికో, క్లబ్బుకో వెళ్లేవారు. తిరిగివచ్చి, డాబాపై, ఉమకౌగిలిలో శ్రీధరుడు నిశ్చింతగా నిద్రపోయేవాడు.

ఉమముఖం చూసి, పనిమనిషి చెప్పింది:

"బాబుగారూ! అమ్మగారి సంగతి మీరు చూడట్లేదు...చూడండి...ఆముఖం...నానాటికి చిక్కిపోతున్నారు. డాక్టరును పిలవండి." అని.

శ్రీధరునికి తెలుసు. ఉమముఖంలో ఇప్పుడా మనోహరసౌందర్యం, సమ్మోహనం లేవు. ఆకళ్లలో అతని కతీతమై, అతిలోకమైన ఆచూపు లేదు. రోజు రోజుకూ కృశిస్తోంది. ప్రాణం లేని నిర్జీవప్రతిమలా ఉంది. ఆ మనోజ్ఞ, ఉజ్వలరూపం పోయి, పిండి బొమ్మలా ఉంది. వైద్యులూ చప్పరించారు. మందులే దన్నారు.

శ్రీధరుడు ఆఫీసునుంచి తిరిగివచ్చేప్పటికి బాగా చీకటిపడ్డది. అతని కళ్లముందిప్పుడు దీపరేఖ మెరవట్లేదు. దీనముఖి కనబడుతోంది.

"ఇంత చీకట్లో ఎలా ఉన్నావు...ఉమా" అని లైటువేసి దగ్గరకు వెళ్లాడు.

బల్లిలా మంచాన్ని అంటిపెట్టుకొనివుంది ఉమ. తన రెండు కుమ్మహస్తాలతో అతనిముఖాన్ని నిమిరింది. సంతోషం చూపటానికి కళ్లు ప్రయాసపడినయ్. కాని అక్కడ వెలుగు ఆరిపోయింది.

"ఇంత ఆలస్యంగా వస్తే ఎలా? నాకేం తోస్తుంది?"

అని అన్నది ఉమ. పెదవులపై తటిత్తు మన్న దరహాసం విషాదంలో వెలవెలపోయింది.

శ్రీధరుడు మెల్లగా ఆమెను డాబామీదికి తీసుకు వెళ్ళి, పక్కవేసి పడుకోబెట్టాడు.

ఆమెపక్కనే కూర్చొని, "ఉమా! వళ్లంతా పాలిపోయింది. ముఖం నిరుత్సాహంగా నిర్జీవంగా ఉంది. ఎప్పుడైనా ఇలా ఉన్నావా? నీ ఆరోగ్యం పాడైంది...ఆఅందంలేదు ఇప్పుడు." అని అన్నాడు.

కొలదినిమిషాలు గడిచాక, అతని చేతులను తన దుర్బలహస్తాల్లోకి తీసుకొంది. అతని వ్యాకులిత ముఖాన్ని చేతులతో తడిమింది. హీనస్వరంలో ఉమ-

"ఊహూఁ! ఉత్సాహం...జీవం...ఆరోగ్యం... అందం..." అని తీవ్రమైన ఆయాసంతో, "ఇవన్నీ... ఎందుకు నాకు...మీరే నా సర్వస్వం" అని అతని చేతులను తన గుండెమీదకు తీసుకుంది.

---

# రాయలకళింగ జైత్రయాత్ర

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

౨

గజపతి సామాన్యశత్రువు గాడు. రాష్ట్రకోశబల సంపదలం దతని కధికులగు రాజు లప్పటి భరత ఖండమున నెందరో లేరు. తనతో పాటు దక్షిణభారతావని పాలించుచుండిన యశ్వపతినరపతులకు అతడు సమానస్కంధుడు. రాష్ట్రవైశాల్యమునందేమి, కలిమి బలములలోనేమి, శక్తిసామర్థ్యములందేమి వారి కెంత మాత్రమును దీసిపోయెడివాడు కాడు. ఈయంశము ఆముక్తమాల్యదలోని ఈక్రిందిపద్యమునందు సూచింపబడియున్నది:

"రయమున వృష్టికై యొదిగి
రచ్చలపై విధియింతు రుగ్రతన్
హయపతిమీద దంతిపతి
నారినిపై నృపతిన్ గజాదిని
ర్ణయముల మొత్తులాడుదురు
ప్రబ్బికయించుక విప్పవిచ్చు మొ
గ్గయి నుతిపానిపోదురు స
మస్తదిశాగతులైన యధ్వగుల్." (౮-౧౩)

ఈపద్యముపై వ్యాఖ్యానమునందగిన చర్చ యొకటి రాయవాచకమున గలదు. ఇందు విజాపుర రాజసౌధమున కృష్ణరాయలు విజాపురముపై నెత్తిరాబోవుచున్నాడను వర్తమానము తెలియవచ్చినంతటనె యచట గూడియుండిన నానాసంస్థానముల స్థానాపతుల మధ్య జరిగిన చర్చ వర్ణింపబడియున్నది.

"దాదిమహాలమందు ముందరదివాణంలో ముందర ఆయాపశీర్లు దొండోపండితులు మొదలయిన వారు నియోగ్యులు వారివద్ద కతపనములకవారి హాజీలు ముకుందపండితులు మొదలైనవారు కూర్చుండి ఆలోచన చేసినది:—

* * *

"'అశ్వపతిగజపతినరపతులలో నరపతిసింహాసనమే అధికము. కనుక రెండుసింహాసనములున్నా వారి వెనుకను' అని పిన్నపెద్దలు ఆలోచనగా చెప్పినందులకు గోలకొండవారి ముద్రాపండితులు, 'సింహాసనాలంటె మూడున్నూ సరి. ఇందులో సింహాసనాధిక్యములు కలవా?' అని ఆగ్రహపడగా, 'నిజాంరవుతులు మా వుత్తులు లశికరీతనాన సరికదా; ద్రవ్యసామగ్రియందు దుర్గములయందు కొదవ; అట్టిసట్ల అధికమని చెప్పవలసిన కారణ మెందది?' అన్నందులకు గోలకొండవారి ముద్రాపండితులు వ్యంగోక్తముగా, 'కాకయేమి? మరేమి? యిందులో న్యూనాధిక్యములు యెంచ అవకాశ మేమి వున్నది?' వొకరి కొకరు ఏకవాక్యముగా ఆడుకొన్నందులకు, బాహుబలేంద్రునివారి బ్రహ్మపంతులు వారలతోను, 'యీ మూడు సింహాసనములనగా బ్రహ్మవిష్ణుమహేశ్వరుల అంశలుగా వుండును. అందున తారతమ్యములు యేరీతో అతిశుద్ధమైనే అశ్వపతిసుత్రాలకున్నూ, గజపతిరేనగులకున్నూ నరపతికర్నాటకసింహాసనానకున్నూ; గనక నరపతియే హెచ్చు. అది యేలాగంటేను—భగవద్వాక్యం, 'నరాణాంచ నరాధిపం' అనే వచనమువల్లనున్నూ: ఆ రాజ్యములోను దేవాదాయం బ్రహ్మదాయం పుణ్యతీర్థములు నదులు పుష్కరిణులు గల్గివున్నది. ఇదిగాక విష్ణువు ప్రత్యక్షమై వెంకటాచలాన వున్నారు; ఆ రాజ్యములో వుండే స్వామికి కడమరాజ్యములో పెద్దలు బుద్ధిశాలులు బ్రాహ్మలు యతీశ్వరులు మఠాధిపతులు రాజులు మొదలైనవార లందరున్నూ కానుకకప్పములు కొంచుబోయి స్వామికి సమర్పించి వస్తావున్నారు; గనక కర్నాటకసింహాసనాధిపతులు పుణ్యశ్లోకులు. ఆ పిమ్మట గజపతిసింహాసనమందు జగన్నాయకులు వెంచేసియున్నారు; గనక రెండోపర్యాయము. అశ్వ

పతివారున్ను గంగాతీరాన విశ్వనాథులరాజ్యములో వున్నారు; వారితెగలవారి యొదులపాహు, కుతపనము లక, నిజాంశాహుయామాను తెగలవారున్ను కర్నాటకం పరుదున వున్నారు. మీరు కర్నాటకాధిపతులతో పరియన నగునె? అని మధ్యస్థభావముగా అన్నందులకు దొండ్డో పండితులు ముద్దో పండితులుదాదో పండితులున్ను దొడ్డనియోగ్యులుగనక తెలుసుకొని తమ దొరలు మద్యపానులు; దేవబ్రాహ్మణవిశ్వాసములు లేవు, మ్లేచ్ఛులు, గోహింసకులు, వారిని గొలిచినవారము; గనక దూరదృష్టి విచారించ అవకాశ మంత లేక అహంకారగుణమువల్ల అవచలసిన దంటిమి. బ్రంహ్మపంతుల వారు పలకరించినది యథార్థమని యెంచినవారై అతర్వాత మంత్రాలోచనగా వార్తలాడినవి."1

పైనుదాహరింపబడిన యాముక్తమాల్యద మున్నగు గ్రంథముల సాక్ష్యములవలన కృష్ణరాయల కాలమున గజపతికలిమిబలమునుగూర్చి జనసామాన్యమెట్టి యభిప్రాయమును గలిగియుండెనో తెలియవచ్చుచున్నది. అంతటి ప్రబలునితో పోరు నిశ్చయించినపుడతని నోడించి జయమును బొందుటకు తలసిన ప్రయత్నము సేయుట యుక్తము. విజయనగరసంస్థానము సేనాబలమున దక్కువదైనది కాదు. 'గజపతిపై దండువెడల నిశ్చయించి యతడు (కృష్ణదేవరాయలు) ముప్పదినాలుగువేల కాల్బలమును, ఎనిమిదివందల యేనుగులును గల సైన్యమును సమకూర్చి, యాసేనతో గూడ ఉదయగిరిని జేరెనని న్యూనిజు వ్రాసియున్నాడు. 2 కాని యర్వాచీనగ్రంథములగు రాయవాచకమందు రాయరాణువసంఖ్య యెనిమిదిలక్షలను మించిపోయినది. గణుతిప్రకారము రాయరాణువయందు 'కైజీతంగుఱ్ఱాలు పండ్రెండు వేలున్ను, అమరనాయకంగుఱ్ఱాలు యిరువైనాలుగు వేలున్ను, కైజీతం యేనుగులు యాభై ఘట్టాలును అమరపుయేనుగులు నూటయిరువై ఘట్టాలును (౧౪౦౦, ఘట్ట మనగా ౧౦); కైజీతం రాణువనూతనంపహోగా మూడులక్షలున్ను, అమరంపగను అయిదు లక్షల బలమున్ను' ఉండె నని కలదు. ఈ మహాసైన్యమును, వీరితో గూడ అరగపదునెనిమిదికంపణాల బోయదొరలను గదల్చుకొని యుమ్మత్తూరిపై నడచి యారాజ్యమును జయించి తురకలమీదను గజపతిమీదను నెత్తిపోయె నని చెప్పియున్నది 3

1. రాయ. పుటలు ౪౩-౪౯.

2. *Sewell. F. E. P 316.*

3. రాయ. పుట ౫౩, ౭౪, ౭౬. కాని రాయవాచకమునందే మతియొకచోట రాయరాణువసంఖ్య కొంచెము వ్యత్యాసముగ గానవచ్చుచున్నది. ౩౪ వ పుటయందు గుఱ్ఱములు ౨౪౦౦౦, ఏనుగులు ౧౫౦౦౦, బంట్లు ౨,౦౦,౦౦౦, అమరనాయకంగ్రాలు యేనుగులను పండ్రెండువేలున్ను, కాల్బలములు ౨౦౦౦౦౦' (పుట. ౫౦) అని లెక్కింపబడియున్నది. కాని ఇది విశ్వాస్యము గాదని తోచుచున్నది. ఏలవగా, రాయవాచకమర్వాచీనగ్రంథము; మతియు రాయవాచకమున కృష్ణరాయలతో గూడ అయ్యవమలక, అంకుశఖానుండు, రాణాజగదేవు, గని తిమ్మప్పనాయడు, రామారిరామనాయడు, పెంమసాని లింగమనాయడు, హండే మల్లరావు, బోయిరామప్ప, హరివాణంకొమాళ్ళయిన పదునెనిమిది కప్పణాలవారున్ను దళనాయకులు అప్పరపిళ్లె, కుప్పురపిళ్లె, సాళువనాయడు, కొమారతిమ్మప్ప, సంగ్గరాజు, చేర్వప్రధాని, తిప్పరసు, అయ్యప్పనాయడు, కొటికవిశ్వనాథనాయడు, చెవ్వప్పనాయడు, అక్కప్పనాయడు, కృష్ణప్పనాయడు, వెలిగోటి యాచమనాయడు, కన్నడ బసవప్పనాయడు, సాళువ మేకరాజు, మట్ల అనంతరాజు, తింమరాజు, వీరమరాజు మొదలయినవారున్ను' దండయాత్రకు బయలువెడలినట్లు చెప్పియున్నది. కాని పైజేర్కొన్న దొరలలో అయ్యవమలక, అంకుశఖానుడు వీరిరువురు సదాశివరాయల కాలమున నుండిరి; చెవ్వప్పనాయడచ్యుతరాయల కాలమువాడు; వీ రెవ్వరును కృష్ణరాయలకాలమునం దుండి రని నిరూపించుట కట్టియాధారమును లేదు. కొటికమువిశ్వనాథనాయకుడు కృష్ణదేవరాయల కడపటిరాజ్యవర్షమున నుండినట్లు శాసనాధారము గలదు; కాని తత్పూర్వ మతడు రాయల కాలంపున నుండె ననుట సంశయాస్పదము; క్రీ. శ. ౧౫౬౩-౬౪ వఱకు నతడు జీవించియుండుటవలన, కృష్ణరాయలకళింగదైత్రయాత్రయందు అతడు పాల్గొనెనని నమ్ముటకు వీలులేదు. రాణాజగదేవుడు కృష్ణరాయల

సైన్యమంతయు రాజధానియందు గూడిన పిమ్మట దండువెడలుటకొఱకు మంచి ముహూర్తమును నిశ్చయించుటకు జ్యోతిష్కులను రప్పించెనట; వారు నిశ్చయించిన లగ్నమున వెలిగుడారము వేయించి సకల సైన్యములతో గూడ బయలువెడలెనట.

“దండుయాత్రలకు లగ్నం వుంచేటందుకు జోస్యుల్లను పిలిపించ్చి ముహూర్తం వుంచమని ఆనతియ్యగా ఆతీరునే అప్పాజీగారు జోస్యుల్ల రప్పించ్చి సుదినం సుముహూర్తం సులగ్నం కూడిన వేళ వెలిగుడారం వేశేటట్టుగానున్ను పాళ్యం కదలి పొయ్యేటందుకున్ను ప్రవేశానకున్ను లగ్నం నిశ్చయించ్చుక రాయలవారికి యెరుక శేయగా, ఆతీరునె వెలిగుడారం వేయించ్చమని ఆనతిచ్చివారు...సకల సన్నాహముతో డట్టు బయలు వెరళి వెలిగుడారమునకు వచ్చినిలిచి దొరమన్నీలనున్ను, రవుతుల మావతుల నున్ను, నియోగం పైకంవార్లనున్ను, మునుపటివారు, వెనుకటివారు, యెడవంక్కంవారలనున్ను, అందరినిన్ని రప్పించుక వారివార్లతో మాటపలుకులు ఆడి మీమీ స్తోమములతో అయత్తపాటుతో రమ్మని ఎలవంక్కం అమరనాయకం వార్లతోనున్ను నగరిసంప్రతులవారితోనున్ను నగరిలెక్కప్రకారనకు యేనుగ, గుర్రాలు, రౌతు రాణువ, గలట్టు పెదళంవారినిన్ని గణితీసుకొని కర్ణాటకాన గలస్వతంత్రిసామ్యం కావలికట్లు గుంపులవారినిన్ని పాళ్యగాళ్లనున్ను నగరిలెక్కప్రకారానకు అందరినిన్ని రప్పించి పయనంతర్లడా అని కరణీకులతోనున్ను రాయసం, కటికం, దినసరి, అవసరం, నియోగపైకం వార్లతోనున్ను ఆనతిచ్చి......దండయాత్రకు జయధ్వనిగా దిక్కులు పిక్కటిల్లేటందుకు భేరితాడనము శేశి డమామీటోకించ్చమని ఉత్తరవు శేశి రౌతులకు మావుత్తులకు అమరనాయకంవార్లను అళ్లుండ్లు, కొమాళ్లకు, రాజులకు, జట్లకు, కమ్మనాయకులకు అందరినిని పయనంజెప్పి రమ్మని కటికాలవారికి వుత్తరవుయిచ్చి తాముంన్ను భోజనంజేసుకొని మాడ్గోనగారా టోకించమని ఆనతిచ్చి గుర్రం యెక్కకొని” బయలువెడలిరి 4.

యుద్ధయాత్ర బయలుదేరుటకు ముందు కృష్ణరాయలు ఉపశ్రుతిని విని యది విజయసూచకమగుటకు సంతసించి ప్రయాణోన్ముఖుడాయె నని కొండవీటి కైఫీయతునందు గలదు.

“అంతఃపురము వదలి ఆస్థానప్రవేశమై మహాప్రధానులైన సాళ్వతిమ్మప్పగారిని పిలిపించి పూర్వదిగ్విజయయాత్ర వెళ్లవలసినది; గనుక యేతత్ప్రియత్నములు చేయుమని సెలవుయిచ్చి శుభసూచనార్థమై ఆ రాత్రి రజకగృహముమీద నక్షత్రలు చల్లినంతలో ఆ

---

కాలమున రాయలకాలువునలేదు; గోలకొండసుల్తాను కులీకుతుబుశాహుకాలువున నుండెను. జమ్షీదుకుతుబుశాహుమరణమునఱకును నతడు కుతుబుశాహుల నాశ్రయించియుండెను; ఇబ్రాహింకుతుబుశాహు గోలకొండ సింహాసనము నధిష్ఠించినపిమ్మటగాని విజయనగరరాజ్యమును జేరలేదు. సాళువ తిమ్మరాజును మట్ల అనంతరాజును ఇమ్మడి వేంకటపతిరాయల కాలమున నుండిరి. ఇందువలన రాయవాచకరచయిత చెప్పిన సైన్యసంఖ్య సమకాలికుడను న్యూనిజు చెప్పినదానికంటె విశ్వాస్యమని తోచకపోవచ్చును; కాని గజపతివంటి బలాఢ్యుని జయించి యతని యేలుబడిక్రింద నుండిన దుస్సాధ్యస్థలజలగిరిదుర్గములను స్వాధీనము గావించుకొనుటకు న్యూనిజు చెప్పిన బలసంఖ్య చాలదు; మఱియు గజపతికంటె బలాధికుడుగాని విజాపురసుల్తాను నోడించి రాయచూరు మున్నగు దుర్గములతో గూడ కృష్ణాతుంగభద్రల మధ్యదేశమును స్వాధీనపఱచుకొనుటకై కృష్ణదేవరాయలు ౫౫౧ ఏనుగులను ౩౨౬౦౦ గుఱ్ఱములను ౭౦౩ ౦౦౦ కాల్బలమును సమకూర్చె నని న్యూనిజు చెప్పియున్నాడు. (*Sewell, F. E. p.* 147,326-328); కావున గజపతిని జయించుటకు కృష్ణరాయలు రాయవాచకమున వర్ణించినంతటి బహుళసంఖ్యాకమైన సైన్యమును సిద్ధముజేయుట యసంభవము గాదు.

4. రాయ. పుటలు ౭౨-౭౪. కృష్ణరాయలనాటి యాంధ్రవాఙ్మయమును పాశ్చాత్యపోర్చుగీసుప్రయాణీకుల వృత్తాంతములను బరిశీలించిచూడగా రాయవాచకమున వర్ణింపబడిన ప్రయాణారంభసన్నాహము సరియైనదని తెలియుచున్నది.

కృష్ణదేవరాయలు తన రాజ్యముపై నెత్తివచ్చుటకు ఘనప్రయత్నము సేయుచున్న సంగతి గజపతి కెఱుకపడకపోలేదు. తనరాష్ట్రమును సంరక్షించుకొనుట కతడు తగు నేర్పాటులను గావించెను. రాయవాచకమునం దీయేర్పాటులు సంగ్రహముగ వివరింపబడియున్నవి. కృష్ణరాయలు రాజ్యాభిషిక్తుడైనపిమ్మట తమ రాజ్యములపై నెత్తిరా దలపెట్టుచున్నాడనియు, తను కందఱి కతడు సామాన్యశత్రువనుటవలన దామందఱు నేకమై యతని నెదుర్కొనుట యుక్తమనియు మాడింద్ల దక్కనుసుల్తానులును దమస్థానాపతుల మూలమున సందేశ మంపిరట! గజపతివా రందుల కంగీకరించి తదనుగుణముగ నిజరాజ్య సంరక్షణకు దగు నేర్పాటులను గావించిరట.

"గజపతివారు...షోడశపాత్రులతోనున్ను పరస్థల నియోగ్యులతోనున్ను సంభాషణ శేయగా నిజాంశాహువారి నీలాద్రిపంతులు వారున్ను యెదులశాహుకుతపనములకవారి స్థానాపతులు అంప్పించ్చిన కాకితములు:

"'కర్నాటకాధీశ్వరులు కార్యముఖానకు నడిచేవారై చతురంగబలమున్ను జతశేసుక బయలు వెరసి సరుదులకు వచ్చి కనపించ్చుకొనేవారై వున్నారు; ఇంతవరకు ఉత్తరందక్షిణందొరల కార్యాలకు హానివృద్ధులకు సహాయంసంపత్తి నడుపుదురు' ప్రబలమైన కార్యాలఇతే అంద్దరున్ను ఏకగ్రీవమై ఉత్తరం అఘపురం వారి కార్యాలకున్ను నిర్వహింతురుగా. యిప్పుడు అంతేశి కార్యాలు యేమి వున్నది? సరుదున వుండేవారు, గనుక యితరం గాదుగదా. యెదులశాహున్ను నిజాంశాహున్ను కుతుపనములకవారున్ను సరదుస్థలాలు స్థోమశుద్ధిగా యోచనశాయగా పనిలేదు. అంద్దుకు మించ్చిన కార్యాలఇతె అహముదు నగరం పర్యంత్తం వత్తురు' అని ఘనంగ్గా వ్రాశి అంప్పినారు.

"'మనుష్యయత్నమున అపజయ మని యెంచ్చ రాదు. కర్నాటకంవారికి జయం నిశ్చయం అఇనప్పటికిన్ని సరుదుల మూడుతెగలవారున్న విరిగినట్లైతే మీసీమలన్నిన్ని కోలుబోయి మీకున్ను అవధి వచ్చును; కాబట్టి దీర్ఘయోచన విచారించుకొని యాదిహెచ్చరికలు గలిగి నడిపించ్చుకోవలెను' అని మంత్రాలోచనగా అన్నందులకు, గజపతివారు—

"'అంన్నింటికిన్ని మనపాలిటి జగన్నాయకులు వున్నారు' అని మందలించ్చినంద్దులకు మూడుతెగల వారి నియోగ్యులున్ను, 'మీకు జగన్నాయకులున్ను తమ దొరలకు కర్తరున్న వున్నారుకా. కర్నాటకంవారు యేరుదాటి రాకుండా తమ మూడుతెగల కలిమిబలములున్ను కృష్ణ దాటి రాకుండా పాశ్యం దిగివుండేటట్టు అంపుకున్నారు. మీ తెగనామజాదులున్ను సరదుస్థలాల బలవంతులై యుండేటట్టు కట్టడశేయండా' అని తెలుపగా గజపతివారున్ను 'అకీతి అమరకశేశే' మని కొండ్డవీడు, ఉదయగిరి, బెల్లంకొండ్డ, నాగార్జునంకొండ్డ, కంమూరు మొదలైన స్థలాదులకు యాదిహెచ్చరికలు కలిగివుండ్డదగ్గదశేటట్టుగా సామజాదులు పంపినవారై షోడశపాత్రులతోనున్ను వారి దుర్గాలన్న శీమభూముల యంద్దున్ను యాదిహెచ్చరికలు గలిగివుండ్డమని మంద్దలించ్చగా వారు వాల్లుఽ సరుదులకున్ను దుర్గాలకున్ను రస్తుసామగ్రీలు అంప్పినారు."[5]

---

రజకుడు అన్నం తిని తన యింటిపందిటిలో పండుకొని ఉపామతిచేతను,

'కొండవీడు మనదేరా కొండపల్లె మనదేరా
కాదనివెవ్వడు వాడువచ్చినకటకముదాకా మనదేరా'

అని అన్నాడు; గనుక ఆమాట విని రాయలవారితో చెప్పినంతలో అదే శుభసూచన చేసుకొని ప్రధానసేనాపతి సైన్యసమేతముగా పూర్వదిగ్విజయయాత్ర విచ్చేసిరి. (*Kaifiyat of Kondavidu Mac. Mss.* 15-4-40 *pp.* 18 *f.*)

రామన్న శుభాశుభముల నపశ్రుతుల మూలమున నూహించి కనుగొనుట రాయలకాలపు ప్రజలకు గరము ప్రియమైన కార్యము. కావున సమకాలిక సాంఘికమర్యాద ననుసరించి కృష్ణదేవరాయలు పై చెప్పిన ట్లపశ్రుతిని విని యది శుభసూచక మని గ్రహించి కళింగక్షేత్రయాత్రకు బయలువెడలియుండవచ్చును. సంగతము కాని దిం దేమియు లేదు; కాని ఈకథయం దెంత సత్యము గలదో నిశ్చయించి చెప్పుటకు వీలులేదు.

5. రాయ. పుటలు ౪౩-౪౮.

మూడిండ్ల సుల్తానుల పక్షమున వారి స్థానాపతులు గజపతివారికి నివేదించిన 'కాకితము'లను బట్టి చూడగా కృష్ణరాయలను కృష్ణానదిని దాటిరానీయక యడ్డుపట్టుటయే వారి ప్రధానోద్దేశమని విశదపడుచున్నది. కావున మూడిండ్లవారేకమై కృష్ణాతీరమున రాయల మార్గము నరికట్టదములో దాను నిశ్చయించుకొన్నను గజపతితో నేకీభవింపదలపెట్టలేదు! కాని యతని సహాయము లేక వారి మనోరథము సిద్ధింపదు. ఏలన వారియొసఖంకనున్న తెలింగాణతీరాంధ్రరాష్ట్రముల కాతడధిపతి; కావున నతని యౌదాసీన్యమున వల్లగాని యజాగ్రతవల్లగాని యాప్రాంతములను సంరక్షింపగల దశ్యములు లేనిచో కృష్ణరాయ లచటి దుర్గముల నాక్రమించుకొని ముంగలనుండియు వామపార్శ్వమునుండియు నేకకాలమున దైకొనవచ్చును. అప్పుడు తమకు జయము గలుగుట సందేహాస్పదము. తత్కారణమున వారికి గజపతిసహాయసామభూతు లావశ్యకములాయె. ఒక వేళ గజపతి తాము కోరినట్లు సేయడేమొయను సంశయ మొకప్రక్క వారిని బాధింపగడగెను. కావున వారు గజపతికిట్లు రాయబారము నంపిరి.

కర్ణాటకు లెత్తివచ్చుచున్నారు. వారు మీకును మాకును సామాన్యశత్రులు. మనమందఱ మేకమై వారితో బ్రతిఘటించుట యుక్తమని మీ రెంచవచ్చును. మీయభిప్రాయము సరియైనదే; కాని మన మందఱ మేకీభవింపవలసినంత యావశ్యకత లేదు. ఆవశ్యకత గలిగిన మీర లహమదానగరపర్యంతము రావచ్చును; అంతటి యాపద ఇప్పుడు కలుగలేదు. మా మూడిండ్ల ఫౌజులును రాయలను కృష్ణను దాటి రానీయక మరల గొట్టుటకు చాలును. మీరు మమ్ము బోలి కర్ణాటకమున నుండువారు గావున మే మొకవేళ పరాజితులమైనచో వారు మీరాజ్యముపై యురవణింపవచ్చును; తత్కారణమున మీకు రాజ్యనష్టము గలుగవచ్చును; కావున మీరు సరదుస్థలసంరక్షణకై తగు ఏర్పాటులను గావించుట యుక్తమని హెచ్చరించుచున్నారము.

## 3

కృష్ణదేవరాయల కళింగదండయాత్రవలె నంత విపులముగ వర్ణింపబడిన చరిత్రాంశము మఱియొకటి మధ్యయుగదక్షిణభారతచరిత్రయందు గానరాదు. ఇది పెక్కండ్రచే బలుతావుల వర్ణింపబడియున్నది. ప్రప్రథమమున పేర్కొనదగినవి కృష్ణరాయల శాసనములు. ఇవి రాయలు దండయాత్ర సాగుచున్నపుడు చెక్కించినవి. ఇందు రాయల విజయములు సంగ్రహముగ పేర్కొనబడియున్నవి. ఒక్కొక ముఖ్యస్థలమును సాధించినపిమ్మట నావిజయములను బ్రసాదించినందుకు భగవంతునికి దన కృతజ్ఞతను జూపుటకు ఆయాస్థలములందో, లేక సుప్రసిద్ధపుణ్యక్షేత్రములందో వెలసిన దేవతల పూజాపురస్కారములను నడపుటకు జేసిన దానాదుల వివరమిందుల్లేఖింపబడియున్నది. దండయాత్ర నడచిన మార్గము పొడవునను ఎప్పుడెచ్చట గలిగిన విజయమును దెలుపుట కప్పుడే యవి యచట నిలుపబడినవగుటచేత చిట్టచివరను వ్రాయించిన శాసనమునందుగాని దండయాత్రవృత్తాంతము సమగ్రము గానరాదు; కాని అన్నిటిని మొత్తముగ జేర్చి చూచిన దండయాత్ర నడచిన మార్గమును సాధించిన దుర్గములును వశపఱచుకొన్న రాష్ట్రములును జక్కగ దెలియరాగలవు. శాసనములందేకాక సమకాలికసంస్కృతాంధ్రగ్రంథకర్తల రచనలలోను, పాశ్చాత్యపోర్చుగీసైతిహాసికుల చరిత్రలలోను, ప్రయాణికుల వృత్తాంతములందును కృష్ణరాయల కళింగశైత్రయాత్రప్రస్తావము గలదు; మఱియు నర్వాచీనరచనలగు రాయవాచకకృష్ణరాయవిజయములందును నీ కళింగవిజయము విపులముగ వివరింపబడియున్నది. వీని నన్నిటిని సమకూర్చి చక్కగ బరిశీలించి చూచిన నీదండయాత్రయొక్క చరిత్ర విశదము కాగలదు.

కృష్ణదేవరాయల కళింగశైత్రయాత్ర యేకధాటిగ సాగలేదు. క్రీ. శ. ౧౫౧౩ మొదలు ౧౫౧౮వ సంవత్సరమువఱకును విడుమర లేక సంగ్రామము నడచినను నిందైదాఱు ప్రత్యేకఘట్టము లుండినట్లు శాసనములందును, సమకాలికాంధ్రగ్రంథములందును సూచింపబడియున్నది. ఒక్కొకముఖ్యదుర్గమును సాధించిన

పిమ్మట కృష్ణరాయ లంతవఱకును జరిగిన యుద్ధాంశము లను సంగ్రహముగ శాసనమందు ప్రకటించి విజయనగ రమునకు మరలిపోవువాడు. సింహాచలపర్యంతము గల రాజ్యమును జయించునప్పటి కిట్టి ఘట్టములు నాలుగు వ్యక్తపడుచున్నవి.

ఈక్రింది శాసనములవలన నీవిషయము దెల్లము కాగలదు.

౧) ఉదయగిరిశాసనము : (నెల్లూరుశాసనములు- సం. 3. ఉద. నెం. ౪౦.) :

"శ్రీ వీరకృష్ణరాయలు వుదయగిరిదుర్గంమీద విడిసి ప్రతాపరుద్రగజపతిని కొండవీడుపర్యంతం విరుగంబొడిచి వుదయగిరిదుర్గానకు మేణత వేయించి దుర్గం పుచ్చుకొని ప్రతాపరుద్రగజపతివారి పిన్నతండ్రి తిరుమలకాంతరాయనిని పట్టుకొని తిరిగివిచ్చేసి..."

౨) తిరుపతిశాసనము. (తిరుపతిదేవస్థానశాసన ములు. సం. 3. నెం. ౬౮, ౭౧ల్లు).

"శ్రీవీరప్రతాప శ్రీవీరకృష్ణదేవమహారాయలు ప్రతాపరుద్రగజపతిని కొండవీటిదనకాను విరుగం బొడిచి ఉదయగిరిదుర్గమున్ను కైకొని తిరిగి విజయ నగరంరాజధానికి విచ్చేస్తున్న......"

3) అమరావతిశాసనము : (*S. I. I. vol' VI. No. 248*)

"శ్రీకృష్ణదేవమహారాయలు విజయనగరాననుండి పూర్వదిగ్విజయయాత్రకు విచ్చేసి వుదయగిరిదుర్గం సాధించి తిరుమల రౌతరాయమహాపాత్రునిం బట్టుకొని అద్దంకి వినికొండబెల్లంకొండ నాగార్జునుని కొండ తంగేడుకేతవరం మొదలైన గిరిదుర్గస్థలదుర్గాలన్నిన్ని యేకదాడిం గైకొని కొండవీటిదుర్గం లగ్గలంబున్ను కొని ప్రతాపరుద్రగజపతికొమారుండు వీరభద్రరాయ నిన్ని కొమారహంవీరమహాపాత్రుని కొడుకు నరహరి పాత్రుండు రాచూరిమల్లఖానుండు వుద్దండఖానుండు పూసపాటి రాచిరాజు శ్రీనాథరాజు లక్ష్మీపతిరాజు జన్యాలకసవాపాత్రుండు పశ్చిమబాలచంద్రమహా పాత్రుండు మొదలుగాను పాత్రసామంతులాను మన్నె వారిన్ని జీవగ్రాహంగాను పట్టుకొని వారికి అభయ దానం ఇచ్చి ధరణికోట అమరేశ్వరానకు విచ్చేసి"

౪) అహోబలశాసనము. (*L. R. 15. pp. 314-33*) దిగువ అహోబలంమంటపంలో శాసనము.

"......పాత్రసామంతులను మన్నెవారిని జీవ గ్రాహంగా పట్టుకొని వారికి అభయదానం ఇచ్చి ధరణి కోటకు విచ్చేసిఅమరేశ్వరమహాదేవుని సన్నిధిని తులా పురుషదానముసేయ నవధరించి...తిరిగి విజయనగరా నకు విచ్చేసి రత్నసింహాసనారూఢులై సామ్రాజ్యము సేయుచును మఱిన్ని కళింగదేశానకు దిగ్విజయార్థమై యిప్పటికి విచ్చేసి......"

౫) తిరుపతిశాసనము (తిరుపతిదేవస్థానశాసన ములు. సం. 3. నెం. ౭౦).

"ధరణికోట అమరేశ్వరానను తులాపురుషమహా దానముంను సాయనవధరించి తిరిగి విజయనగరానకు విచ్చేసి సామ్రాజ్యంచేస్తున్న మరిన్ని కళింగదేశ దిగ్విజయార్థమై బెజవాడకు విచ్చేసి కొండపల్లి దుర్గమున్ను సాధించి ఆదుర్గంమీదనుండ్ర ప్రహార రాజు శిరశ్చంద్రమహాపాత్రుండు బోడజనమహా పాత్రుండు బిజిలిఖానుండు వీరు మొదలైనవారినింని జీవగ్రాహంగాను పట్టుకొని వారికి అభయదానం ఇచ్చి అనంతగిరి ఉండ్రకొండ ఉర్లకొండ అరువ పల్లి జల్లిపల్లి కందికొండ కప్పలువాయి నల్లగొండ కంభంమెట్టు కనకగిరి శంకరగిరి ఇవి మొదలయిన తెలుంగాణ్యపుదుర్గాలు ఏకధాటిని కైకొని సింహాద్రి పొట్నూరికివిచ్చేసి అక్కడను జయస్తంభం వేశి రాజ మహేంద్రవరానకు విచ్చేసి తమదేవులు చిన్నాదేవంమ తిరుమలదేవంమగారిచాతను మహాదానాలు సేయించ నవధరించి విజయనగరానకు విచ్చేసి"

పై శాసనగ్రంథములవల్ల కృష్ణదేవరాయలు కళింగదిగ్విజయము ప్రారంభించినతరువాత మూడు పర్యాయములు విజయనగరమునకు యుద్ధరంగమునుండి మరలిపోయినట్లు తెలియవచ్చుచున్నది. ఉదయగిరి కైవశమైనపిమ్మట నొకమారు, కొండవీడును సాధిం చిన తరువాత నొకసారి, సింహాద్రిపొట్నూరికడ

జయస్తంభమును ప్రతిష్ఠించినవెనుక నొక్కతడవ, యెత్తను మూడుమార్లు యుద్ధరంగమునుండి రాజధాని విజయనగరమునకు బోయి యచట రాచకార్యమును విచారించుచు గొంతకాలముండి మరల బయలువెడలి పోయి సైన్యమును గలిసికొనెనని విస్పష్టమగుచున్నది. ఇందువలన రాయల కళింగదండయాత్రయందు మూడు ముఖ్యఘట్టములు గలవను తలంపు గలుగవచ్చును; కాని మనకు లభించిన శాసనాదిచరిత్రసాధనసామగ్రిని బరిశీలించిచూచితిమేని దండయాత్రలోని ఘట్టములు మూటికంటె నెక్కువ గలవని తేలగలదు.

౮) సింహాద్రిశాసనము (*S. I. I. Vol V. No 694*) నందు కళింగదండయాత్రలో కృష్ణరాయలు సింహాద్రిని జేరకముందు ఉద్దగిరి, కొండవీడు, కొండపల్లి, రాజమహేంద్రవరము మున్నగు నాలుగుదుర్గములను సాధించినట్లు చెప్పియున్నది.

"శ్రీవీరప్రతాపకృష్ణదేవమహారాయలు విజయనగర సింహాసనారూఢులై పూర్వదిగ్విజయయాత్రకు విచ్చేసి ఉద్దగిరి కొండవీడు కొండపల్లి రాజమహేంద్రావరం మొదలైన దుర్గాలు సాధించి సింహాద్రికి విచ్చేసి."

ఒక్కొక్క ముఖ్యదుర్గమును నొక్కొక్క ఘాటీకవధియగుటవలన సింహాచలపర్యంతము సాగినదండయాత్రయం దైదు ముఖ్యఘట్టము లుండెనను నూహకెడము గలుగుచున్నది. దీని కనుగుణముగ నాముక్తమాల్యదయందు ప్రథమాశ్వాసాంతమున నుదయగిరివిజయమును, ద్వితీయాశ్వాసముచివర కొండవీటివిజయమును, తృతీయాశ్వాసముతుద కొండపల్లివిజయమును, చతుర్థాశ్వాసము కడపట పొట్నూరుసింహాచలమునందు విజయస్తంభప్రతిష్ఠయు వరుసగ వర్ణింపబడియున్నవి 6. ఇట్లే పోర్చుగీసైతిహాసికుడు న్యూనిజు ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి సింహాద్రివిజయములను వరుసగా వర్ణించియున్నాడు 7. కృష్ణరాయల ఆస్థానసంగీతవిద్వాంసుడు బండారులక్ష్మీనారాయణుకుసైతము మొదట ఉదయగిరి యటుపిమ్మట కొండవీడు కొండపల్లె విజయమును కడపట పొట్టనూరికడ విజయస్తంభస్థాపనను వర్ణించియున్నాడు 8. కాని కృష్ణదేవరాయల తిరుపతి సింహాచలశాసనములందుదప్ప మఱియెచ్చటను రాజమహేంద్రవరవిజయప్రస్తావన గానరాదు. ఈశాసనములైనను రాయ లెప్పుడు రాజమహేంద్రవరమును జయించినదియు నిర్ణయించుటకు దోడ్పడవు. ఏలన సింహాచలశాసనమున కృష్ణరాయలు రాజమహేంద్రవరమును సాధించినపిమ్మట సింహాద్రికి బోయినట్లు చెప్పియున్నది; కాని తిరుపతిశాసనమున దీనికి విరుద్ధముగ నతడు సింహాద్రియందు విజయస్తంభమును స్థాపించినపిమ్మట నచటినుండి విజయనగరమునకు మరలిపోవుచు రాజమహేంద్రవరమునకు వచ్చినట్లు కలదు. ఆముక్తమాల్యదయందుగాని, మఱి యేసమకాలికగ్రంథమునందుగాని చరిత్రయందుగాని రాజమహేంద్రవరవిజయప్రస్తావన గానరాకపోయినను తత్పరిసరరాష్ట్రము నతడు జయించినట్లు అల్లసాని పెద్దనగారు మనుచరిత్రయందు చెప్పియున్నారు.

'ఆట సాగి జమ్మిలోయబడి వేగి దహించె
కోన బిట్టేర్చె కొట్టాన దవిలె' 9

అని మనుచరిత్రపీఠికయందు గలదు. కృష్ణాగోదావరుల మధ్య నుండు తీరాంధ్రభూమి వేగి యనుట నందఱెఱిగిన విషయమే. కోనకొట్టాములు రెండును గోదావరికి తూర్పున నున్నవి. కృష్ణరాయల వేంగివిజయప్రస్తావన మనుచరిత్రతృతీయాశ్వాసాంతమునందున గలదు.

'సైన్యస్తోమోత్థరజఃప్రజస్థగితకృ
ష్ణాగౌతమీమధ్యభూ
మ్యస్తోకోత్కళరాట్పురీహరణ,లీ
లావార్యశౌర్యోదయా'10 అని.

6. *Sources of Vijayanagara History*, *pp*. 187-8.

7. *Sewell*. *F. E. pp*. 316-319.

8. *Further Sources of Vijayanagara History*. *I*. *No*. 166-(*a*).

9. మను. ౧-౩౮.

10. మను. ౨-౮౯.

కావున కృష్ణరాయలు గోదావరీఉభయతటము లందలి రాష్ట్రమును జయించె ననుట తెల్లము. ఇట్లుభయతటములను జయించిన రాయలు గోదావరికూర్పు గట్టున వేంగికి రాజధానియైన రాజమహేంద్రవరమువంటి ముఖ్యదుర్గమును శాసనములందు చెప్పినట్లు జయించినా డనుట నిస్సంశయము; కాని దానిని జయించిన దెప్పుడో నిశ్చయింపవలసియున్నది. సింహాద్రిశాసనమున జెప్పినట్లు సింహాచలాగమనమునకు పూర్వమా? లేక తిరుపతిశాసనమున నుడివినట్లు పిమ్మటనా? సూక్ష్మముగ విచారించిచూడగా కృష్ణరాయలు సింహాచలమును జేరకపూర్వమే రాజమహేంద్రవరమును సాధించియుండు నని తోచుచున్నది. రాయలవంటి యుద్ధకళామర్మజ్ఞుడైన దళనాయకుడు రాజమహేంద్రవరమును బోలిన ప్రబలస్థలదుర్గమును, సారవంతమైన బంగారుపండు గౌతమీతీరదేశమును జయింపక శత్రుని యధీనమున విడిచిపెట్టి యంత కింకను దూర్పున నుండు సింహాచలప్రాంతమున దండునడుపుకొనిపోయి యుండడు. కావున నతడు గోదావరీఉభయతట దేశమును రాజమహేంద్రవరదుర్గమును సాధించిన తరువాతనే సింహాచలమునకు బోయె నని యెంచుట యుక్తము. అగునేని, సింహాచలమునుండి రాయలు రాజమహేంద్రవరమునకువచ్చినట్లు తిరుపతిశాసనమున జెప్పియుండుటకు గారణ మేమను ప్రశ్నకు సమాధాన మేమి? వాస్తవస్థితిని తెలుపు చరిత్రాధార మింకను లభ్యపడలేదు; కాని కారణము దురూహ్యము గాదు. కృష్ణరాయలు కృష్ణాగౌతమీమధ్యస్థతీరాంధ్రమును స్వయముగ జయించలేదు. కొండపల్లికి లగ్గలుపట్టిన పిమ్మట రాయరాణువ రెండువాహినులుగ చీలినది. ఒకపాయ రాయల నాయకత్వముక్రింద తెలింగాణ రాజ్యమును ప్రవేశించినది; మఱియొకటి తూర్పుగ బయలుదేరి కృష్ణాగౌతమీమధ్యదేశమును జొచ్చినది. రెండును సింహాద్రి చెంతనో, తత్పూర్వమో కలిసికొని యేకమైనవి. కృష్ణాగౌతమీమధ్యదేశమును కోనకొట్టాము ప్రాంతములను జయించిన సైన్యము రాజమహేంద్రవరదుర్గమును సాధించినది. ఈకారణమువలన నేమొ నూన్యనిజా మున్నగు సమకాలచరిత్రకారులును, గ్రంథకర్తలును రాయలు సాధించిన దుర్గములలో రాజమహేంద్రవరమును జేర్పకపోయిరి. కృష్ణరాయలంతకుముం దెప్పుడును రాజమహేంద్రవరమును జూచియుండకపోవుటవలన పొట్నూరుసింహాచలముందు విజయస్తంభమును స్థాపించినపిమ్మట విజయనగరమునకు మరలిపోవునపు డామార్గమున బోయియుండును. ఇది కేవల మూహయే; కాని యన్యథా తిరుపతిసింహాచల శాసనములందు గానవచ్చు విపర్యాసమునకు సమన్వయము కుదురదు.

ఇంతవఱకు వివరింపబడిన శాసనాదిసాక్ష్యమును బరిశీలించిచూడగా కృష్ణరాయల పూర్వదిగ్విజయ మేకధాటి కావనియు నంచెలమీద సాగిన దీర్ఘదండయాత్ర యనియు దేలుచున్నది. ఇందు ముఖ్యఘట్టములు నాలుగు గానవచ్చెడిని:—(౧) ఉదయగిరి, (౨) కొండవీడు, (౩) కొండపల్లి, (౪) సింహాచలము.

సింహాచలమున జయస్తంభస్థాపనతో కళింగ జైత్రయాత్ర ముగిసెననియు, సంతట గజపతి తన కుమార్తె నిచ్చి రాయల కుద్వాహమొనర్చి సంధిజేసి కొనె ననియు కీర్తిశేషులైన డాక్టరు యస్. కృష్ణస్వామిఅయ్యంగార లభిప్రాయపడియున్నారు. తమ యభిప్రాయమును దృఢపఱచుటకొఱకు క్రింది కారణములను జూపియున్నారు: (౧) రాయవాచకమునను కృష్ణరాయవిజయమందును సింహాద్రికడ జయస్తంభప్రతిష్ఠతో కళింగదండయాత్ర ముగిసినట్లు చెప్పియున్నది. (౨) రాయలవంటి యుద్ధమర్మజ్ఞుడగు దండనాయకుడు తన కెలకున నుండు ప్రబలశత్రులను సరకుసేయక ఉత్తరదిక్కునకు సాగిపోయియుండడు, (౩) కాని యల్లసాని పెద్దన మనుచరిత్రయందు కృష్ణరాయల ప్రతాప ముదయగిరిజయమువలన ప్రజ్వలించి క్రమక్రమముగ వృద్ధినంది పొట్నూరికడ పెనుమంటలై మండి యొడ్డాదిని మసిచేసెను; ఆతోకచుక్కయొక్క వేడికి గజపతి కటకమున నిలువజాలక వింధ్యాద్రికి పాఱిపోయి యందలి గుహలయందు తలదాచుకొనె నని వ్రాసియున్నాడు. మనుచరిత్ర కావ్యము; కావ్యపద్ధతి ననుసరించి యావర్ణన హృదయంగమముగనె

యున్నది. కావ్యమునకు చరిత్ర యెంత చేరువగ నుండ వలయునో పైవర్ణనయు చరిత్రాంశముల కంత చేరువ యందే యున్నది. కాని యది చరిత్ర కాదు. గజపతి రాజధానికి నిప్పంటించుట యతని కుమార్తెను పెండ్లాడుట కనుకూలమార్గము గాదు. కావున కృష్ణరాయల కళింగ దండయాత్ర సింహాద్రిని దాటి యుత్తరముగ సాగియుండుట యసంభవము. 10a.

కాని కృష్ణస్వామిఅయ్యంగారు చూపిన కారణములు ప్రబలమైనవి కావు. రాయవాచకమునగాని, కృష్ణరాయవిజయమునగాని సింహాద్రిలో రాయల కళింగదండయాత్ర ముగిసినట్లు చెప్పియుండలేదు. పొట్నూరిసింహాద్రియొద్ద పాళెము దిగినపిమ్మట కొంత యుద్ధము నడచినట్లు కలదు. "కర్ణాటకంవారు కనముల దాటి అహముదానగరానకు వచ్చి నిపాతంచేశి పొట్నూరి సింహాద్రికద్ద శిబిరం దిగినారు. యిక్కడికి నాలుగు క్రోశముల మేర వచ్చివున్నారు. రేపట కర్నాట ఘాటిమార్గంగా సురంరాణువ వచ్చును." అని కృష్ణరాయలు సింహాద్రికడ విడిసినపిమ్మట నా వృత్తాంతమును విన్నపుడు గజపతి యనుచరులతో చెప్పినమాటలివి. ఇందువల్ల కృష్ణరాయలు సింహాద్రిని దాటి గజపతివారు నివసించుచుండిన పట్నమునకు నాలుగు క్రోశములదూరమువఱకు కూచిచేసిపోయినట్లు తెలియవచ్చుచున్నది. ఇచటనే రాయల విడిదియందు సాళువతిమ్మరసయ్య భేదోపాయమవలంబించి షోడశమహాపాత్రులపై గజపతి హృదయమున సంశయమును గల్పించి యతనిని 'పట్టంవిడిచి యేక దేశాన... యేదెనిమిది ఆమడపాడవు ఉత్తరంగా పారిపోవు'నట్లు యుక్తిపన్నినది11. కావున డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారనుకొన్నట్లు రాయవాచక కృష్ణరాయవిజయములు కృష్ణరాయల కళింగ దండయాత్రను సింహాచలమున సమాప్తమునేయలేదు. మఱియు కృష్ణరాయల ప్రతాపమువేడికి దాళక గజపతి నిజరాజధానినుండి వింధ్యాద్రిగుహలలోనికి పాఱిపోయినట్లు చెప్పినాతడు పెద్దన గాదు, నందితిమ్మన. 'కటకమును గాల్చె గజరాజు గలగి పఱవ' యని యతడు కటకమును దగులబెట్టినట్లు స్పష్టముగ పెద్దన నుడివియున్నాడు.12 గజపతి రాజధానిని తగులబెట్టుట యతని దుహితాకరగ్రహణమునేయు నుత్తమపద్ధతి కాకపోవచ్చును; కాని గజపతిని యుద్ధమున నోడించి యతని రాష్ట్రమును దుర్గములను హరించుట యంతకంటె నెక్కుడు హృదయరంజకము గాను. ఇటువంటి వివాహము లెన్నియో జరిగినట్లు చరిత్ర తెల్పుచున్నది. రాయల దండుమార్గమునకు వామపార్శ్వమున తురకరాజ్యము లుండుట వాస్తవమే. కాని యప్పటికే కృష్ణరాయలు మూడిండ్ల తురకరాజుల నోడించినట్లు రాయవాచకమునందే చెప్పియున్నది. 'ఈవర్తమానం గజపతివారు విని యేదులషాహు, కుతుపనములక, నిజాంశాహువారు ముగ్గురున్న నిలువలేక తిరిగి స్థలాలు వచ్చిరి. గనక ముగ్గురుకు శేదార్లనున్న పీగతోలిన బలవంతులతో తాము ఏకదేశాన పోరాడేది యేరీతు?' అని గజపతివారు ఆప్తుల నడిగినట్లు కలదు. ఇందువలన రాయరాణువకు పార్శ్వమునుండి శత్రుల యుపద్రవము కలుగు నని యాశంకించుట కవకాశము లేదు. మఱియు నుదయాద్రినుండి సింహాద్రి వఱకు గల రాష్ట్రములును దుర్గములును రాయలకు హస్తగతములై యతని యనుచరులపాలనక్రింద నుండుటవల్ల కర్ణాటమునుండి వస్తుసామగ్రులు రాకపోవు నను భయమును లేదు. కావున డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారియొక్క యభిప్రాయము పాటింపదగనిది. ఈ రెట్లభిప్రాయపడినను, కృష్ణరాయలు సింహాచలమునుండి దండునడపుకొనిపోయి కటకమును పరశురామప్రీతి గావించె నని నిశ్చయముగ జెప్పవచ్చును. కృష్ణరాయల యాస్థానసంగీతవిద్వాంసుడు సింహాద్రికడ జయస్తంభమును నిలిపినపిమ్మట కృష్ణరాయలు గజపతితో మరల యుద్ధముజేసి యతని నోడించి యతని రాజ్యమును కుమార్తెకరముతోగూడ గ్రహించె నని చెప్పియున్నాడు. అతడు వర్ణించిన కళింగదండయాత్రక్రమమును దిలకింపుడు :

'ర్గం జిత్వాఽథ సోసా వుదయ గిరివరం
తత్ర రాహుత్తరాయం

---

10a. *Yet-remembered ruler of a Long-forgotten Empire* P. 17.

11. రాయ. పుట ౧౦౭; *cf* కృ. రా. వి. 3: ౭౬-౧౧౩.

12. మను. ౧-౩౭

బన్దీకృత్యాస్య హత్వా యుధినగరవరే
కొణ్డవీట్కొణ్డపల్ల్యాం
జీవగ్రాహం గృహీత్వా గజపతి తనయం
పాట్టనూర్పట్టణాగ్రే
విశ్వశ్లాఘ్యప్రతాపో బిరుదయుత జయ
స్తంభ ముచ్చైర్న్యఖానీత్.
సోఽయం కృష్ణనరేశ్వరో గజపతిం
జిత్వా తదీయశ్రియా
సాకం తస్య సుతాముదూహ్య......”13

మఱియు—రాయలు, పెద్దనగారు చెప్పినట్లు, ‘మాడెములు వ్రేల్చి యొడ్డాది మసియొనర్చి కటకమును గాల్చి’నదియు పొట్నూరు రవులుకొన్న పిమ్మటనే. మఱియు పెద్దనగారు గజపతికి వ్రాసియంపిన లేఖయందును రాయల కటకవిజయము వర్ణింపబడియున్నది.

“సంపెటవరపాలసార్వభౌముడు వచ్చి
సింహాద్రిజయశిల జేర్చువాడు
సెలగోలు సింహంబు చేరి ధిక్కృతి గంచు
తల్పుల గరుల డీకొల్పువాడు,
ఘనతరనిర్ఝరగండపెండెర మిచ్చి
కూతు రాయలకును గూర్చువాడు
ఒడ తెలుంగవో చచ్చితో యుర్వి నేపా”14
ఇత్యాది—

కటకముపర్యంతము విజయనగరసైన్యములు దండయాత్ర జేసెనని ఈపద్యమువలన దెలియుచున్నది. కంచుతల్పుల గృష్ణరాయలు దన కరుల డీకొల్పినాడట. ఈకంచుతల్పు లెచటివో? గజపతి రాజధానియగు కటకముయొక్క కంచుతల్పులే కాని యన్యస్థలములవి కావు. ఈయూహ సరియైనదని యొంచుటకు శాసనాధారము కొంతకలదు: అనంతపురం జిల్లా హిందూపూరుతాలూకా చోళసముద్రగ్రామమున క్రీ. శ. ౧౫౧౪ వ సంవత్సరము కడపట కృష్ణరాయల సేనాధిపతులలో నొక్కడగు రాయసం కొండమరసయ్యగారు వ్రాయించిన శిలాశాసనమున దన యాధిక్యత నిట్లు చెప్పుకొనియున్నారు.

‘స్వామికార్యేణ హిమవంతం ఘనగిరిఉదయాద్రి ప్రముఖాది అనేక దుర్గప్రజారత్నకం, సింహాద్రి శ్రీకూర్మ జయస్తంభకార్యేణ నివ్వాణహాకం’14a ఇత్యాది. ఇందువలన కృష్ణరాయల దండయాత్ర సింహాద్రినిదాటి ప్రాచీన గంజాంమండలములోని శ్రీకూర్మముపర్యంతము సాగెననినిశ్చయమగుచున్నది. మఱియు క్రీ. శ. ౧౫౧౪ వ సంవత్సరమున కృష్ణరాయల భృత్యులలో నొక్కడగు తిప్పరసయ్యకుమారుడగు లక్ష్మీకాంతరసు గుంటూరుమండలములోని కొమ్మూరు గ్రామమున వ్రాయించిన శాసనమువల్ల సైదండయాత్ర కటకముదాక నడచెనని రూఢియగుచున్నది. 15 ఇందు ‘కటకముపర్యంతమును’ కృష్ణరాయలు పొందిన విజయము లెన్నబడియున్నవి. కావున కృష్ణరాయల పూర్వదిగ్విజయము గజపతి రాజధానియగు కటకమువఱకు సాగెనని మనము దృఢముగ జెప్పవచ్చును. అటులేని, యంతకుపూర్వము జేర్కొనిన, (౧) ఉదయగిరి (౨) కొండవీడు (3) కొండపల్లి (౪) సింహాచలము మున్నగు నాలుగుఘట్టములకు (౫) కటకమను నైదవఘట్టమును జేర్పవలసియున్నది.

కర్ణాటకులతోడిపూర్వవైరమునుస్మరించిమూడింట్ల సుల్తానుల సలహా ననుసరించి గజపతి తన గడిప్రదేశములను గాపాడుటకు వలసిన యేర్పాటుల గావించుట సహజమే. కాని రాయవాచకమున వర్ణింపబడిన రాయబారవృత్తాంతము వాస్తవమని నిరూపించుటకు దగిన సాధనాంతరము లెవ్వియు లేవు; అయినను ఇందు సంభవింపదగని విషయము పెద్దియు లేదు; కావున సాధనాంతరములవల్ల నిది యసత్యమని రుజువగునంతవఱకును నిది వాస్తవమైన చరిత్రాంశమని మనము గ్రహింపవచ్చును.

13. *Further sources of Vijayanagara History*. B. No. 116-(*a*).

14. *Sources of Vijayanagara History* p. 154.

14*a*. *ARE* 87 *of* 1912, *SII*. *IX*. *Pt*. 2 *no*. 507.

15. *ARE*. 824 *of* 1922.

## అనుబంధము

శాసనములందు కొండపల్లిని సాధించిన పిమ్మట కృష్ణదేవరాయలు అనంతగిరి, ఉండ్రకొండ, ఊర్లకొండ, అరువపల్లి, జల్లిపల్లి, కందికొండ, కప్పలువాయి నల్లగొండ, కంభం మెట్టు, కనకగిరి, శంకరగిరి ఇవి మొదలైన తెలుంగాణ్యపు దుర్గముల నేకధాటిని గొన్నట్లు చెప్పియున్నది. ఏకధాటిప్రస్తావము లేక పోయినను పైజేర్కొన్న తెలింగాణదుర్గములందు కొన్నిటిని రాయలు సాధించినట్లు సమకాలికవాఙ్మయమువలన దెలియుచున్నది.

"వేలుపుగొండ యుద్వృత్తిభంగము జేసి
జల్లిపల్లి సమగ్రశక్తి గూల్చి
గినుకమీఱ ననంతగిరి క్రిందుపడజేసి
కంబంబుమెట్టు గ్రక్కున గదల్చి"1

అనిపారిజాతాపహరణమునందును, 'కనకగిరిస్ఫూర్తి గరచౌనని మనుచరిత్రయందును గలదు2. కాని రాయవాచకమున గాని కృష్ణరాయవిజయమున గాని తెలింగాణధాటిప్రస్తావము లేదు. ఉదయగిరి కందుకూరు, కొండవీడు, కొండపల్లె, వినుకొండ, నాగార్జునకొండ మొదలైన దుర్గములను జయించినతరువాత కృష్ణరాయలు అహమదానగరముపై నడచినట్లు రాయవాచకమునందున్నది3. కృష్ణరాయవిజయమునగూడ నిట్లే యుదయగిరి, కందుకూరు, కొండవీడు, కొండపల్లి, వినుకొండలను సాధించినపిమ్మట నహమదానగరముపై నెత్తిపోయినట్లు చెప్పియున్నది4. ఈ అహమదనగరం గజపతివారి రాజ్యములోనిది కాదు. ఏలనగా, కృష్ణరాయ లాదుర్గమును జయించినపిమ్మట 'నందుండి గజపతిరాజ్యానకు నడచి' నట్లు రాయలవాచకమున వర్ణింపబడియున్నది5. కృష్ణరాయవిజయమునం దాదుర్గసంరక్షకులగు 'పారశీకుల సేవకులు' గాందిశీకులైరని చెప్పియుండుటవలన నది మూడింట్లురక రాజులలో నొక్కరికి జెందినదై యుండవలెనను నూహ పొడమచున్నది. సకలభారతావనియందును సుప్రసిద్ధమైనది యహమదునగరనామపుర మొక్కటియే కలదు. ఇది నిజాము శాహీవంశజులకు రాజధాని ; కాని కృష్ణదేవరాయ లహమదునగరమును సాధించె నని చెప్పుటకు సాధనాంతరము గానరాదు. కావున 'సోర్సెస్ ఆఫ్ ది విజయనగర హిస్టరీ' అను గ్రంథమున ద్రచయిత కీ. శే. శ్రీ ఆమూరి రంగస్వామి సరస్వతిగారు ఇది యహమదాబాదు-బీదరని సూచించిరి6. ఇది యంగీకార్యము గాదు. అహమదాబా దను మహమ్మదీయనామము బీదరు కున్నను సర్వసామాన్యముగ నప్పటి మహమ్మదీయులందఱును దానిని బీదరనియే పేర్కొనువారు. రాయరాజనివాసులు బెడదకోట యనెడివారు. మఱియు నహమదాబా దహమదనగరము కాజాలదు. కావున శ్రీరంగస్వామిసరస్వతిగారి స్థలనిర్దేశము సరియైనది కాదు. రాయవాచక కృష్ణరాయవిజయములు లర్వాచీన గ్రంథము లగుటచేతను, కృష్ణరాయ లహమదునగరమును జయించెనని తెల్పు సాధనాంతరములు లేక పోవుటచేతను పైగ్రంథములందలి యహమదునగర విజయకథనము విశ్వాసపాత్రము గాదని త్రోసిపుచ్చుట యుక్తమను తలంపు గలుగవచ్చును ; కాని యాముక్తమాల్యదయందు పంచమషష్ఠాశ్వాసాంత పద్యములను జూడగా పైజెప్పబడిన యహమదనగరపతనవృత్తాంతమునం దేదో కొంత సత్యమున్నట్లు తోచుచున్నది.

"ఇది యంధ్రోక్తి యథార్థనామ యవనా
స్వహ్వర్ణకుంభావి వా
రిదపద్ధశ్యవరోధివప్రవిలయ
శ్రేణీవిఘాతక్రియా
స్పదసేనాగ్రగకృష్ణరాయమహీభృ
త్సంజ్ఞాస్మదాముక్తమా

1. పారి. ౧.

2. మను ౧-3౪.

3. రాయ. పుటలు ౯౧-౯3.

4. కృ. రా. వి. 3 : ౫3-౬౫

5. రాయ. పుట. ౯3.

6. *Sources of the Vijayanagara History* P. 114.

ల్యద నాశ్వాసము పంచమం బగురు హృ
ద్యంబైన పద్యంబులన్"[7].

"ఇది సైరామన యావనావనిధవా
హీనాగ్రభుజంబిస్ఫుర
ద్వసితాఖిలమణీగృహాళిదళనో
ద్వేగోగ్రహస్తిగ్రజో
ద్యదసీకాగ్రగకృష్ణరాయమహిభృ
త్ప్రజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసవరేణ్య మాఱవది
హృద్యంబైన పద్యంబులన్"[8].

తాళపత్రప్రతులందును ముద్రితగ్రంథములలోను 'ఇది సైరామనయావనావనిధవ' అనియే సర్వత్ర కానవచ్చుచున్నది. సైరామనాఖ్యనగర ముగాని యాపేరిటి సుల్తానుగాని యన్యత్ర యెచ్చటను పేర్కొనబడియుండలేదు. అట్టి పురము దక్కనులో గాని మఱి రాయల కందుబాటుగల దేశములందు గాని కానరాదు. కావున 'సైజామన'యని సవరించితిని. మఱియు నీపద్యము వ్రాతప్రతులన్నిటి యందును గాన్పింపదు. శ్రీనివాసవ్యాఖ్యతో గూడిన ప్రతులయందే కానవచ్చుచున్నది. ఆముక్తమాల్యద యేడాశ్వాసముల గ్రంథమని పెక్కు వ్రాతప్రతుల యందు జెప్పియున్నది. ఈ పద్యమును ద్రోసిపుచ్చిన అష్టాశ్వాసాంతములే మిగులును; యేడవ యాశ్వాసమున కాశ్వాసాంతపద్య ముండదు. కావుననే శ్రీనివాసాదిప్రాచీనవ్యాఖ్యాతలును బ్ర. శ్రీ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారివంటి యాధునిక వ్యాఖ్యాతలును నీపద్యమును ద్రోసిపుచ్చక గ్రహించిరి. మఱియు నీయాశ్వాసాంతపద్యములు—ముఖ్యముగ నాలుగైదాఱేడాశ్వాసముల తుద నుండునవి—ముద్రితగ్రంథమందలి క్రమముచొప్పున కాక వ్రాత ప్రతులందు తారుమారుగా గానవచ్చుచున్నవి.

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందలి వ్రాతప్రతులలో—

డి. నెం. ౩౯౫—'ఇదిసింహాచల దంభకేసరి...శ్వాసము సప్తమంబగురు' అని యున్నది. ఆఱేడాశ్వాసములు విభాగింపబడియుండలేదు.

డి. నెం. ౩౯౬—౪-వ ఆశ్వాసముతుద'ఇది సింహాచల దంభకేసరి.'
౫-వ ,, "ఇదియంధ్రోక్తి"
౬-వ ,, "ఇదియంధ్రోక్తి"

డి. నెం. ౩౯౭—౪-వ ,, "ఇది సింహాచల"
౫-వ ,, "ఇది యంధ్రోక్తి"
౬-వ ,, "ఇది యంధ్రోక్తి"

డి. నెం. ౩౯౯—౪-వ ,, "ఇది సింహాచల"
౫-వ ,, "ఇది యంధ్రోక్తి"
౬-వ గ్రంథమునష్టమైనది.

డి. నెం. ౩౯౨ ౪-వ ,, "ఇది సింహాచల"
౫-వ ,, "ఇదియంధ్రోక్తి"
౬-వ ,, "ఇదియంధ్రోక్తి"

డి. నెం. ౪౦౧ ౭-వ ,, "ఇది సింహాచలదంభకేసరి...నాశ్వాసము సప్తమంబగురు..."

డి. నెం. ౪౦౫ ౫-వ ,, "ఇది యంధ్రోక్తి"
౬-వ ,, "ఇది నీలాచల"

డి. నెం. ౪౧౦ ౫-వ ,, "ఇది యంధ్రోక్తి"
౬-వ ,, "ఇది నీలాచల"

డి. నెం. ౪౦౮ ౬-వ ,, "ఇది నీలాచల"

డి. నెం. ౪౧౧ ౪-వ ,, "ఇది సింహాచల"
౫-వ ,, "ఇది యంధ్రోక్తి"
౬-వ ,, "ఇది నీలాచల"

డి. నెం. ౪౧౨ ౪-వ ,, "ఇది సింహాచల"
౫-వ ,, "ఇది యంధ్రోక్తి"
౬-వ ,, "ఇది సైరామన"
౭-వ ,, "ఇది సింహాచల"

---

7. ఆముక్త. ౫-౧౬౧.

8. ఆముక్త. ౬-౬౯.

| | | | |
|---|---|---|---|
| డి. నెం. ౪౧౪ | ౪-వ | ,, | "ఇది సింహాచల" |
| | ౫-వ | ,, | "ఇదియంధ్రోక్తి" |
| | ౬-వ | ,, | "ఇది సింహాచల" |
| డి. నెం. ౧౭౭౩ | ౪-వ | ,, | "ఇది సింహాచల" |
| | ౫-వ | ,, | "ఇది యంధ్రోక్తి" |
| | ౬-వ | ,, | "ఇది సింహాచల" |

మచ్చునకు పైనుదాహరింపబడిన తాళపత్ర గ్రంథములును వ్రాతప్రతులును చాలును. వ్రాతప్రతులు పెక్కింట 'ఇది సింహాచల' అను పద్యము చతుర్థాశ్వాసాంతమునను, 'ఇది యంధ్రోక్తి' పంచమాశ్వాసముకునను గానవచ్చుచుండుటచేత నవి నిక్కముగ నాయాశ్వాసములకు సంబంధించినవిగనే యుండవచ్చును. ఇక మిగిలియుండు రెండాశ్వాసముల విషయమై కొంత యభిప్రాయభేదము గలదు. వావిళ్ళవారు గ్రంథమారాశ్వాసముల దని నిశ్చయించి యారేడాశ్వాసములను రెంటిని ఒక్కటిగ చేర్చి ముద్రించి 'ఇది నైరామన' యను పద్యము నా యాశ్వాసాంతముగ గ్రహించిరి. మఱియు జోగిజగన్నాథపండితుని వ్యాఖ్యతో గూడిన ప్రతులయందే కానవచ్చు 'ఇది నీలాచలనీలచేలక' యను నాశ్వాసాంతము ప్రక్షిప్త మని యను బంధముగ ముద్రించిరి. క్రీ. శే. బ్ర. శ్రీ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిలవా రాముక్తమాల్యద యేడాశ్వాసముల గ్రంథ మని నిశ్చయించి యాఱవ యాశ్వాసాంతముగ 'ఇది నైరామన' యను పద్యమును, ఏడవయాశ్వాసాంతముగ 'ఇది నీలాచల నీలచేలక' యను పద్యమును ముద్రించిరి. ఆముక్తమాల్యద యాఱాశ్వాసముల గ్రంథమైనను కావలయును; లేదా, పెక్కు తాళపత్రగ్రంథములం దున్నట్లేడాశ్వాసముల గ్రంథ మేనియు గావలయును. వావిళ్ళవారిరలె నాఱాశ్వాసముల గ్రంథ మని తలచినయెడ 'ఇది నైరామన' 'ఇది నీలాచల' యను నాశ్వాసాంతములందు యం దొక్కదానిని విసర్జింపవలసివచ్చును. రెంటియం దేది సత్యమైనదో నిశ్చయించుట సులభము గాదు. ఏలన 'ఇదినైరామన' యను పద్యము శ్రీనివాసవ్యాఖ్యతో గూడిన ప్రతులయందే కానవచ్చిన, 'ఇది నీలాచల' యనునది జోగిజగన్నాథపండితుని వ్యాఖ్యతో గూడిన ప్రతులలోనే గానవచ్చుచున్నది. కావున గ్రంథ మేడాశ్వాసముల దని తాళపత్రగ్రంథములందు పెక్కింటియం దుండుటచే బ్ర. శ్రీ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిలగారి మార్గము నవలంబించుట యుక్తము.

పంచమాశ్వాసాంతపద్యమునందు చేర్కొనబడిన కెంబావి హైదరాబాదు సంస్థానమునకు చెందిన గుల్బర్గజిల్లాలో గుల్బర్గకు నైరృతిమూలను ౫౦ మైళ్ల మీద నున్న గ్రామమని క్రీ. శే. శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణరావుపంతులుగారు గుర్తించియున్నారు[9]. కాని యందు రాయలచే వధింపబడిన యవను లెవ్వరో వారు వివరించియుండలేదు. కృష్ణరాయలు పూర్వదిగ్విజయయాత్ర సేయుచుండగా క్రీ. శ. ౧౫౧౪ సంవత్సరమున గుల్బర్గ యమీరు బరీదుచేయబడి క్రింద నుండె ననియు, దానిని ఇస్మాయిలాదిల్ ఖానుడు జయించి స్వాధీనపఱచుకొనగా బరీదందులకు గినిసి బుర్హానిజామ్‌షాహ, కుల్లీకుతుబుషాహ, అల్లావుద్దీన్ ఇమాదుషాహ మున్నగువారి సహాయముతో గూడ విజాపురముపై నెత్తివచ్చెననియు, యుద్ధమున బరీదుమిత్రులతో గూడ నోడి పాఱిపోయెననియు ఫెరిస్తా వ్రాయుచున్నాడు[10]. కాని ఫెరిస్తా వ్రాత విశ్వాసపాత్రము గాదు. ఏలన ఫెరిస్తా క్రీ. శ. ౧౫౧౪వ సంవత్సరమున జరిగినట్లు చెప్పు చరిత్రాంశములన్నియు సమకాలిక పోర్చుగీసు గ్రంథకర్త లంతకు నాలుగేండ్లకు పూర్వము క్రీ. శ. ౧౫౦౯వ సంవత్సరమున కృష్ణరాయల పట్టాభిషేక మైనవెంటనే సంభవించినట్లు వ్రాసియున్నారు[11]. ఫెరిస్తా వాక్యముల సత్యాసత్యము లెట్లున్నను కెంబావి యప్పుడు బహమనీసామంతులయధికారముక్రింద నుండినది. కలుబరిగెకోట కప్పుడు విజాపురాధిపతి యగు నేదుల్‌ఖానునకును, బీదరుసర్వాధికారియగు

9. లక్ష్మణరాయవ్యాసావళి. పుట. ౪౫.

10. *Brigg's Ferishta_III pp.* 45_7.

11. *JOR X pp* 168_171.

బరీదువకును దఱచుగ యుద్ధములు జరుగుచుండినవి. బరీదువకు బ్రాపై యహమదనగరసుల్తానగు నిజామ్ - ఉల్ - ముల్కు ఏదులఖానుతో యుద్ధము సల్పువాడు; కావున కృష్ణదేవరాయల కళింగ జైత్రయాత్ర యప్పుడు కంబాని యెవ్వరి యేలుబడిక్రింద నుండెనో నిశ్చయించి చెప్పుటకు సాధ్యముకాదు. ఇక షష్ఠాశ్వాసాంతమున చేర్కొనబడిన 'సైజామన' యహమదనగరపాలకుడగు నిజాముశాహు కావచ్చును. కంబాని యుద్ధమునకును సైజామనయావనప్రభుని మణీగృహాళి నిర్మూలనమునకు నెద్దియేనియు సంబంధముండి యుండును.

కృష్ణదేవరాయలు కంబానిని యవనాస్పృష్టము గావించి సైజామనయావనప్రభుని మణీగృహాళిని నిర్మూలము గావించిన దెప్పుడు? ఈప్రశ్నకు సరియైన సమాధానము చెప్పుటకు దగిన సాధనసామగ్రి ఇంకను దొరకలేదు. అంతిదనుక ఈవిషయమై నిశ్చయము తేలదు; కాని రాయవాచకము విశ్వాసపాత్రముగ జేని యది కృష్ణరాయల తెలింగాణధాటి యప్పుడు (క్రీ. శ. ౧౫౧౪-౧౫)జరిగియుండవలయును. అట్లుగాక ఆముక్తమాల్యద యాశ్వాసాంతపద్యక్రమము ననుసరించి—ముద్రితప్రతులలోని యాశ్వాసాంతపద్యక్రమము విశ్వాస్యముగ జేని—సింహాద్రివిజయస్తంభస్థాపన మైనపిమ్మటను, కటకదహనమునకు బూర్వము నను నడచియుండవలయును. భావిపరిశోధనమువలన ఇందలి నిజానిజములు తేలవలసియున్నవి.

---

# ఎదురీత

శ్రీ కే. వీరభద్రాచారి

అనంత మీా కాలప్రవంతిని
అడుగుజాడ లెరుగని వేగము
పయనానికి ఫల మే ముందని—
ఎదురీత? బాటసారీ!

ఆశాహర్మ్యము అగపడదోయీ
నిరాశగీతిక వినపడదోయీ
ఏమో? నీ గమ్యం—
ఎందుకో? యీ ప్రయాస—

శిశిరచ్ఛాయల విషాదప్రకృతి
వసంతోదయశ్రీల వైభవము
కనలేదో కన్నీటి కణమ్మును?
వెలుగలేదా చిరునగవువెన్నెలలు?
హృదియే లేదా? భావనాశూన్యమొ?

పూల తావిలావణ్యము నెరుగని,
అనుభవాల వైవిధ్యమును మరచి—
నీప్రయాణమున కర్థమేమిటో?
ఈవాహిని కిక అవధులే లేవ
పయనానికి ఫల మే ముందని—
ఎదురీత? బాటసారీ!

---

# రామరాజు

శ్రీ సత్యవోలు సుందరరావు

శ్రీకృష్ణదేవరాయల అనంతరం రాజ్యాభిషిక్తుడయిన అచ్యుతదేవరాయలు గుత్తిలో లేచిన అల్లరుల్ని అణచివేసి తిరిగి వస్తూండగా, రామరాజు అతణ్ణి ఖైదీ చేసితానే పరిపాలిస్తూంటాడు విజయనగరసామ్రాజ్యాన్ని. ఇది విజయనగరానికి దక్షిణంగా ఉన్న సామంతుల కిష్టంలేక స్వతంత్రించడానికి ప్రయత్నాలు చేస్తూంటారు. వారి నణచడానికని వారిమీద దండయాత్రచేస్తాడు రామరాజు.

---

[ప్రదేశం: తిరువాన్కూరు ప్రాంతాల్లో. యుద్ధరంగంలో రామరాజుశిబిరం. రామరాజు ఆలోచనతో ఇటూ అటూ పచార్లుచేస్తూంటాడు. కొంచెం ప్రక్కగా సేనా నాయకుడూ, తమ్ముడూ అయిన చినతిమ్మరాజు కూర్చొనివుంటాడు ]

రామరాజు—అయితే చినతిమ్మా, ఇక దక్షిణ దేశసామంతుల్ని పూర్తిగా ఓడించడం సాధ్యం కాదంటావా?

చినతిమ్మరాజు—నావుద్దేశంలో ఇంకెంత ప్రయత్నించినా వృథాఅనిపిస్తూంది. ఇప్పటికి మూడు నెలల నుంచి రాజధానిని వదలి కొన్నివందలమైళ్ల దూరంలో శిబిరంవేసుకొని వాళ్లతో యుద్ధం చేస్తూన్నాం. వెంటవచ్చిన సైన్యమూ, రోజురోజుకీ చిక్కిపోతూంది. ఇక పగవారా వారివారి గృహాల్లో కూర్చొని తీరుబడిగా యుద్ధం చేస్తూన్నారు. త్వరలో వారి నందర్నీ ఓడించగలమనే ఆశ ఏమీనా కన్పించడం లేదు.

రా. జు—నీ అనుమానముకూడా ఆలోచించవల్సిందే. కాని ఒకసారి తలపెట్టిన కార్యమూ, కాలు పెట్టిన కదనమూ అయితీరవల్సిందే అని పట్టుపట్టిన ఈ రామరాజుకు సంధిప్రయత్నం ఒక ప్రకృతివిరుద్ధ కార్యంసుమా?

చి. తి—భుజాల్లో బలం చిక్కేదాకా సామంతుల్ని కొత్త చూసీచూడనట్టు వదలివేయడంలో రాచమర్యాదకే లోపమూ వుండదనుకొంటాను. సంధి మన కెంత యిష్టమైనా సమయాన్ని పట్టి అనుసరించడం వివేకమైన రాజనీతి.

రా. జు—ఇంతకాలమూ యుద్ధంచేసి, ఒక్కమాటు సంధికోసం ప్రాకులాడుతే, మనం చులకనౌతామేమో అని సంశయంగా వుంది. ఇంతకీ రాజధాని నుంచి తమ్ముడు విఠలు డేమీ వార్తల్ని తెలియపర్చనే లేదా?

చి. తి—ముఖ్యావసరవిషయాల్ని తెలుపడానికి ఎవర్నో వార్తాహరుణ్ణి పంపినట్లు నాలుగు రోజులక్రితమే తెలిసింది. కాని ఇప్పటివరకూ ఎటువంటి వార్తా రాలేదు.

రా.జు—కారణమేమైయుంటుందో? ముఖ్యావసరములకేమున్నాయి? విఠలుడికే ఆపదా రాలేదుకదా! ఎంచేతో నామనస్సూరికే ఆరాటపడుతూంది.

(బయటనుండి సేవకుడు "ప్రభూ, శ్రీ విఠలరాయలుంగారు!")

ఆఁ! విఠలుడా! తానే స్వయంగా రావడానికి అవశ్యమేమొచ్చింది? రాజధాని...

[విఠలుడు ఆయాసంతో రొజుకుంటూ మొఖం వేలవేసుకొని ప్రవేశిస్తాడు. చినతిమ్మరాజు ఆసనం మీద కూర్చోపెట్టి సేదతీర్చుతాడు.]

రా. జు—ఇంతదూరం ఏకాకివై వచ్చేవా విఠలా! వార్తాహరునిచేత పంపలేకపోయావా రహస్యవార్తల్ని. విజయనగర మెలా వుంది? మీవదిన తిరుమలమ్మ క్షేమమేనా?

విఠలుడు—(తల వంచుకొని) అవమానంతో అన్నగారి ముఖాన్ని చూడలేకపోతూన్నాను. వదినగార్ని చేతంచర్ల కోటలో సురక్షితంగా......

రా. జు—(విభ్రాన్తుడై తొందరగా) చేతంచర్ల లోనా! అవమానమా!! ఏంజరిగిందో వివరంగా చెప్పు! ఏం! ఆ బిజాపూరునవాబు......

విఠలుడు—కాదు అన్నయ్యా. మీరు నమ్మి కారాగారాధిపత్యాన్ని చేతుల్లో పెట్టిన ఆ కాటమదు స్వామిద్రోహాన్ని తలపెట్టి సగం చిక్కి శల్యమై పడున్న ఆ అచ్యుతుణ్ణి విముక్తుణ్ణి చేసేడు. ఈసంగతి తెలియగానే వదినెగార్ని ఒక పోర్చుగీసువర్తకుడి బండి మీద చేతంచర్ల తీసుకొనివచ్చి అక్కడ సురక్షితంగా ఉంచేను.

రా. జు—ఎంత ద్రోహాన్ని తలపెట్టేడూ! ఆ తాళాల్ని కూడానీచేతుల్లో నే పెడదా మనుకొంటూంటే, తమ్ముడు రాచకార్యాల్లో మునిగిపోయుంటాడు; ఎందుకూ, నాదగ్గిరే వుండనియ్యమంటే వాడిమీద విశ్వాసంకొద్దీ ఆ కాటమడి కిచ్చేను. అప్పటినుంచీ ఎత్తుగడ వేస్తూన్నా డన్నమాట. డబ్బుకోసం ఆశించి, చిన్నప్పటినుండీ నామీ దుంచే విశ్వాసాన్నీ భయభక్తుల్నీ త్రోసిపుచ్చి ఇంతటి విద్రోహానికి తలపెట్టేడు. నీచులకు అధికార మిచ్చినవాడిది తప్పుకాని, వాళ్ళ నని లాభమేమిటి?

(కోపంతో) వాణ్ణి హతమార్చక వదలివచ్చేవా విఠలా!

విఠలుడు— అపుణ్యాన్ని నాకు దక్కనీయలేదు. వెంటనే అచ్యుతుని బావమరది సాలకరాజు తిరుమల రాజుతో వాడిని హతమార్చేడు. ఆతిరుమలరాజుతో నే దక్కడ రాజ్యపాలన. రాజకీయాల్లో అచ్యుతు డేమీ కలుగజేసుకోవడమే లేదట.

రా. జు—ఓహో! సాలకరాజవంశోద్ధారక చిన తిరుమలరాయడా నేటి విజయనగరరాజ్యపాలకుడు! రామరా జింకనూ బ్రతికేయున్నా డని మరచేడు కాబోలు! తక్కిన పరిస్థితు లెట్లున్నవో తెలిసేయా?

విఠలుడు—మనకి చాలా వీలుగా లేకున్నాయి. కొద్దిరోజులక్రితం బిజాపూరునవాబు ఇబ్రహీం ఆదిల్ ఖాన్ విజయనగరాన్ని ముట్టడించేడు. యుద్ధంలో విజయం ప్రస్తుతం అచ్యుతునివైపే మొగ్గుతూందిట.

రా. జు—బిజాపూరులో ఎవరున్నారో?

విఠలుడు—ఇంకెవరు? ఆ మాయలమారి మంత్రి అసద్ఖాన్ లారీ.

రా. జు—(చిన్ననవ్వు) ప్రస్తుతం మన కర్తవ్యం ఏమిటో తోచిందా చినతిమ్మా?

చి. తి—నాకొక్కటే తోస్తూంది. మనం త్వరగా వెళ్ళి ఇబ్రహీం ఖానుపై పడితే అతడుతట్టుకో లేడు. అతడేమాత్రం తలొగ్గినా అతని సహాయంతో విజయనగరాన్ని వశం చేసుకోవడమే.

రా. జు—నీవల్లకాని ఆసలే నేనంటే బద్ధవైరుడైన ఆదిల్ ఖాన్ తోనా చెలగాటాలు! ఒకవేళ నవాబు అచ్యుతునితో నే కలిసి మనపై తిరిగితే......(కొంచెం సేపాలోచించి) ఇలాంటప్పుడు మిత్రభేదమే శరణ్యం. విఠలా, నిన్నే దీనికి నియోగిస్తూన్నా. గోల్కొండ వెళ్ళి అసద్ఖాన్ రక్షణలో నున్న బిజాపూరుపై దండెత్తమని, గోల్కొండనవాబుని కవ్వించి అతడు బిజాపూరుమీద దండెత్తేలాగ చెయ్యాలి. అత్యవసరంగా పరిగెత్తవలసిన ఆదిల్ ఖానుకు సహాయం చేస్తే మళ్ళీ మనం విజయనగర దండయాత్రలో అతడి సహాయం పొందొచ్చు. బహుజాగ్రత్తతో మెలగాలి సుమా విఠలా!

(విఠలుడు నిష్క్రమణ)

చి. తి—ఇక దాక్షిణాత్యసామంతులతో సంధి విషయాలను త్వరగా పూర్తిచేసుకోవడం అవశ్యం అనుకొంటా.

రా. జు—ఇప్పుడే వారికి వర్తమానం చేయించు. రేపు సూర్యోదయానికే మన సైన్యం విజయనగరాభిముఖంగా ఉండే ప్రయత్నాలు సిద్ధంచేయి. వీరరాయల్ని పెనుగొండకు వెళ్లి మీ పదివేలను వెంటబెట్టుకొని దారిలో మమ్మల్ని కలుసుకోమని పంపు. [తెర]

రెండవ రంగం

[కాలం: ఒక నెలతరువాత. ప్రదేశం: విజయనగరానికి దక్షిణంగా శిబిరాల్లో. ప్రవేశం: రామరాజూ, భార్య తిరుమలమ్మా.]

తిరుమలమ్మ—యుద్ధవిషయాల్లోనూ రాజకీయాల్లోనూ ఆడదాని మాటా అని త్రోసివేయకుండా నామాట వినమని ప్రార్థిస్తూన్నాను. ఏ యుద్ధమూ లేకుండా ఎంత సులభంగా అన్ని విషయాలూ తేలిపోతాయో ఆలోచించండి—సంధికి అంగీకారసూచకమైన ఒక్క మాటతో.

రా. జు—ఈ శాంతియుత ప్రయత్నాలంటూ నే ఇదివరకూ బోధిస్తూ వచ్చేవు. వీలైనంత వరకూ విన్నానుకూడ. ఇప్పుడు రామరాజు పరువు ప్రతిష్ఠలకే ముప్పు కలుగుతున్నట్టు కనిపిస్తూంది.

తిరు—నే నేమీ శాంతీ అహింసల్నీ బోధించడానికి రాలేదు స్వామీ. మీకు బోధించడానికి నే నెంతదాన్ని?

రా. జు—(నవ్వుతూ) కీర్తిశేషులైన సామ్రాట్ శ్రీకృష్ణదేవరాయల అనుంగు కూతురివి.

తిరు—ఇది పరిహాసమో కాదో కూడా తెలుసుకోలేకున్నాను. ఈ ప్రొద్దున్న వరదాదేవి నన్ను చూడడానికి రాచనగరునుంచి వచ్చింది. కళ్లనీరుతో తన మాంగల్యాన్ని నిలుపమని ప్రార్థించింది. ఆమె కోరిక తీర్చమని మిమ్మల్ని నేను అర్థిస్తూన్నాను.

రా. జు—రాజపుత్రికవు, వీరాధివీరుల ఏకైక పుత్రికవు. నీకు సామాన్యత పోలే దేమి తిరుమలమ్మా! రాజకీయపు ఎత్తుల్లో ఆడవారి మాంగల్యాలు లక్ష్యమవుతాయా? ఆ వరదాదేవిమీద ఎందుకు నీ కీ మమత? అచ్యుతుడూ, అతనితో బాటు ఆమే నాకు గర్భశత్రువులు సుమా!

తిరు—(గబగబా) ఎందువల్లనో, మరణశయ్యమీ దున్నపుడు నాజనకులు తమతరువాత అచ్యుతుణ్ణి రాజ్యాభిషిక్తుణ్ణి చేయాలని మీవద్దనుంచి మాటతీసుకొన్నందుకా? అతివిశ్వసనీయుడైన సాలువ నరసరాయల మాట కాదని అచ్యుతరాయలు మీకు రాజ్యపాలనలో అర్ధభాగం ఇచ్చినందుకా, అతనిమీద ఆ గర్భశత్రుత్వం!

రా. జు—(కోపంతో) ఇది చెప్పడానికి సమయం కాదు, తిరుమలా. మామగారు నాకు చేసిన ఉపకారానికి కృతజ్ఞతగా పద్దెనిమిదిమాసాల చిన్న బావని సామ్రాజ్యాధిపతిని చేయాలనుకొన్నాను. కాని అనర్హుడైన ఈ అచ్యుతుని కేం వారసత్వపు హక్కుందని నామాట కెదురుచెప్పి రాజ్యానికి రావాలి? ఇవన్నీ అన్యుల ప్రోత్సాహంతో చేసిన కూరకార్యాలు! చూసేవుగా అతని సమర్థత! నగరులో నేను లేనప్పుడు కాపలావానికి లంచమిచ్చి కారాగారంలోనుంచి తప్పించుకొని ప్రగల్భాలు పలికే శూరశిఖామణి! తీరా నేను ఎదుట నిలిచేటప్పటికి సంధిప్రయత్నాలకోసం ప్రాకులాడి ఆఖరుకు ఆడువారిచే...

తిరు—లేనివి కల్పించకండి. వరదాదేవి అతడు పంపితే రాలేదు. యుద్ధమే జరుగుతే ఆమెకు తెలుసు జయాపజయా లెటువైపు వుంటాయో. అందుచేత తనంతట తనే అతనితో చెప్పనేనా చెప్పకుండా—

రా. జు—అంతఃపురంలో అతనికి తెలియకుండా ఆమె నిన్ను చుట్టపుచూపులకోసం వస్తూంది! నన్ను మధ్యపెడతా వెందుకు తిరుమలా?

తిరు—కోపంలో మంచీ చెడ్డా తోచడం కష్టమంటారు. తా తలచినది—దైవ తలచినది రంభ అనే జనోక్తిని నిజం చేస్తున్నారు. మీవద్దనుంచి ఏ ప్రమాదాన్నీ అనుమానించకుండా గుత్తికోటనుంచి విజయోత్సాహంతో వస్తున్న అతిణ్ణి పట్టుకొని ఖైదులో పెట్టడం లాంటి సమర్థత అతనికి తెలీదు. అవకాశం వచ్చినపుడు కారాగృహంలోంచి తప్పించుకోవడమూ, తనకు రావలసిన రాజ్యానికి రాజవడమూ అతడి అసమర్థతా పిరికితనమూ లాగ తోస్తున్నాయి కాబోలు. (కొంచెం ఆగి) క్షమించండి పాతవన్నీ త్రవ్వినందుకు.

రా. జా—ఎంతటికైనా, పుట్టింటివారిమీద ప్రేమాదరణలు ఆడువారికి సహజం కాబోలేం. ఆగిపోయా వేం? ఇంకా చెప్పు, తిరుమలా.

తిరు—ఆడుదాని కుంటే పుట్టింటిమీది మమతే అనుకోండి నన్నిలా మిమ్మల్ని ప్రార్థింపజేస్తూంది. ఎంతటి అవకాశమో చూడండి. బిజాపూరునవాబ్ ఆదిల్‌షా అంతటివాడిని మధ్యవర్తిగా పెట్టి, అచ్యుతుడు అత్యంతసౌహార్దముతో అర్థిస్తూన్నాడు. మన ప్రాంతాలకి మనమే స్వతంత్రులమట. అతడే జోక్యం కలుగజేసుకోకుండా శాంతియుతంగా ఆజన్మాంతం ప్రవర్తిస్తా నని హృదయపూర్వకంగా బాసచేస్తూన్నాడు. ఇంతకన్నా మరో ఉభయస్నేహసూచకమైన అంగీకారం కోరితే వస్తుందా? సమయం జారవిడచడం .........

రా. జా—దేవి నాకు రాజ్యాంగాల్ని నేర్పుతూంది కాబోలు!

తిరు—ముందరే క్షమార్పణ వేడుకొన్నాను.

రా. జా—ఇంతవరకూ అయిష్టంగా ఉన్న నామనస్సుని సంధివేపు తిప్పేవు తిరుమలా. తమ్ముడు చినతిరుమలరా జిప్పుడే వస్తాడు. అతనితోకూడ ఆలోచించిచేకాని నీ కేమాటా ఇవ్వను. నన్ను కొంచెం సేపు ఏకాంతంగా వుండనీయి.

[తెర]

## మూడవ రంగం

[కాలం: మరికొద్దిరోజుల తర్వాత. ప్రదేశం: గుత్తికోట. ప్రవేశం: అచ్యుతదేవరాయలు మరణించేడని విని, సైన్యం వెంటబెట్టుకొని వచ్చిన రామరాజూ, అతని ఇద్దరు తమ్ముళ్లూను.]

రా. జా—విశలా, సదాశివుణ్ణి సగౌరవంగా కారాగారంనుంచి తీసుకొనిరా. (అతడు నిష్క్రమించును.)

చి. తి—మన మిక్క డాలస్యం చేస్తే, ఆసాలకరాజు తిరుమలరాయల ధాటి కప్పుడే నిరుత్సాహులవడం ప్రారంభించిన ఆదిల్‌షాసైన్యము విజయనగరాన్ని విడిచి వెళ్ళిపోతారేమో అని శంకగా ఉంది అన్నయ్యా.

రా. జా—మన ముందమని కబురంపినా ఉండలేని పిరికిసైన్యంవల్ల కాగల సహాయం ఏ ముంటుంది? క్రమంగా సైన్యాన్ని కూర్చుకొని వీలైనంత త్వరలో మనమే విజయనగరంమీద పడడమే మన కర్తవ్యం.

[చిక్కి బలహీనంగా ఉన్న సదాశివరాయలు ప్రవేశిస్తాడు.]

సదాశివ—ఇన్నాళ్లబట్టీ కారాగారంలో పడి అవమానంతో కుములుతూన్న నన్ను విముక్తుణ్ణి చేసినందుకు నా కృతజ్ఞతా పూర్వకవందనాలు. విజయనగరాభిముఖంగా యుద్ధసంసిద్ధులై వెళ్లుతూన్నట్లు తెలిసింది. మీవిజయోత్సాహంలో నాకూ కొంచెం భాగమిమ్మని అర్థిస్తూన్నాను.

రా. జా—(మందహాసంతో) సదాశివా, నీవిజయంలో కొంచెం రామరాజే అడగాలనుకొంటూన్నాడోయ్.

సదా—నాకు విజయమూ, మీకు భాగమూనా! ఇది పరిహాస మనుకొంటాను.

రా. జా—పరిహాసం కాదు నాయనా. సాలకరాజపవిత్రవంశాన చెడపుట్టిన ఆ తిరుమలరాయుడు నేడు విజయనగరసింహాసనాన్ని చేజిక్కించుకోవాలని తలపెట్టూన్నాడు. వాడి ప్రవర్తనా పరిపాలనా అతి క్రూరంగానూ, దుర్భరంగానూ వుంది.

సదా—తిరుమలరాయ డెవడూ, అచ్యుతుని కుమారుడు వెంకటరాయ లుండగా?

రా. జా—ఇంకెక్కడి! వెంకటరాయలు? ఆ బుడుతణ్ణి చెరలో పెట్టి తానే సింహాసన మెక్కేడు. అన్న దౌర్జన్యాన్ని చూడలేక వరదాదేవి నన్నూ, ఆదిల్‌షానూ శరణుజొచ్చింది. దానిపై ఆదిల్‌షా విజయనగరంమీద దండెత్తగా వరదాదేవి చేసిన ప్రయత్నం ఆ క్రూరుడు తెలుసుకొని వెంకటరాయల్నీ, వరదాదేవినీ చంపించేసేడు.

సదా—ఎంతటి అమానుషాని కొడిగట్టుకొన్నాడు! త్వరగా వెళ్లి ఆదిల్‌షాతో చేరి...

రా.జు— ఇప్పుడిప్పుడే చేరిన వార్తల్ని బట్టి ఆదిల్ షా ఓడిపోతూన్నట్టు తెలిసింది. అయినా ఆతని సహాయం అంత వాంఛనీయంకూడా కాదు. సదాశివా, నువ్వెళ్లి నీప్రాంతంలోని యోధుల్నందర్నీ కూర్చుకొని చేతంచర్లకు ఆసలీనాడే చేరుకోవాలి. అక్కడ మన బలాన్ని కూర్చుకొని ముందుకు సాగుదాం. రామరాజుకు ఒకటే లక్ష్యంలో వుంది. సదాశివరాయలే విజయనగరసామ్రాట్ కావాలి. అందు కొరకు డెంకటికైనా సంసిద్ధుడు. (సదాశివుకు ఆనందాతిశయాల్తో నిర్ఘాంతపోతాడు.) ఆలస్యం చేయడానికి సమయం కాదు. త్వరగా మమ్మల్ని కలుసుకో. కాబోతూన్న యావద్విజయనగరసామ్రాజ్యచక్రవర్తీ, శ్రీసదాశివరాయా, ఇవే నా దీవనలు!

(ఆతడు దీవించేక సదాశివుకు నిష్క్రమించును.)

చినతిమ్మ—ఇదేం వైచిత్ర్యం అన్నయ్యా! మధ్య ఈతగ్గెందుకూ?

రా. జు—అంత దూరదృష్టి లేకుండా చేసేననుకొన్నావా? మనకి తెలిసున్న విషయమే కదూ— విజయనగరంలో సేనంటే పడని ఉన్నతోద్యోగస్థులకి సదాశివుడంటే అపరిమితమైన భక్తివిశ్వాసా లని! అందుచేత సదాశివరాయలకు నామమాత్రవిజయనగర సామ్రాజ్యాధిపత్యమూ, మనదే సర్వాధికారమూను.

[తెర]

## నాలుగో రంగం

[ప్రదేశం: తుంగభద్రఒడ్డున శిబిరాలు. దూరాన్ని యుద్ధకోలాహలం.]

రామరాజు—ఇప్పటి కైదుచోట్ల ఓడిపోయినా ఇంకా బుద్ధి రాలేదీమూర్ఖుడికి. నేటితో వాడి పైశాచికజీవితం ముగియాల్సిందే!

సదాశివ—ఇంకా ఎందుకో ఈ వ్యర్థప్రయత్నాలు! చేతంచర్లలో సగానికి సగం బలం క్షీణించిపోయినా, ఆదవానిలో యుద్ధం చేయలేక పరుగెత్తినా, జుత్తూరు బేడిగల్లులలో శరీరాలు చితికిపోయినా, వాడూ వాడి మూర్ఖపుసామంతులూ వాళ్లపట్టు విడవలేదు. బహుశః వారి మొండితనం అఖరయ్యేది ఒక్కసారే ఏమో!

[విఠలుడు ప్రవేశించును.]

విఠలుడు—విజయం మనదే అన్నయ్యా. అన్న చినతిమ్మ ఆ క్రూరుణ్ణి బందీగా పట్టుకొని శిరశ్ఛేదానికి చక్రవర్తిఅనుజ్ఞ వేడుతూన్నాడు.

సదా—తక్షణమే కానిమ్మని నా...

రా.జు—కొంచెంకాలం ఓపికపట్టమను సదాశివా. వాడికంత గౌరవపూర్వకమైన మరణం కూడదు. విఠలా, వాడిని రాజధానికి జాగ్రత్తగా తీసుకురమ్మని తమ్ముడితో చెప్పు. అందరు ప్రజలసమక్షంలోనే వాడికి ఉరిశిక్ష.

విఠ—సైన్యాల్ని విజయనగరంవైపు నడిపించవచ్చా?

రా.జు—తక్షణం. మనం ఈ సాయంకాలం లోపలే విజయనగరం చేరుకోవలి. అక్కడికి వెళ్లగానే శ్రీ సదాశివరాయల సామ్రాజ్యాభిషేకమహోత్సవానికి అందరు సామంతుల్నీ పిలిచే సన్నాహాలు చేయించు. ఆనాడు విజయనగరానికి శ్రీకృష్ణదేవరాయసార్వభౌములనాటి శోభ మళ్లీ వచ్చేలాగ నగరాలంకరణ ప్రయత్నాలు చేయించాలి.

[తెర]



# విమర్శనము



## SPAN OF LIFE

గ్రంథకర్త: జ్యోతిషాచార్య జి. శ్రీరామమూర్తిగారు. ప్రకాశకులు: శ్రీమతి జి. సీతాలక్ష్మిగారు, టెక్కలి, ఉత్తరవిశాఖజిల్లా, వెల: ౫ రూ.

జాతకశాస్త్రములో ఆయుర్దాయనిర్ణయము చాల చిక్కుసమస్య. ఆయుర్దాయము నిర్ణయించనిదే, యోగఫలాదులు గమనించుట నిష్ప్రయోజనమని ప్రాచీనుల సంప్రదాయము. సత్యమే. కాని, ఆయుర్దాయము సులభముగా దొరకు వస్తువు కాదు.

"ఆయుర్దాయవిచారోహి
గహన స్సర్వదా ద్విజ,
ఆయుర్బహుప్రకారేణ
భాషితం బ్రహ్మణా పురా."

అనుచున్నది బృహత్పరాశరహోర. ఆయుర్నిర్ణయవిషయమున అనేకమతములు, భిన్నసంప్రదాయములును కలవు. నక్షత్రము (అనగా చంద్రుని)పై ఆధారపడినవి కొన్ని, స్పష్టలగ్నగ్రహములవలన గణింపబడునవి కొన్ని, రాసులపై ఏర్పడునవి కొన్ని, ఇతరమార్గముల ననుసరించునవి మరికొన్ని. ఇట్లు నానాప్రకారములయిన పద్ధతులు ప్రాచీనగ్రంథములలో వర్ణింపబడియున్నవి. వానిలో, ఏపద్ధతి ఏజాతకమునకు అన్వయించవలెనో తెలిసికొనుట కష్టసాధ్యము. ఈవిషయమై అనేకసూత్రములు బృహత్పరాశరహోరలో వ్రాయబడినవి కాని వానికి వాడుకలో వ్యాప్తి రాలేదు.

ఖగోళములో సంచరించు గ్రహములకు మన జీవితములపైన అధికార మున్నదనుటే జ్యోతిశ్శాస్త్రమునకు పునాది. అగుటచే, చంద్రస్థానమో, రాశియో ఆధారముగా లెక్కించు పద్ధతులకంటె, అన్ని గ్రహముల యొక్కయు, పైగా లగ్నము యొక్కయు స్థితిపై ఆధారపడు పద్ధతులే, వైయక్తికముగా, ఆయుర్దాయవిచారమున హెచ్చు విలువ యుండుట న్యాయమని మనము విశ్వసించుట సులభము. ఇట్టి గణితాయుర్దాయపద్ధతులు నాలుగు వరాహమిహిరాచార్యుడు బృహజ్జాతకములో నిరూపించినాడు. వీనిని సక్రమముగా సాధించుమార్గమును శ్రీపత్యాచార్యుడు, కేశవదైవజ్ఞుడు మున్నగు మహనీయులు స్పష్టపరచిరి. షడ్బలసాధనము చేసినప్పుడు బలాధిక్యము లగ్నమునకు వచ్చినచో అంశాయుర్దాయమును, రవికివచ్చినపుడు పిండాయుర్దాయమును, చంద్రునికి వచ్చెనేని నిసర్గాయుర్దాయమును, ఇతరసందర్భములలో జీవశర్మాయుర్దాయమును గుణించవలె ననుటే వీరి సంప్రదాయము. సాధారణముగా లగ్నరవిచంద్రులకే, నూటికి ౭౫ వంతుల జాతకములలో బలాధిక్యము వచ్చుటచే, వరాహమిహిరాచార్యుడు వీనికే ప్రాధాన్యమిచ్చెనని పెద్ద లందురు. ఈతత్త్వమునే నమ్మిన జాతకపారిజాతకర్త కుజ, బుధ, గురు, శుక్ర, శనులకు బలాధిక్యము వచ్చినప్పుడు, క్రమముగా, అష్టకవర్గాయుర్దాయము, రశ్మ్యాయుర్దాయము, దశాయుర్దాయము, కాలచక్రాయుర్దాయము, సముదాయాయుర్దాయము సాధించుట ప్రాచీనపద్ధతి యని చెప్పెను.

ప్రాచీనశాస్త్రవేత్తల కథ ఇట్లుండగా, "ఏగణితాయుర్దాయపద్ధతితోనైనా, ఆయుఃప్రమాణము నికరముగా నిర్ణయించుట అసాధ్యము" అని సుప్రసిద్ధశాస్త్రవేత్తలగు శ్రీయుత బి. వి. రామన్‌గారు అభిప్రాయపడుచున్నారు (గ్రంథపీఠిక చూడుడు.). పరాశర, వరాహమిహిరులమతములపై వీరికి గొప్పభక్తి గలదు. అగుటచే, వారి ఆయుర్దాయపద్ధతులకుమాత్రము ఇంత తేలికగా జలాంజలి ఈయబడుట కష్టమని తోచక మానదు. అనుభవములో ఈగణితపద్ధతులకు విలువ కానరానిచో, దాని కేమి హేతువో పరిశోధనలు పలు

ఫుట భావ్యము. ఆయువాంశల దోషమో, మరి యే లోపమో ఏల కారణము కారాదు ?

అది యట్లుండె. ఈ విమర్శకుల మతమున మారకగ్రహముల నిర్ణయించి, వింశోత్తరీదశలను సాధించుచే ఆయుర్దాయవిషయమున ఉపయుక్తమయిన మార్గము. సర్వసామాన్యముగా మనవారు—అందు దక్షిణదేశములో విశేషముగా—కార్తాంతికులు ఉపయోగించు పద్ధతి ఇదే. మారకగ్రహముల దశాంతర్దశలలో ఆయుస్సు తీరు ననుట వీరి సంప్రదాయము. కాని, ఒక్కొక్క జాతకమునందే అనేకగ్రహములకు మారకలక్షణము పట్టుటచే, అనేకసందర్భములలో, ఒకమారకదశ మారకము చేయనపుడు మరియొక మారకగ్రహ వచ్చుదాక జాతకుడు కాచుకొనియుండ వలసివచ్చుచున్నది. ఇది ఇట్లుండగా, ఏ జాతకమున కయినాసరే, వింశోత్తరీదశనే ఉపయోగించుట సాధువా యని ఆధునికశాస్త్రవేత్తలు పలువురు సందేహించుచున్నారు. అంతె ఏల? సూత్రకర్తయగు పరాశరుడే ఈ 'ఏకమాలికాప్రయోగము' నకు అవకాశము నీయలేదు,

ఇవికాక, జైమినీయాయుర్దాయపద్ధతులు కొన్ని గలవు. జైమినిసూత్రములు మహాక్లిష్టములైనవి. కొన్ని సూత్రములకు వ్యాఖ్యానము కానరాదు. సూత్రములకు అర్థము చెప్పు విషయమున భిన్నసంప్రదాయము లున్నవి. ఈ పద్ధతులకు సంబంధించిన నిబంధనలు కొన్ని బృహత్పరాశరహోరలో నే కలవు. లగ్నాష్టమాధిపతుల స్థితి మున్నగువానిచే అల్పమధ్యపూర్ణాయువులలో జాతకునికే ఆయుస్సు పట్టునని నిర్ణయించుకొని, తరువాత దశాపద్ధతులతో ఆయుర్దాయము తేల్చుట మరియొక పద్ధతి. ఇంతేకాక, ఈగ్రహయోగ మున్నవానికి ఇన్నే సంవత్సరములు ఆయుస్సని నిర్ధరించు సూత్రములు కొన్ని సర్వార్థచింతామణి మున్నగు గ్రంథములలో కలవు. ఇవి చాలక, గోచారములో గ్రహస్థితినిబట్టి మరణకాలమును సూచించు సూత్రములు పెక్కు లున్నవి.

ఇవి ఇట్లుండ, తాజక సంప్రదాయము వారు వేరుపద్ధతుల నవలంబించుచున్నారు. పైపద్ధతులతో సంబంధము లేని నూతనమార్గములతో పాశ్చాత్యహోరాతంత్రవేత్తలు ఆయుర్నిర్ణయమును చేయుట కలదు.

మొత్తముమీద, ఈ ఆయుర్దాయ విషయము గొప్ప గందరగోళముగా నుండి విద్యార్థులకు దుస్సాధ్యమగు స్థితిలో ఇప్పటికి నిలిచియుండుట వాస్తవము.

కావుననే, "అతీంద్రియజ్ఞానము (*Intuition*) సంపాదించనిదే, జ్యోతిశ్శాస్త్రవిజ్ఞాన మెంతయుండినా, ఆయుస్సునికరము నిర్ధరించుట సాధ్యముకాదు." అని శ్రీ బి. వి. రామన్ ప్రముఖ పండితులు అభిప్రాయపడుచున్నారు.

కాని, అతీంద్రియజ్ఞానసంపన్నులకు జ్యోతిశ్శాస్త్రముకాని, మరి ఏశాస్త్రముకాని అవసరము లేదని మనవి. కార్యకారణసమన్వయరూపమయిన శాస్త్రీయపద్ధతి అతీంద్రియజ్ఞానముగలవారికి నిరుపయోగముకదా ? అది యట్లుండె.

ఆధునికవిద్యార్థుల ఉపయోగమునకై, ఆయుర్దాయవిషయమున ప్రాచీనపద్ధతులను సులభముగా చూపగల గ్రంథము లెన్నో బయలుదేరవలసియున్నవి. జాతకశాస్త్రానుభవమున సిద్ధహస్తులయిన పండితులు ఈపని బూనవలసియున్నది. జ్యోతిషాచార్యులగు శ్రీ జి. శ్రీరామమూర్తిగారు ఆయుర్దాయవిషయమున సమగ్రమగు గ్రంథమును వ్రాయుట కెంతయు సమర్థులు. వారి అనుభవమునకు ఫలమీ గ్రంథము. ఆంగ్లభాషాభ్యాసము గల ఆధునికవిద్యార్థులకు ఇట్టి గ్రంథ మమూల్యమైనది. విషయవిభాగము చక్కగా చేయబడి గ్రంథము సులభశైలిలో వ్రాయబడుట మోదావహము. బాలారిష్టయోగములతో ప్రారంభమై, యోగారిష్టసూత్రములను తెలిపి, అల్పమధ్యదీర్ఘాయుర్యోగములను వివరించి, తరువాతనే ఈగ్రంథము క్లిష్టమయిన గణితాయుర్దాయముల ప్రసక్తికి పూనుకొన్నది. ఉత్తరకాలామృతకారుని నక్షత్రాయుర్దాయము సమగ్రముగా గ్రంథకర్త వర్ణించి, పిండాయుర్దాయము సాధించు మార్గమును, సోదాహరణముగా తెలిపినాడు. జైమినిపద్ధతులలో సులభమయిన మార్గ మొకటి చూపబడినది. సమగ్రముగా అష్టకవర్గాయుర్దాయమును గూర్చిన చర్చ

జరిగినది. మారకదశానిర్ణయమును గూర్చిన నిబంధనలు, గోచారమారకసూత్రములు బాగుగా గ్రంథకర్తగారు చర్చించినారు. ఉత్కలదేశములో వాడుకలో నున్న శిశుపతాకీ రిష్టమను పద్ధతితో కూడ, తాజక సంప్రదాయముపయితము గ్రంథకర్తగారు సూచించి, దృష్టాంతరూపముగా కొన్ని జాతకములను విమర్శించి యున్నారు. అనేకగ్రంథపరిశోధన, గొప్ప అనుభవము కలవారగుటవలననే గ్రంథకర్తగారు ఇట్టి గ్రంథము వ్రాయగల్గుట.

ఒకే జాతకమునకే భిన్నపద్ధతుల నుపయోగించినపుడు వేర్వేరుగా ఆయుఃప్రమాణము వచ్చుట సంభవించుచున్నది.

ఈ గ్రంథములోని ఉదాహృతజాతకమునకు గ్రంథకర్తగారు సాధించిన ఆయుః ప్రమాణము లిట్లున్నవి:—

| | | సం॥ | నెల |
|---|---|---|---|
| ౧. నక్షత్రాయుర్దాయము | ... | ౨౨ | ౧౧ |
| ౨. పిండాయుర్దాయము | ... | ౬౫ | ౮ |
| ౩. జైమినీయాయుర్దాయము | ... | ౮౦ | ౯ |
| ౪. అష్టకవర్గాయుర్దాయము | ... | ౫౯ | ౯ |
| ౫. ఉత్కలపద్ధతి | ... | ౬౮ | ౯ |

వీనిలో ఏ రెండింటికయినా ఐకకంఠ్యము రాలేదు. ఎవరి అనుభవమునకు సరిపడిన పద్ధతిని వారు ఉపయోగించుకోవచ్చునని సూచించి "ఏపద్ధతిలో హెచ్చుగా ఆయుర్దాయసంవత్సరములువచ్చునో దానినే ఆశ్రయించుట శ్రేయస్సు" అని గ్రంథకర్తగారువిద్యార్థులకు హితి ముపదేశించినారు.

జాతకములు వ్రాసి జీవించువారికి ఇది చక్కని ఉపదేశ మనుట నిర్వివాదాంశము. కాని శాస్త్రదృష్టిలో దీనికి మంచి విలువ యున్నదా యని సందేహించవలసి యున్నది. ఇట్టి ఫలాదేశములను మనస్సులో ఉంచుకొనియే కాబోలు, నీలకంఠదీక్షితుడు తన కలివిడంబన శతకములో—

"ఆయుఃప్రశ్నే దీర్ఘమాయుః
వాచ్యం మౌహూర్తికైర్జనైః
జీవంతో బహుమన్యంతే,
మృతాః ప్రక్ష్యంతి కం పునః!"
అని హేళనము చేసినాడు.

కాని ప్రస్తుతము మనశాస్త్రముండు పరిస్థితులలో ఇంతకంటె గొప్ప, ఫలమును మనము కాంక్షించరాదేమో! రాజాశ్రయమునశించగా, విద్యాపీఠములు అనాదరమునకు పాత్రమై ఈపవిత్ర శాస్త్రము కళ దక్కియున్నది. ఆర్ష సంప్రదాయరహస్యము లనేకములు మరుగుపడి త్రుప్పుపట్టినవి. అనేకసూత్రములకు అర్థము చెప్ప మహనీయు లరుదైవారు. పరిశోధనములు సలుపు వారు చాలినంతమంది లేరు. దొరకినదే లాభ మను కొను స్థితి దాపరించినది. ఇట్టి సన్నివేశములలో ఈ గ్రంథకర్త సూచించిన పద్ధతితప్ప గత్యంతరము లేదేమో? అది యట్లుండె.

మధ్యలసాధనము చేష్టాకేంద్రగణితము మున్నగు పద్ధతులతో కూడ శ్రీపతిసంప్రదాయము ననుసరించి, అంశాయుర్దాయాదులు గుణించు మార్గములను గ్రంథకర్తగారు చూపియుంకినచో ఈ గ్రంథము హెచ్చు ప్రయోజనకారిగా నుండియుండెడిది.

ఇచ్చిన దృష్టాంతజాతకములకు స్పష్టలగ్న గ్రహాదులను గ్రంథకర్తగారు ఉదాహరించలేదు. చాల వరకు కేవలరాశికుండలులతోనే కాలక్షేపము నడచినది. "రాశిచక్రముతోనే తృప్తిపడరాదు. స్పష్టగ్రహముల సాధించి షోడశవర్గబలమును కనుగొనవలెను" అనుట గ్రంథకర్తగారి ఉపదేశము. కాని ఉదాహృతజాతకములకు తామే ఆపని చేసి చూపలేదు. పోగా ఆ జాతకములకు జన్మస్థానపు అక్షాంశరేఖాంశలు, జన్మకాలము మున్నగు అత్యవసర సామగ్రియయినా గ్రంథములో ఇచ్చియుండవలసినది. ఇవి లేనందున, గ్రంథకర్తగారు చెప్పినది విని ఊరకుండవలసినదేకాని ఆ జాతకములను స్పష్టపరచిచూచుటకు విద్యార్థుల కవకాశమే లేకున్నది. ఇది వాస్తవముగా గొప్ప లోపము.

గ్రహయుద్ధ మనగా, కుజునితో ఇతరగ్రహముల సంయోగమువలని ఫలమని గ్రంథకర్తగారి అర్థమని

కానవచ్చుచున్నది. ఇది సిద్ధాంతవేత్తల అభిప్రాయమునకు చాల భిన్నము. సనాతన పద్ధతులకు భిన్నమైన అభిప్రాయము లిచ్చునపుడు తగిన ఉపపత్తినిచూపుట ధర్మము. లేనిచో అనవస్థాప్రసంగ మగును.

గుళికసాధనమును గూర్చి గ్రంథకర్తగారు ఉపయోగించిన సూత్రము బృహత్పారాశరహోర, సర్వార్థచింతామణి మొదలగు గ్రంథములలో చెప్పబడిన పద్ధతికంటె భిన్నమయినది. దీని ననుసరించి గుళికోదయము గురువారమునాడు ౨౨ గడియలగును. ఈపద్ధతి ఏ మహర్షిమతమో తెలుపవలసియుండెను.

"పాశ్చాత్యపద్ధతిలో లగ్నము సంవత్సర మొకటికి ౫౯ కలల చొప్పున జరిపినచో, ఏవయస్సునకు అష్టమభావమునకు సమసప్తకస్థితికి రాగలదో ఆ వయస్సున మరణము వచ్చును." అని ఒక సూత్రమును గ్రంథకర్తగారు నిర్వచించినారు (౧౩౫ వ పుట). ఏగ్రంథములో నుండి ఈ అపరూపపు సూత్రమును స్వీకరించిరో తెలియకున్నది. ఇది సత్యమైనచో పాశ్చాత్యదేశవాసులకు రమారమి ౩౦ సంవత్సరములకే ఆయువు ముగియునని సిద్ధాంతము చేయవలసియుండును.

పాశ్చాత్య దేశములలో వాడుకలో నున్న మారకయోగము లని, రెండో మూడో, దృష్టాంతజాతకముల విషయములో ప్రసంగవశమున తమ నిర్ణయమునకు అనుకూలమయినవి గ్రంథకర్తగారు వాడుకొనిరి. పాశ్చాత్యపద్ధతిని సమగ్రముగా చూపని సందర్భములో ఒకటి రెండు సూత్రముల నిట్లుపయోగించుట విద్యార్థులపట్ల నిర్దయ చూపుటమాత్రము కాక పాశ్చాత్యశాస్త్రజ్ఞుల కన్యాయముకూడ చేసినట్లగును. ఒక జాతకమునకైనను వారి పద్ధతిని ఉపయోగించి ఫలము చూపి, మన పద్ధతుల ఫలముతో పోల్చియుండవచ్చును.

౩౧ సంవత్సరముల వయస్సున విషపానముచేసి ఆత్మహత్య చేసికొన్న సింహలగ్నపువ్యక్తిజాతకము విషయములో అల్పాయుర్యోగములు కొన్ని సాధించి విపత్తారాపతి యగు శుక్రదశలో నైధనతారాపతి రాహు భుక్తి మరణము నిచ్చిన దని గ్రంథకర్తగారు చూపియున్నారు (౪౬ వ పుట). ఈ భుక్తి మూడు సంవత్సరముల కాలము వ్యాప్తిలో నుండునట్టిదగుటచే మరణకాలమును సూచించుట కిదిచాలదు. కుజ శుక్ర రాహువుల సంయోగపు ఫలముగా విషపానమువలని ఆత్మహత్య వచ్చిన దని గ్రంథకర్తగారి తీర్మానము. కుజానికి శుక్రరాహువులు ౧౨ భాగల దూరములో నున్నారు. ఇట్టి సంయోగము చాలునా? పైగా ఈ మూడుగ్రహములు లాభభావములో నుండుట! ఆత్మహత్యకు విషలాభ మేనా వీరి ఫలము?

ఈ జాతకమునకు పాశ్చాత్యపద్ధతి ననుసరించి సాయన కుండలిని సాధించి దినవర్ష దశాపద్ధతితో చూచినపుడు మరణకాలమునకు ఈక్రింది యోగములు స్పష్టముగా చూడనగును:—

(౧) చలితరవికి అష్టమాధిపతియగు కుజుని సంయోగము;

(౨) చలితకుజునికి జన్మవరుణుని సమసప్తకవేధ;

(౩) చలితగురువు (సప్తమమారకాధిపతి) నుండి చలిత రవిజన్మకుజులకు అర్ధకేంద్ర వేధ;

(౪) చలితబుధునికి (లగ్నాధిపతికి) చలితకుజుని సంయోగము; వరుణుని వేధ;

(౫) ఆత్మహత్యను సూచించు కర్కాటరాశి ౧౫ వ భాగతో చలితకుజ చలితబుధసంబంధము.

దీనికి వరుణవేధ. దశాయోగము తీవ్రతరమై యుండగా, ౫-౧-౧౯౩౯ నాడు వచ్చిన పర్వము (పూర్ణిమ) లో మకరము ౧౫ వ భాగలో రవి, కర్కాటకము ౧౫ వ భాగలో చంద్రుడు నిలుచుటచే పైయోగములకు వెంటనే ఉత్తేజన కలిగినది. నిష్పక్షపాత దృష్టితో గమనించితిమేని, ఈయోగములకు విలువ లేదనగలమా?

ఉదాహరణజాతకమునకు లగ్నము మకరరాశిలో ౧౩ భా ౨౧ కలలుగా వ్రాయబడినది. కాని అష్టమభావము సింహరాశిలో ౮ వ భాగ యని కెరొకచోట కలదు. అయినచో, మధ్యలగ్నము కన్యారాశిలో ౨౨ భా ౧౬ కలలని తేలగలదు. దశమకేంద్రము కన్యలో ఉన్నప్పుడు, ఉత్తరార్ధగోళములో ఏ అక్షాంశలో జనించినవారి కయినా, లగ్నము మకరమందుండుట సంభవమా? ఈ భావసాధనక్రమము గ్రంథకర్తగారు ఏసంప్రదాయము ననుసరించి చేసిరో తెలుసుకొనుటకై విద్యార్థులు కుతూహలపడుట అస్వాభావికము కాదు.

అరిష్టములను తెలుపు యోగములలో కొన్ని అర్థవాదరూపమైనవా అనిపించును. కొన్ని దృష్టాంతము లివి:—

(౧) "చంద్రుడు ౧ నుండి ౬ భావములలో నుండి రవి ౯ వ భావములో నున్నచో, శిశువు ౧౨ దినములు జీవించును." (౧౯ వ పుట.) నెలలో ౧౪ దినములలో ప్రతిదినమునందును సుమారు రెండుగంటల కాలము ఈ యోగ ముండగలదు.

(౨) "గురువు కేంద్రములో నుండక కుజుడు కేంద్రమం దున్నచో, మృతశిశువుజనించును." (౨౦ వ పుట) గురుకుజులు పరస్పర కేంద్రములలో లేని నెలలలో, ఏదినమందైనా ౭ గంటల కాలము ఈ యోగము సిద్ధించును.

ఇట్టివే మరికొన్ని కలవు. ఇతరదుర్యోగముల సాహాయ్యము లేనిదే ఇవి యింత దుష్ఫలము నీయగల వనుట సాహసము.

ఇది యిట్లుండ, ఇచ్చినఉదాహరణమో, సూత్రమో అశుద్ధముగా నుండి విద్యార్థులకు గొప్ప చిక్కు కల్గించుచుండుట చింతాకరము. ఈక్రింది దృష్టాంతములు చూడుడు:—

(౧) "గ్రహభుక్త నక్షత్రసంఖ్యను ౩ తో భాగించి శేషమును ౪ తో గుణించగా వచ్చు సంఖ్య ఆరాశిలో భుక్తమయిన పాదములను తెలుపును." (పుట ౫౧)

ఈ సూత్రము సరికాదు. పైసంఖ్య రాశిలో గ్రహభుక్తపాదములను తెలుపజాలదని రాశి నక్షత్ర జ్ఞానము ఏకొంత కలవానికయినా తెలియును.

(౨) "శేషములో ౩'-౨౦" గుణించగా భుక్త పాదములు వచ్చును" అను సూత్రమునయితము తప్పే! (౫౧ వ పుట) "గుణించగా" అనుటకు మారు "భాగించి చేయగా" అని యుండవలయును.

(౩) ౩౭ వ పుటలోని కుండలిలో సింహములో లగ్నము, ధనుస్సులో రవియు చూపబడినవి. కాని ఈ కుండలిప్రక్కనున్న వ్యాఖ్యానము ననుసరించి మకరములో లగ్నము, కన్యలో రవియు నుండవలెనని తేలుచున్నది. కేవలరాశికుండలిలోనే ఇన్ని తప్పులా?

(౪) ౨౮ వ పుటలోని కుండలిలోనయితము ఇట్టి తప్పే చూపట్టుచున్నది.

(౫) ఉదాహృతజాతకములోని జన్మకాలము ౪౭ వ పుటలో ఒకవిధముగా, ౪౯ వ పుటలో వేరొక విధముగా ఈయబడినది. ఏది సాధువో?

(౬) ఉదాహృతజాతకమును గూర్చినచర్చలో రవి చిత్రాప్రవేశము, ఘ ౪౧-౪౯ లకని ౪౭వ పుటలో, ఘ ౪౪-౪౦ లకని ౪౯ వ పుటలో వ్రాయబడినది. ఈ రెండింటిలో దేని నుపయోగించినా, గ్రంథకర్త గారు సాధించిన ఇష్టకాలము రాదు. ఇట్టి ఉదాహరణము లెన్ని పుటలయినా విద్యార్థులకు లాభ ముండదుగదా?

ఇదికాక శుద్ధప్రతి వ్రాసినవాని లోపమో, ముద్రాలయమువారి అశ్రద్ధయో, మరి ఏమోకాని కొన్నివాక్యములకు అనన్వయదోష మువపట్టినది. అనుటచే అర్థము గ్రహించుటే కష్టము.

| | | |
|---|---|---|
| (౧) | ౧౩ వ పుటలో | *Note.* |
| (౨) | ౪౬ వ పుటలో | ఉదాహరణము. |
| (౩) | ౩౨ వ పుటలో | *Rule* 6. |
| (౪) | ౩౮ వ పుటలో | *Rule* 26. |

మున్నగునవి దృష్టాంతములు.

ద్వితీయముద్రణమున ఈ గ్రంథము శుద్ధముగా, సమగ్రముగా వెలువడు నని ఆశించుచున్నాను. అట్లు పరిష్కరింపబడినపుడే అన్యదేశీయులలో ఈగ్రంథమునకు ఎక్కువ ప్రఖ్యాతి రాగలదు. అట్టి అవకాశము త్వరలో వచ్చునని నా విశ్వాసము.

రా. గో. కృ.

Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.